శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభోజచరిత్రము



గద్వాలరాజా

## రామభూపాలరావు బహద్దరువారి

ధనసహాయమువలన

గ్రంథకర్త

అగు

చిలకపాటి-వేంకటరామానుజశర్మచే

కపాలిముద్రాక్షరశాలయందు

ముద్రితమై ప్రచురింపంబడియె.

మద్రాసు.



1911.

వెల రూ. 1-0-0.

# ఉపోద్ఘాతము.

---

రసికవరులార? స్వయముగా విద్వత్కవియును విద్వత్కవిపోషకుండును నగు భోజభూపాలుని యౌదార్యాది గుణవిశేషంబులను తత్సభాలంకారులగు కాళిదాసాది మహాకవుల కవితా చమత్కారాతిశయంబులను దెల్పునట్టి "భోజచరిత్ర" మనుసంస్కృతప్రబంధము సంస్కృతభాషాభిజ్ఞులకు నత్యంతరసావహంబై యుండుట యెల్లరకుం దెల్లంబ గదా? దానియర్థ మాంధ్రజనులకుఁ దెలియమింజేసి యట్టిలోపంబు నివారించుటకై యీగ్రంథంబుఁ దెనుంగుకబ్బంబుగ రచియించినాఁడను.

ఇది రెండుభాగములు గలయొకసంపుటము. ఇందు మొదటిభాగమునకు "భోజరాజచరితనాటకము" అనియు రెండవభాగమునకు "భోజరాజకవిరాజచరితము" అనియుం బేళ్లు. భోజరాజచరితనాటకమునందు:— మొదటియంకమున సింధులమహారాజు జరాభరంబున కోర్వంజాలక కుమారుఁ డగుభోజునికి బుద్ధిసెప్పి ముంజునికి రాజ్యం బప్పగింపంబోవునపుడు జరిగినభోజసింధులులమాటలాడుపద్ధతి నద్భుతశాంతరసంబులును రెండవయంకమున భోజునిజన్మపత్రిక విని ముంజుండు భోజునిం జంప వత్సరాజును నియమింపఁగా వత్సరాజు పిలుచుకొనిరమ్మన్నయుపాధ్యాయుఁడు కపటసంభ్రమంబు నభినయించుటయందు రౌద్రహాస్యరసంబులును; మూఁడవయంకమున వత్సరాజు భోజునిం జంప శ్మశానంబునకుం దోడ్కొనిచనఁగా నాయిరువురకుం జరిగినచర్యలయందుఁ బ్రదర్శితంబు లగు నత్యుదారములగుభీభత్సకరుణవీరరసంబులును; నాల్గవయంకమునఁ బ్రాణత్యాగంబు చేసికొనం గడంగినలీలావతీకన్యకను మాలువేషంబుఁదాల్చినకుమారుండు రక్షించుటయందు శృంగారకరుణరసంబులును; అయిదవయంకమునఁ బుత్రవధశోకాతురుండై ముంజుఁడు వహ్ని సొరం బోవఁ గపటయుక్తిచే బుద్ధిసాగరుండు తప్పించి కుమారు నప్పుడు బతికించునట్లు తెలిపి భోజునికి లీలావతీపాణిగ్రహణంబును ధారానగరరాజ్యపట్టాభిషేకంబును సలుపుసందర్భమునందుఁ జూపవిడిచియుండుశృంగారకరుణాద్భుతరసంబులును సికజనులచేతోవృత్తినతులామోదభరాక్రాంతంబు సేయకమానవు. ఇదిపద్యములుగలసినకుంతలాదులవంటివైయేదంకములనాటకము. భోజునికథ యింత విపులముగా రసావహము నితరు లెవ్వరును వ్రాయలేదు. చదువుటకుఁ గర మింపై యుండును. మూలగ్రంథమున యర్థము నాటకరూపముగ లేకున్నను చంపూప్రబంధమునకన్న నాటకము రసికులకు నందాతిశయము గలిగించునది యగుటంజేసి నాటకరూపంబుగ మార్పంబడినది.

భోజరాజకవిరాజచరిత్రమునందు:—భోజరాజునకును; కాళిదాస, భవభూతి, భట్టబాణ, దండి, మాఘ, మల్లినాథ, శంకర, శుక, క్రీడాచంద్రప్రముఖులగు ననేకకవిరాజులకును జరిగినచరిత్రంబు చెప్పంబడియుండు. ఇదిసంస్కృతభోజచరిత్రములోనిశ్లోకములను పద్యములుగాను; గద్యములను వచనములుగాను కొంచెమేని భేదపడకుండ సరిగా నాంధ్రీకరింపఁబడినది. కడురసవంతంబు లని పేర్కొనంబడియుండు మూలములోనిసంస్కృతశ్లోకంబులు మాత్రము క్రింద వ్రాయంబడి వానికి వ్యాఖ్యానములును చెల్పంబడియుండు. సభలయం దుపన్యసించునపుడు ప్రస్తావోచితపద్యములు గావలసినవారికి మిగుల సహాయము. పూర్వమువలె సంస్కృతగ్రంథములోనిశ్లోకములు రెండు మూఁ డుపన్యసించువారలయెదుట నాంధ్రజనులు చెవులుదోరగించుకొని వినవలసినయక్కరలేదు. ఇది చదివినవారు పరులకు గంగాప్రవాహమువంటివాగ్ధోరణిచేఁ దామె యుపన్యసింపవచ్చు. సంస్కృతమున నర్థము వ్రాసినగ్రంథములు రసముసుఖాస్వాద్యముగామిచే టెంకాయలవంటివియయి యొప్పు. ఆంధ్రీకరింపబడినవి రస మతిసులభమాస్వాద్యమగుటంజేసి ద్రాక్షవంటివియయి వెలయు. గీ. మహిని జింతింపఁ జింతింప మనసుఁ జొచ్చు। నిక్షుసారంబులును సత్కవీంద్రమతులు। ముగుదపాయంపుఁబడతులనగవు దేరు। బెళ్కువాలారుఁజూపులకులుకుఁదనము. అనువచనము ఈగ్రంథముఁ జదివినంగాని నిక్కమని తోఁచదు.

---

☞ వినోదకథాకల్పవల్లియు, కాళిదాసచరిత్రప్రకరణంబును, ఈయాంధ్రభోజచరిత్రంబును పరస్పరసంబంధముగలవి గాన వీనిలో నొకటిజదువుకొన్నవారికి మఱిరెండు నత్యావశ్యకములు.

---

ఇది ౨౦ పౌనుల దళసరపు గ్లేజుకాకితములయందు ముద్రింపబడినది. వెల రూపాయ 1-0-0 పోస్టేజివగైరాలు 0-2-0 కొనువారలిచ్చుకొనవలయును.

వలయువారలీక్రింది అడ్రసుకు వ్రాసి తెప్పించుకోవలయును.

ఇట్లు

చిలకపాటి-వెంకటరామానుజశర్మ.

నెం, 33 కృష్ణప్పనాయక అగ్రహారవీధి.

మద్రాసు.

# ప్రకటన.

చమత్కారకథాకల్లోలిని. రెండవభాగము బహుదినములుగా ముద్రితముకాకుండి యిప్పుడు ముద్రితమైనది.

| | | | | |
|---|---|---|---|---|
| 1 | 0 | 0 | వెల | కాళిదాసచరిత్రప్రకరణము. |
| 2 | 0 | 0 | ,, | వినోదకథాకల్పవల్లి. |
| 1 | 0 | 0 | ,, | ఆంధ్రభోజచరిత్రము. |
| 3 | 0 | 0 | ,, | శ్రీబ్రహ్మవైవర్తమహాపురాణము. |
| 1 | 0 | 0 | ,, | ఆంధ్రకల్కిపురాణము |
| 1 | 0 | 0 | ,, | ఆంధ్రతనిశ్లోకి. |
| 0 | 6 | 0 | ,, | శ్రీతులస్యుపాఖ్యానము. |
| 0 | 14 | 6 | ,, | చమత్కారకథాకల్లోలిని. రెండుభాగములు. |
| 0 | 4 | 0 | ,, | సుమనోవినోదనభాణము. |
| 1 | 0 | 0 | ,, | శ్రీగోపీకథాకౌముది యనురాధికాపరిణయము. |

ఇవి మొత్తముగ రప్పించుకొనువారలకు రు. 8-0-0 కు వంపఁబడును. పోస్టేజీ వగైరా ఖర్చులు రు. 1-2-0 టియు కొనువారలచ్చుకొనవలయు. వలయువారలు ఈక్రిందిచిఋనామాదారునికి వ్రాసితెప్పించుకొన వచ్చును.

ఇట్లు

చిలకపాటి-వెంకటరామానుజశర్మ.

నెం. 33 కృష్ణప్పనాయక అగ్రాహారవీధి.

మద్రాసు.

# ఈనాటకమునఁ బ్రవేశించు పురుషపాత్రములు.

సింధులుఁడు=భోజునితండ్రి.

ముంజుఁడు=సింధులునిసోదరుఁడు.

భోజుఁడు=కథానాయకుఁడు.

బుద్ధిసాగరుఁడు=మంత్రి.

వత్సరాజు=వంగదేశపురాజు.

ఉపాధ్యాయుఁడు=ఒజ్జలువేషముధరించిన మాయామంథరుఁడు.

మారన, వెంగన } రాజభటులు.

పురుషుఁడు=బుద్ధిసాగరుని యనుచరుఁడు.

రాష్ట్రపాలుఁడు=సింధులునిరాజ్యకార్య నిర్వాహకుఁడు.

మాయామంథరుఁడు=బుద్ధిసాగరుని మిత్రుఁడు, మాయావి.

కిరాతకుఁడు=మారువేషధారియగుభోజుఁడు.

విజయాదిత్యుఁడు=భోజునిమామ.

కాపాలికుఁడు=చంద్రమాఘుండను నైంద్రజాలికవిద్యావంతుఁడు.

## స్త్రీపాత్రములు.

భానుమతిక=మనోరమసఖి.

బుద్ధిమతిక=సావిత్రిసఖి.

కల్పవతిక=సావిత్రిసఖి గూఢచారిణి.

కన్య=లీలావతి.

దాసికలు=మనోరమయూడిగఁపు కత్తెలు.

సావిత్రి=భోజునితల్లి.

లీలావతి=కథానాయిక.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీమదాంధ్ర భోజచరిత్రము.

అందు

## భోజరాజచరితనాటకము.

### ప్రథమాంకము.



నాందీపద్యము.

శ్రీమంతం బగుశూరునన్వయమున న్జెల్వొందఁగాఁ బుట్టి యు,
ద్దామప్రాభవయుక్తి నేరికిని దుర్ధర్షంబుగా నింపుతో,
బూమెల్ బూనుచు న్దాతమిత్రవశతం బొంకంబుగా డాగి ని,
స్సీమశ్రీగతి మించుచక్రధరుఁ డీక్షించు న్గృపాదృష్టులన్.

---

నాటకాదిరూపకములకుఁ దొలుతం జెప్పంబడుపద్యము నాంది యనంబడును. అది నందీశ్వరప్రీతిగఁ జేయంబడునదిగాన నాంది యని పేర్కొనంబడియెడిని. ఈనాందియందు నిరువదిరెండుపదంబు లున్నవి గనుక నిది ద్వావింశతిపదం బగునాంది.

ఇది శ్రీకృష్ణపరం బగుమంగళము. శూరుఁ డనువాఁడు వసుదేవునితండ్రి. అతనివంశమునం బుట్టినవాఁ డని యర్థము. ఇంద్రుఁడు పరమేష్ఠి మొదలగువారలకుఁ దనప్రభుత్వము లోఁబడనీక యనేకవిధము లగురూపంబులు దాలుచుచుఁ దనతండ్రికిం జెలికాఁ డగునందునిస్వాధీనతవలన వసుదేవునికుమారుం డని యెఱుకపడనీక మఱఁగి యుండి కంసవధానంతరము అప్రమేయం బయినమధురారాజ్యసంపదచేత వెలుంగుచక్రాయుధధారి శ్రీహరి కృపాకటాక్షములఁ గాంచుఁగాఁత.

శూరుఁ డగుసింధులపూర్వునివంశంబునం బుట్టి తనప్రభుత్వయుక్తి వత్సరాజు మొదలగువారలకు సహ్యంబు గాకయుండఁ దండ్రికిం జెలికాఁ డగుబుద్ధిసాగరునిస్వాధీనత మఱఁగియుండి యనంతరము నిస్సీమం బగుతనతండ్రిరాజ్యలక్ష్మిం బడసి భూచక్రంబు భరించినవాఁడు కథాప్రతిపాద్యనాయకుఁడు భోజుం డని కావ్యార్థసూచన మించుక సేయంబడియె.

నాంద్యంతంబున సూత్రధారుండు రంగంబుం బ్రవేశించి,,

ఉ. † ఎందఱో మందబుద్ధులిల నింపఱి జల్లిపదంబు లల్లుచుకా,
వందలువందలై కవులవాసి పదంపడి కోరుచుంద్రు వా,
రెందుకుని పద్మనిర్గళదహీనమరందఝురీపరంపరా,
మందవచోవిలాసములమాటలకుం గృతదూరవర్తనుల్.

కోఁతపడుచు,,

ఇసీ! ఎవ్వఁడో కావ్యనాటకాలంకారగంధం బాఘ్రాణింపనినరాకృతి కవి ననుచు రాఁగాఁ గుతూహలంబునం దత్కరతలగతం బగుపాత్రంబుం గైకొని తమిపెల్లునం జదివితిని. కట్టా! యేమందు నాయధమకావ్యంబునవగుణంబులు!

చ. † రస మనుమాట లేదు పదరాజి సులక్షణయుక్తిఁ గాంచ దే,
దెసల నలంకృతుల్ కృతులదివ్యసుదృష్టికి నైన గానరా,
విసిరా కథాధినేత గుణహీనుఁడు నీచులవృద్ధి సెప్పుటే,
పసయుట యమ్మలక్కలకుఁ బాఠ్య మదొట ఫలంబుపో కృతికా.

క. ‡ రసహీనకావ్యకన్యక । నసువర్జితఁ బేదపట్టి ననలంకృత దో,
షసముచ్చయపరిపూరిత । రసికులు చేపట్టఁ గడఁగ రా దంద్రు బుధుల్.
కాననట్టియధమకావ్యవిలోకనజనితంబగు పాపంబుంబాపికొనునుపాయం బెవ్వరు నాకుం దెల్పువారు ?

---

నాందీశ్లోకంబుం బఠించి మొదటిసూత్రధారుండు రంగంబువెడలుడు వానివంటి వాఁ డన్యుండు సూత్రధారుండు రంగంబు బ్రవేశించి చెప్పుచున్నాఁ డనియర్థము.

† నవనాగరికు లని పేరుపెట్టుకొని రసోత్తరంబుగం జెప్పలేనికైతగాండ్రకైత లిట్టులుండు నని యెల్లరకుం దెల్లంబ. పూర్వకవులపథంబుం బరిత్యజించినపండితంమన్యులే ప్రాయికముగ నవనాగరికు లయి యున్నారు.

‡ క. తను వగు శబ్దార్థంబులు । ధ్వని జీవ మలంక్రియావితానము సొమ్ముల్ ॥ [illegible]గుణంబులు గుణములు । ఘనవృత్తులు వృత్తు లౌర కావ్యేందిరకు ॥ అని [illegible] [illegible] రసము [illegible] ప్రాణములులేనిశవకన్యకయే యగు. [illegible] గీ. జల్లిపదములు నాలుగు సంతరించి । గురువు లిడుచోట లఘువులు కొన్ని గూర్చి । విరతి గూడక మీఁదులు వెదకికొనుచు । నచ్చుఁ బొల్లులపైనం [illegible]డు కవియె ॥ అన్నట్టులు పదములు దొరకక యందఱకుం దెలియందగినపదంబులె [illegible] ననుభేదకుం బుట్టినది యని యర్థము. కాననే సొమ్ము లయినయుప

నటి ప్రవేశించి,, ఆర్య !

చ. శ్రీ కవికులకల్పకం బనుచు గౌరవ మొప్పఁ బ్రసిద్ధిఁ గాంచి భూ,
భువనమునందు సాధుజనపుంజసుజీవనమై తనర్పఁగా,
నవనవకల్పనాకలనవందితభావుక మైనకావ్యముల్,
దవిలి యొనర్చినట్టిగుణధన్యుఁ దలంపుము పాపశాంతికిన్.

సూత్రధారుఁడు. నటీ! నీచెప్పినది యొప్పు. భవదుక్తంబు లగుగుణంబులు గలయుదారుండు భోజభూపాలుండ. తదీయస్మరణంబు సుకవికల్పితకావ్యవిలోకనపాపంబుం బాపికొన నీచేఁ బ్రస్తావితం బగుచు నిప్పు డే సేయంగడంగినపరిషత్సమారాధనంబునకు సాధనం బయ్యె. ఎట్లనిన !

చ. సకలకలావిచక్షణులు సారససంభవతుల్యగౌరవుల్,
ప్రకటితశారదేందురుచిపాండురకీర్తులు భవ్యమూర్తు లీ,
సుకవికులావతంసులు విశుద్ధమతుల్ సభఁజేరి రీకవి,
ప్రకరము భోజభూధవునిభవ్యకథన్ ముద మందఁ జేసెదన్.

నటి. ఆర్య! యీచేరియుండుకవిప్రకరంబు భోజభూమీంద్రునికథాసంతానం బెఱుంగకయుండునే? అపూర్వకథాకథనంబునం గాదె రసికసభ యానందించు ?

సూత్రధారుఁడు,, నటీ ! సత్యంబ ! అయినను,

గీ. పూర్వకథ యైనఁ గవివరాపూర్వకల్ప | నామనోహర మగునేని రామచరిత,
మట్లు నవనవరసముల నప్పు డపుడు | రాణఁ దులకించు సత్కవిరాజి వొగడ.

నటి. ఆర్య మీనుడివినయది సమంజసంబ. అట్లు ధారాధీశునిచరిత మేకవి రచించినఁవాఁడు?

సూత్రధారుఁడు. నటీ! యిట్లడిగెదవేల? గీర్వాణవాణి నుండుభోజచరితంబును చిలకపాటివేంకటరామానుజశర్మ యాంధ్రభాష నాటకంబుగ రచించియుండలేదా!

---

మాదులు లేనిది. శాస్త్రజ్ఞానములేమి దోషంబులు దూరీకృతంబులుగఁ జేయమివలననొండె [illegible] ననొండె దోషసముచ్చయపూరితత్వము జనకుని [illegible] గావ్యేందిరకు సంభవిం[illegible] లేక యుండుకన్యాశపమును వరుఁడు గోరఁ డట్టులు [illegible] [illegible]కుఁడు చేపట్టఁ డనుట.

శ్రీ భోజరాజురచించినప్రబంధంబులు. సరస్వతీకంఠాభరణము, రాజమార్తాండము, రాజమృగాంకకరణము, సమరాంగణము. శృంగారమంజ[illegible] రామాయణచంపు[illegible]

నటి. స్మృతినభినయించి" ఔను! స్మరణమునకు వచ్చినది. అకవి లక్షణజ్ఞులు మెచ్చుకొనం దగినవాఁడు. ఆతనిపల్కులును పేశలంబులు. కాన నారూపకంబుం బ్రయోగించితిమేని యీసామాజికులమనంబుల నావర్జింపంగలము.

సూత్రధారుఁడు. నటీ! అట్లైన సంగీతకంబునకుం దొడంగుము.

నటి. పాడుచున్నది,,

ఉ. \$ ఉత్తమవర్ణబంధురత యుండిన గంధకలావిహీనతన్,
చిత్తము కర్ణికారమును జెప్పినచో వెస నుమ్మలించెను,
మ్మొత్తతిసైన సద్గుణములెల్ల సమగ్రముగాఁగ నొక్కచో,
నొత్తిలిఁ జేర్పఁ బూనఁడు పయోజభవుం డిలఁ బ్రాయికంబుగన్.

సూత్రధారుఁడు. నటీ! నీవుడివినమధుసమయవర్ణనంబునందుఁ గర్ణికారంబున కుత్తమ వర్ణంబుండియు గందంబు లేకపోయెనే యని చిత్తం బుత్తలంపడుచున్న దనియు; విధి య న్నిగుణంబుల నొక్కచో సమగ్రంబుగ నుంపం గడంగం డనియు నుడువం బడుటంజేసి ముంజుం డుత్తమభూభృద్వర్ణసంభవాదరణీయుం డయ్యు సుగుణంబులు సమగ్రంబులు గామి నాతనియందుఁ జిత్తం బుత్తలంపడుచున్న దనుప్రస్తుతార్థంబు సూచితం బయ్యెడిని.

నటి. \$ నేపథ్యంబువలనికి మరలి చూచి. సంభ్రమంబుతో,,

ఆర్య! మెల్లనఁ బల్కుము. అదిగో ముంజభూపతి కుఱంగటన గానంబడియెడిని. ఈమాట యతనిచెవి కెక్కకయుండుట లగ్గగదా !

సూత్రధారుఁడు. తిరిగిచూచి,, నటీ! నాయగ్రజన్ముండు భరతపాలకుండు సింధు ల[illegible]థ్యంబుఁ దాలిచి ముంజభూనాథనేపథ్యధారి యగుభావపాలకుం డనునాయనుజన్మని తోఁ గూడి భోజకుమారుని నేపథ్యంబు వడసియున్నయస్మత్పుత్రునికి రసపాలకునికి హితం బుపదేశించుచున్నవాఁడు.

నటి. ఆర్య ! సింధులుఁడు ముంజునియెదుటందనపట్టికి హితంబు దెల్పవలసిన ట్లేమి.

సూత్రధారు[illegible]. నటీ ! చెప్పెదన్ను విన్నుము.

ఉ[illegible] జ[illegible]

---

[illegible]ధురత యనుచో నుత్తమ మగురంగువలన నందగించుటయని కర్ణికా రపరముగను, గొప్పవంశ మయినక్షత్రియజాతియందు జనించుటవలన నాదరణీయుం డని ముంజునిపరముగను శబ్దశ్లేషయు సహితము, కావ్యార్థసూచనమున కుపయుక్తము.

\$ నేపథ్య[illegible]గాయకప్రభృతు లుండెడియవనికాంతస్థలము.

నాటకమునందు ప్రథమాంకము.

ద్వేజితవైరిచక్రుఁడయి వేడుక నేలి జరాభరంబునం,
దేజ మడంగి యిప్పుడు మదిం దనకాయనిపాత మెంచుచున్,
భోజకుమారుఁ దమ్మునికి బుద్ధులు సెప్పుచు నొప్పగించెడిన్.
కాన మన మనంతరకరణీయంబునకు సన్నద్ధులము గావలసియుండుటం జేసి చనియెదము రమ్ము.

అనుచు నిష్క్రాంతులైరి. ప్రస్తావన.

ప్రథమాంకము.

అంత సింధులుండును ముంజుండును భోజకుమారుండును ప్రవేశించుచున్నారు.
సింధులుఁడు. భోజకుమారునిం జూచి,, తాత మదీయజీవితనిబంధన!

చ. వినుము హితంబు నేను పృథివీపతిమండలమౌళిమాలికా,
ఘనన [illegible] రత్న కాంతిచయకర్బురితోన్నతపాదపీఠశో,
భనతరభద్రపీఠమునఁ బాయక పాలితిఁ గాల మెల్ల నిం,
కను భరియింపఁజాల నిలఁ గాశ్యపి ముంజున కొప్పగించెదన్.
ఏలయనియెడిగెద వేమొ!

చ. † నిర [illegible] మపద్మషండమున నిర్మలశారదచంద్రచంద్రికా,
భర మ [illegible] దెల్లుచందమునఁ బాండురకాంతి జరాభరంబు నా [illegible]

---

ప్రస్తావనయనఁగా:—సూత్రధారుఁడు నటితోనొండె విదూషకునితోనొండె న లాడుచుం జిత్రోక్తులం దనకార్యంబు నుడువు నెపంబునఁ బ్రస్తుతకథోపక్షేపణము గావించుట. దీని కాముఖ మనియుం బేరు? అంకము అనఁగా:—

శ్లో॥ ప్రత్యక్షనేతృచరితో బిందువ్యాప్తిపురస్కృతః। అంకో నానా ప్రకారార్థ సంవిధానరసాశ్రయః॥ అను లక్షణ [illegible] కథా [illegible] ప్రత్యక్షముగా [illegible] పురస్కరించుకొని నానాప్రకారంబు లగునర్థ [illegible] విధానంబులు [illegible] రసాశ్రయంబై యొప్పునది గాన నిద్దియంకమనంబడును. బిందువనఁ గా నవాంతరకథలచేత ప్రధానకథకు [illegible] లుగునట్టు [illegible] నదిగ [illegible] యుండునది. ప్రియవ్రతాదులచరిత్రములం దిది చూచుకొనవచ్చును.

† కమలకాననమునందు శరచ్చంద్రికలు గుంపై పడినచందంబున నాశరీరమునందుఁ దెల్లనిముదిమి పడి సౌందర్యాదులఁ జెఱచి ప్రాణముండుటయందు సయితము సంశయము ను గలిగించుచున్నది యని భావము. ముదిమి వెన్నెలవంటిది. కమలకాననము [illegible] టిది సీ [illegible]

సురుచిరదేహమందుఁ బడి సొంపును నింపుఁ దొలంచి జీవిత,
స్ఫురణమునందు సంశయముఁ బూనఁగఁ జేయఁ గడంగె మెండుగన్.

భోజకుమారుఁడు. తండ్రీ నీచెప్పినవచనంబునకుం బ్రతివచనం బనుకొనకుము. సంశయం బడిగెదను తెల్పుము.

గీ. బాలభావంబునన నీవు బాహుగర్వ। శమితవైరిచయుండవై సకలరాజ్య,
తంత్రనిర్వాహభారంబు మంత్రులందు। నునిచి సుఖ మున్నవాఁడవు ఘనతతోడఁ,

గీ. మంత్రులును నీకు శ్రమ మణుమాత్రమైన। గలుగకుండంగ నేర్పునఁ గార్యతతులు,
దీర్చుచున్నారు సూక్ష్మమతిప్రగల్భు। లధిప యీయుద్యమం బేల యాత్మఁదలఁప.

సింధులుఁడు. ఆత్మగతంబున,,

ఔర వీనిబుద్ధిచతురత మెచ్చవచ్చు !

ప్రకాశముగ,,

తండ్రీ నీయడిగినయర్థంబు సమాధాతవ్యంబ వినుము.

నరజన్మంబునకు న్ఫలం బనుచు శ్రీనాథుం భజింపంగ నా,
దరభావంబు జనించె నిర్భరమనస్తాపంబులం బాసి యీ,
ధరణిం గాయమ దుండునంతదనుక న్దామోదరుం గొల్చెదన్,
వర మౌతాపసవృత్తితో నడవిలో వర్తించెద న్బాలకా.

భోజకుమారుఁడు. తండ్రీ మీ రానతిచ్చినయర్థంబునందుం దపస్య సలుపుటకొ దపోవనంబునకుం బోవందలంచినవాఁడవుగాన రాజులేనిరాజ్యంబు పూజ్యంబై డదని యనుకొని ముంజమహీపతి కప్పగించెద ననుట యుపపన్నంబ యగు. భవత్పూనుం డగునీముంజభూరమణుండు ధారారాజ్యంబుం దాలుచుట యెల్లరకుం బ్రియంబనె అది యట్లుండనిండు. తపస్యాచర్య భగవద్భజనంబు సేయుటకుఁ దపోవనంబునకే [illegible] నెన్న [illegible] యెందేనిఁ గానంబడదు.

ఉ. [illegible] వనంబగున్
[illegible]గము గల్గినట్టిజ[illegible]జి తపోవని కేగిన న్మద[illegible]

---

లు[illegible]ను వెన్నెల కమలములకు [illegible]ము. అశ్లే ముదిమియు శరీరమున కని స్థా[illegible]ము

† విదేహరా జగుజనకుఁడు యాజ్ఞ్యవల్క్యమహామునికడ వేదాంతవిద్యాభ్యాసము సేయుచుండె. ఇతనిని స్పృహత్వ మితనితో విద్యాభ్యాసముచేయుమునుల కెఱుకపఱుపం దలంచి యాజ్ఞ్యవల్క్యుండు తనయోగమహిమచే మిథిలానగరంబు మండుచుండు

భోగవిలాసలీలఁ దలపోయక మానదుపో విదేహుఁడ,,
స్సాగరమేఖలాపతియు సౌభరి యిందు నిదర్శనం బగుక్.

ఇది యే వచించినదిగాదు. $ సర్వపురాణసారార్థంబు.

చ. ‡ వనజభవుండు సాధుజనవర్ణితకీర్తిఁ బ్రియవ్రతుండు నా,
జనపతిఁ జూచి పల్కు మునిసార్థము మెచ్చఁగ నిమ్మహార్థముక్,
విని వనవాసబుద్ధి పృథివీపతిసూనుఁడు వాసి సమ్మదం,
బున గృహమంద యుండి హరిఁ బుష్కరనేత్రునిఁ జెందె భక్తితోక్.

కావున నీవును దపోవనగమనచింతం బాసి విషయవిరక్తిం గైకొని గృహంబునంద శ్రీహరిపదకమలధ్యానలక్ష్మీవైభవంబున జననమును సార్థకము సేయుటయ యురవు దుర్భరం బగుజరాభారంబునకుం గుందుచుం జేయునది లేక క్రూరసత్త్వశరణ్యం బగునర ణ్యంబున ననారతభయభ్రాంతతఁ జిక్కుపడుట లగ్గు గాదు.

---

నట్లు గాన్పించె. గురుసన్నిధిం దత్త్వ విద్యాభ్యాసము సేయుచుండినబుషులు త[illegible] పడుమఁ దమగోఁచులు బోయినవేమో యనియు పెంకాయబుఱ్ఱలు వోయినవేమో[illegible] యుఁ జీకాకుపడసాగిరి. జనకుఁ డేమియుం జేయక యూరకుండె. యాజ్ఞ[illegible]వల[illegible] ముని గోఁచిపాతలరాయండ్రఁ యిట్లు తహతహపడఁగాఁ బెక్కండ్రు భార్యలు అపరి[illegible] మగునైశ్వర్యము చతురంగబలాదులు గలనీవు ఒకించుకయు సంభ్రమింపక య[illegible] విదేల యని జనకు నడుగఁగా నతఁడు మిథిల తగలంబడిన నా దేమి పోయె న[illegible] భగవం తుఁడిచ్చినది; భగవంతుఁడు గైకొనియెడి. మనకు వీనియందు మమత యేమి[illegible] యోగ మని భావము. ఇతఁడు ఇంట నుండియు విరక్తుఁడు. సౌభరి యనుమహర్షి[illegible] ఖ్యాతకాలము తపంబు రచించి యొకనాఁడు మీనములు జోడుగూడియుండఁ[illegible]వి సుఖించుటం గని యట్టిసుఖము కావలయు నని తలంచి పెక్కండ్ర రాజకుమా[illegible]రి ణయమాడి గొప్పకుటుంబియై సంసారమును బాయకుండె. ఇతఁ డడ[illegible]యుండుండినను రాగి యయినవాఁడు.

$ సర్వపురాణసారము:—శ్రీభాగవతము. తత్ప్రతిపాదితార్థమని య[illegible].

‡ స్వాయంభువమనువుకుమారుఁడు ప్రియవ్రతుం డనువాఁడు నార[illegible]పదేశంబు వినుచు రాజ్యభారనిర్వహణంబున కొప్పుకొనక యుండం జతుర[illegible]డతని యుండుకడకుం జనుదెంచి రాజపుత్రునికి భగవద్భజనంబు సేయం గోరిక[illegible] తన యింటనైనను విశుద్ధభావంబుతో హరిం దలంచుట యొప్పు. ఇందుకుం ద[illegible]న[illegible]నకుం జనవలయునన్నది లేదు. అని వచించి యతనిని భూభారనిర్వహణా[illegible] [illegible]వించె నని శ్రీభాగవతకథ.

సింఘులుఁడు. ఆత్మగతమున,,

వీఁడు బాలుం డయ్యు సకలశాస్త్రార్థంబు లుపన్యసించెడిని. ఇందు వీనికిం బ్రతివచనంబు లేదు. ఒప్పుకొనవలసినదయ్యె. ముంజునికి రాజ్యంబునప్పగించుటయందు వీనిసమ్మతం గైకొని యట్లు చేసి యుపరమించుకొందును గాక. ‘‘ప్రకాశముగ,,

వత్స నీచెప్పినవచనంబులు కర్ణరసాయనంబు లయ్యె. వనవాస * వ్యసనంబు మానుకొంటిని. మఱియొకయర్థంబు వినుము.

ఉ. బాలుఁడ వీవు సర్వనరపాలకపుంగవరాజిచేత ను,
త్తాలపరాక్రమస్ఫురణ ధైర్యగమున్ గయికొంచుఁ గప్పముల్,
శ్రీలఁ జరింపఁగాఁ దగినసింహపరాక్రమధుర్య లేలఁగాఁ,
బో[illegible]ను రాజ్య మియ్యది యపూర్వయశోవిభవాభిరామతన్.

ఉ. బాలతఁ బాసి నీవు పటుబాహుపరాక్రమస్ఫూర్తి వైరులన్,
బోల నడంచి సాధుజనపుంజము మేలన రాజ్యభారమున్,
లీల భరింపఁ జాలి † కృతలిప్సుఁడ వౌదువకన్ భరించు భూ,
పాలుఁడు ముంజుఁ డిచ్చు శుభభావముతోఁ దగ నీకు రాజ్యమున్,
ఇప్పుడు బాలభావంబున నుండునీకుం గర్తవ్యంబు వినుము.

చదువనివాని జానపదసంఘము మెచ్చదు పౌరసంఘముల్,
విదితగతి న్గణింపకయ వేఱు కట్టముపెట్టు బంధుగుల్,
ముదము దొలంగఁ జూతు రెక ముద్దియ లన్నను ప్రాణహీనున,
ట్లెదలఁ దలంతు రట్లగుట నెల్లజనుల్ జగునంగ నాగరన్.

ఇందు విశేషంబుగ రాజకుమారునకు; కుమార! విద్యాగ్రహణకాలంబున నేరికే కన్యాపరత్వంబు [illegible]నచో నావిద్య సాయంసంధ్యవలనఁ గమలవనశ్రీచందంబున నందంబు ద[illegible]ంగు. కాన;

క. [illegible]నరి దగుప్రాయంబున | మది కన్యపరత్వయుక్తి మాన్పఁగ వలయున్.
[illegible]లశాస్త్రార్థంబులు | హృదయమునకు వచ్చుదనుక నెలమిఁ జదువుమీ.
[illegible]తాత! విద్యవలనియుపయోగంబు సెప్పెదను వినుము.

---

* వ్యసనమనఁగా నదే లోకమైయుండుట.

† కృతలిప్సుఁడవు= [illegible]రికగలవాఁడవు. రాజ్యంబుగావలయునని నీవుకోరుదవు కనని భావము.

ఉ. మాతయుఁ బోలెఁ గాచుఁ బిత మాదిరిగా హితమందుఁ గూర్చుఁ దా,
నాతుక పోలెఁ దేలుచును నర్మిలిఁ గూర్చి శ్రమంబుఁ బాపుచున్,
భూతలమందుఁ గీర్తి నతిభూమిగ వేఁ గలిగించు విద్యను,
మ్మేతరుణంబునందయిన నిచ్చును గల్పకరీతి నన్నియున్.

క. పినతండ్రి నీకు ముంజుఁడు | ఘనమతి నావలెను నీకు గౌరవపాత్రుం,
డనఘమతి వానియందుం | దనయా యనువర్తనం బుదారతఁ గనుమా.

భోజకుమారుఁడు. తండ్రీ నీనుడివినయర్థం బవశ్యకర్తవ్యంబ.

ఉ. తాత జరాభరంబునకుఁ దగ్గితి వీవది నే నెఱుంగుదున్,
భూతలమందు మానవులపుంజము శ్రీహరిఁ గొల్చుటల్ శుభ,
వ్రాత మటంచు ముంజనరవల్లభుఁ డేలఁగలండు రాజ్యమున్,
నీతివిదుల్ సువిద్యలను నేర్చుట లగ్గు నందు రెల్లచోన్.

కాన భవదభిమతంబు నెఱవేర్ప నెల్లరకు లగ్గును.

సింధులుఁడు. ముంజునిం గాంచి,, వత్సముంజ!

క. బాలుని సద్గుణశీలుని | లాలితధారాధిరాజ్యలక్ష్మిని నీకుం,
బోలంగ నప్పగించెదఁ | గాలంబున బట్టి మిలకుఁ గట్టు మితనికిన్.

అని భోజకుమారుని ముంజునుత్సంగంబున వదలి తనవ్రేలినుండి తీసి ముద్రాంగుళీయకంబు ముంజుని కొసంగుచున్నాఁడు.

ముంజుఁడు. భోజుని నుత్సంగంబునం గూరుచుండంబెట్టుకొని. రత్నాంగుళీయకంబు వ్రేలనిడుకొని. ఆత్మగతంబున,,

ఇందుకేకదా యేను చిరకాలముగఁ గోరుచుంటి, ఇది దైవానుగ్రహంబువలన నేటికి ఫలించినది. రాజవంశంబునం జనించి ధరాపరిపాలనగౌరవంబుం బడయక జీవనమాత్రచరితార్థతఁ గాంచుపురుషునిజన్మం బెందుకు ?

ప్రకాశముగ,,

ఆర్య నీయానతిప్రకారము నడుచుకొనియెద ; నీ వింక రాజ్యభారచింతం బాసి జన్మము సార్థకము గావింప నసారతహరిపదభజనపరాయణత్వంబున సుఖముండుము.

సింధులుఁడు. ఎవరక్కడ !

ప్రతీహారి. ప్రవేశించి,, మహారాజ ! యిదె భవదాజ్ఞాకింకరుఁడ వేఁచియున్నాఁడ,

సింధులుఁడు. ప్రతిహారీ ! కుమారునిం దోడ్కొని చని విద్యాశాలయందు విద్యాచార్యుల కప్పగించి ముఖ్యామాత్యుని బుద్ధిసాగరునిం దోడ్కొని రమ్ము.

భోజకుమారునింగాంచి,, తాత విద్యాభ్యాసంబున కంతరాయము గల్గకయుండ విద్యాశాలకుం జనుము.

భోజకుమారుఁడు. అయ్య భవదాజ్ఞానువర్తనంబుఁ గావించెదను.

సింధులునికిని ముంజునికిని ప్రణామంబు సలుపుచున్నాఁడు,,

ఇరువురును. తాత ! బుద్ధిమంతుండవగుము.

ప్రతీహారి. కుమార ! ఇటురమ్ము,

భోజకుమారుండును ప్రతీహారియు నిష్క్రాంతులైరి.

సింధులుఁడు. వత్స ముంజ నీకుం దెలియని రాజనీతులు లేవు; అయినను ముఖ్యంబు లని కొన్ని యర్థంబులు నీకు నుడివెద. వినుము.

ముంజుఁడు. ఆర్య ! అవహితుఁడనై యున్నాఁడను. ఆనతిమ్ము.

సింధులుఁడు.

క. మహితకులక్రమాగతుల మంత్రులఁ గోశకులాధినేతలన్,
బహుభుజసారధుర్యులను భక్తుల సైన్యచమూవినేతలన్,
విహితవిధిక్రియాకలనవిశ్రుతకౌశలునిన్ పురోహితున్,
మహిపతి కంటగించు చభిమానవిహీనులఁ జేయరా దిలన్.

ముంజుఁడు. ఆత్మగతంబున,,

ఈవృద్ధుండు బుద్ధిసాగరాదుల నివృత్తాధికారులఁ జేయం జన దనునభిప్రాయం బెఱింగించినవాఁడు; వీరలు సింధులపక్షపాతులగుటంజేసి నాయానతిమేరకు నడువంబోరు. వారల నివృత్తాధికారులం జేయక తప్పదు.

ప్రతిహారియు బుద్ధిసాగరుండును బ్రవేశించుచున్నారు.

ప్రతిహారి. ఆర్య బుద్ధిసాగర ! ఇదిగో మహారాజు భవత్సమావేశంబునకు వేఁచియున్నవాఁడు. ఉపసర్పింపుము.

బుద్ధిసాగరుఁడు. ఉపసర్పించి,, మహారాజ జయం బగుంగాత.

సింధులుఁడు. బుద్ధిసాగర ! ఈచేరువనుండుపీఠంబునం గూరుచుండుము.

బుద్ధిసాగరుఁడు. మహారాజ అట్లయ. అని ఉపవేశించుచున్నాఁడు,,

సింధులుఁడు. బుద్ధిసాగర ! వినుము.

చ. ముదిమి కరంబు పైకొనఁగ ముద్దులపట్టిని రాజ్యసంపదన్,
విదితముగాఁగ ముంజునికి విశ్రుతకీర్తికి నప్పగించితిన్,
మది ననురాగసంపదల మానక మాన్యత దోఁప నారయుడన్,
సదమలకీర్తిఁ గోరి మతిశాలిత నారయుచుండు నేమముల్.

బుద్ధిసాగరుఁడు. మహారాజ అస్మత్పితృపితామహాదిక్రమంబుగ స్వామ్యమాత్య పదంబులు నిర్వర్తించుచుండుమనలో నొక్కరికొక్కరికిఁ జెప్పుకొనవలసినది గలదా? పరస్పరక్షేమపరాయణత్వంబునం బ్రవర్తించుట మనకు విహితము. అందును నాకు బాల్యంబునన పితృహీనుండనై యేమియు నెఱుంగకయుండువానికి సకలవిద్యాధిగమప్రాప్తి గలుగంజేసి మదీయజనకునందుం గలగౌరవాతిశయంబున నన్నమాత్యపదనిర్వహణచణుం గావించిననీయందు మిక్కుటంపుఁగృతజ్ఞతాబుద్ధితోఁ బ్రవర్తింపవలసినది భావ్యంబు గాదే.

సింధులుఁడు. అట్లయిన ముంజుని సింహాసనాధిష్ఠితునిం గావించి తక్కినరాజ్యాంగంబులు వీనికి వశగతంబులై నడుచునట్లు సేయుము.

బుద్ధిసాగరుఁడు. మహారాజ అట్లయ.

ముంజునింగాంచి.

ముంజమహీపతీ! మహారాజునాజ్ఞానువర్తనంబుకొఱకు సభాభవంబునకు రాఁ జను.

ముంజుఁడు. బుద్ధిసాగర! అరుగుదముగాక.

సింధులునిం గాంచి.

ఆర్య! మీయానతి ననుష్ఠింపం జనియెదను. ఇదె నమస్కరించెదను.

అని ప్రణమించుచున్నాఁడు,,

సింధులుఁడు. . వత్స ముంజ పోయిరమ్ము.

బుద్ధిసాగరుండును ముంజుండును నిష్క్రాంతులైరి.

సింధులుఁడు. ఎవరక్కడ?

ప్రతిహారి. ప్రవేశించి,, మహారాజ! ముదలకు వేచియున్నాఁడను.

సింధులుఁడు. ఓరి ప్రతీహారి! దేవి యుండునంతిపురికిం జని ముంజునికి రాజ్యం బప్పగించుటయు నే మునివృత్తిం బూని పురబాహ్యోపవనసీమఁ గాలంబు గడప నిశ్చయించుటయుఁ దెల్పి నాతో వసించుటకుం బ్రియంపడెనేనిఁ దోడ్కొని రమ్ము.

ప్రతీహారి. మహారాజ! ఇదె దేవరయాజ్ఞ ననువర్తించెద.

అని నిష్క్రాంతుం డయ్యె.

సింధులుఁడు. ఏ నిఁక నివృత్తరాజ్యభారుండ నైతి. గాన నాజననంబు సార్థంబగునట్లుగ,

గీ. ఘోరసంసారసాగరఘూర్ణమాన। జంతుసంతానరక్షావిచక్షణునికి,
క్షీరసాగరకన్యకాశ్రితమనోజ్ఞ। చరణసారసునకు నతుల్ సలుపుచుండు.

దేవిచే ననుగమ్యమానుండై ప్రతీహారి ప్రవేశించి. దేవిం గాంచి,,

ఓదేవి! ఇదిగో మహారాజు మీతో మాటలాడ వేచి యున్నాఁడు. సమీపంబున కుం జనుము.

దేవి. రాజుసమీపమునకుం జని,, ఆర్యపుత్ర జయం బగుంగాత.

సింధులుఁడు. దేవీ నీకుం దెల్పి నీవును బ్రియంపడుదువేని నిన్నుందోడ్కొని చని పురోపవనంబునం దపోవృత్తిని గాలంబు గడపం గడంగి యున్నాఁడ.

దేవి. ఆర్యపుత్ర! అట్లుదలంచెదరేల? మిమ్ము నెడబాసినచో నాకుపుత్రుండును భోగంబును బ్రియంబు లగుదురే? నిన్నెడబాసినచో నివి యెన్నియుండియు నాకేల? నీతోఁ జనుదెంచుటకు సిద్ధపడియున్నదానను.

క. పతిధర్మపరాయణ లగు। సతులకుఁ బతిఁ బాసి యున్న సకలసుఖంబుల్,
వెత లగుఁ. గడుసుఖ మగుసం। తతపతిచరణాబ్జసేవ తనుమధ్యలకున్.

ఏనును నారాయణచరణసేవాపరాయణత్వంబుతోఁ దపశ్చర్యావిశేషంబు సలుపం బూనినమీకుఁ బూజోపకరణాహరణాదికరణంబున నాజన్మంబును సఫలంబు సేయఁ గలను.

సింధులుఁడు. దేవి!

గీ. బాలుఁ డైనసుతుని బాసి తపశ్చర్య। సేయఁబూనుపతిని జెలువ మీఱ,
వెంబడించి వచ్చువెలఁదులు గలరె! దు। స్త్యజముగాదె యౌరసానురక్తి.
కాన నీపతిభక్తి కరముశ్లాఘనీయంబు.

దేవి. ఆర్యపుత్ర! సుతుం డనిచెప్పినందున స్మృతిసమారూఢం బయ్యె. సంశయంబుం బాపుము.

క. సురగజకరపీవర మై। ధరణిని రణయజ్ఞయూపదండం బయి రా,
జ్యరమోపధాన మగునీ। కరమునఁ గెల్చితివిగాదె కాశ్యపి యెల్లన్.

అట్టియాయఖండమహీమండలరాజ్యంబునకు ముంజునిం బట్టాభిషిక్తునిం జేయనేల? మనపట్టి కేల పట్టంబు గట్టరైతిరి.

సింధులుఁడు. దేవి వచించెదను వినుము.

ఉ. బాలుఁడు సప్తవార్షికుఁడు ప్రాప్తవయస్కుఁడు గాఁడు ముంజుఁడున్,
లీల ననేకరాజులఁ బలిష్ఠులఁ గెల్చినవాఁడు వానినే,
లాలితసర్వభూధరణలక్ష్మికిఁ దాఁ దగువానిఁ గాశ్యపీ,
పాలనమందు నే నిడక బాలుని నుంచిన దూఱరే జనుల్.

అదియునుంగాక ముంజుండు నా కనుజుండు; వీనిం గాదని మనకుమారునికిం బట్టంబుం గట్టితినేనిఁ బ్రబలుం డగుటంజేసి క్రోధంబు వెరిగి రాజ్యలోభంబుచేత ముంజుం

డు గుమారునికి విషాదు లిడి చంపును. అట్లగుచేని రాజ్యము నొసంగియుఁ బ్రయోజన లేకపోవుట యట్లుండ వృథా పుత్రహానియు వంశోచ్ఛేదంబు నగు.

క. లోభంబు పాపమూలము | లోభమునం గ్రోధగుణము లోకుల కగు నా,
లోభంబున ద్రోహం బగు | లోభము నరకంబునకును లోకుల నీడ్చున్.

మఱియు,,

క. పితనైన మాతనైనను | సుతునైనను సుహృదునైనఁ జుట్టమునైనన్,
బతినైన భ్రాతనైనను | మతిచెడి లుబ్ధుండు జంపు మాని వధించున్.

ఈయర్థంబు మంత్రులతో విచారించి రాజ్యంబు ముంజున కప్పగించి యతని యుం త్సంగంబున మనపట్టిని వదలిపెట్టితి. కొండొకరహస్యార్థంబు వినుము.

ఉ. భోజకుమారుఁ డీభువి నపూర్వయశోవిభవాభిరాముఁడై,
రాజితబాహువీర్యమున రాజుల నెల్లరఁ గెల్చి యేలు నం,
భోజ మహామహుల్ దెలిపి రూర్జితరీతిని వారివాక్యముల్,
జాజెర గావు పట్టుకి నిజంబుగ రాజ్యము రాకపో దిలన్.

కాన మన మందులకుం జింతింప వలసినది లేదు. కాలము రాఁగా నన్నియుం సమ కూరు. మఱియు మహామహులు నిర్ణయించియుండుపరమార్థంబు వినుము.

చ. జగదవనప్రభావఘనశక్తి యుదారుఁడు కైటభారి యా,
నిగమవిగీతుఁ డండఱును నెమ్మి భరింపఁ గడంగి యుండఁగాఁ,
దగు నని మానవుం డొకనిఁ డాఁ బరిపాలనసేయఁ బూనుటల్,
వగలకు హేతు వౌను తనవాంఛ విఘాతము నొందుచుండుటన్.

ప్రహ్లాదప్రముఖులం గాచినయాపరమపురుషునివాత్సల్యం బెఱుంగవే? అట్లే మన ముద్దులపట్టిం గావసయితము జాగరూకతతో నుండకపోఁడు. అచింతమానుము. ఇయ్యెడ మన మింకఁ దడసిన నంతిపురి పరిచారికాదిజనంబులు సనుదెంతురు. వారలకు సమాధా నము సెప్పుచుండఁ దడ వగుం గాన వైళంబ యుద్దేశించినచోటికిం జనుదము.

దేవి. ఆర్యపుత్ర! అట్లయ,

ఇరువురును బరిక్రమించుచు నిష్క్రాంతులైరి.

ఇది భోజరాచరితనాటకంబునందు ముంజరాజ్యప్రాప్తి,

యనుప్రథమాంకము.

సంపూర్ణము.

---

శ్రీరస్తు.



శ్రీరస్తు.

శ్రీ రాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్రభోజచరితము.

అందు

## భోజరాజచరితనాటకము.

## ద్వితీయాంకము.

### ప్రవేశకము.

భానుమతిక. ప్రవేశించి. కలయవిలోకించి,,

చ. వరతురగేభసంకులము వారవిలాసవతీవిహారభా,
సురము పతాకికాశతవిశోభి మహోన్నతసౌధవీధికా,
సురుచిర మీపురంబు కడు సొంపగుచున్నది చూడ్కి కిందు భా,
స్వర మగుదేవినెచ్చెలినిశాంతమ దెద్దియొ యారయం దగున్.

ఇందు యాతాయాతంబులు గావించుచుండుపౌరజనంబులలో రాచనగరునుండెడి పరిచారికలనడిగినంగాని బుద్ధిమతిక యుండుమందిరంబు విదితంబు గాదు.

నేపథ్యంబునవలనికి దృష్టులు నిగుడ్చి,,

ఇదె యీలథ్యయం దొక్కతె పోవుచున్నది. ఇది రాజాంతఃపురపరిచారికలలో నొకతె యని యెఱుంగుదు. దీని నడిగి తెలిసికొందునుగాక.

ఆకాశంబులక్ష్యంబుచేసికొని,,

ఓకామినీతిలకమా! ఈసౌధవీధికయందు దేవిప్రియసఖి బుద్ధిమతిక వసించుమందిరంబెద్ది? తెలుపుము.

నేపథ్యంబున,,

ఓయమ్మ యిప్పటిదేవికిం బ్రియసఖి బుద్ధిమతిక గాదు. అది పూర్వము సావిత్రికి వృద్ధరాజుదేవికి నెచ్చెలి యై యుండె.

క. తలుపులు దెఱవక వాకిటఁ। గలయంపులు చల్లకయ తగం జలజాక్షీ,
కులములు దిరుగక దైన్యా। కులమయి గన్పట్టునదియ కోమలిగృహమా.

భానుమతిక. సంశయించుచు,,

దీనిపలుకులవలన నామనంబు సంశయసాగరాంతర్నిమగ్నంబై దుయుత్తలంపడియె డిని. దేవి మనోరమ నన్నంపినకార్యంబు కడముట్టినట్లే ?

నిట్టూరుపులునిగుడుచుచు,,

కాలానుసారంబుగ జంతుజాలంబునకు గౌరవాగౌరవంబులు సంప్రాప్తంబు లగు ను. అందుకుం జింతించి యేమి ? బుద్ధిమతికయింటికిం జని వృత్తాంతంబు సాకల్యంబుగ నారయుదుంగాక.

అనిపరిక్రమించి,,

తొల్లి యేఁ గాంచియుండినవిధంబున సకలవైభవోపేతం బని యట్టిమందిరంబులం దారయుచుంటి; రాజాంతఃపురపరిచారిక నచించినంత నీబుద్ధిమతికగృహంబుఁ గనిపెట్టితిని. దీనియందుఁ బ్రవేశించెద.

ప్రవేశమభినయయించి. ఆత్మగతంబున,,

కట్టా ! ఈయింతి !

ఉ. మాసినచీరెఁ గట్టుకొని మానసిదుఃఖభరంబుచేఁ గడుం,
గాసిలి సంతతంబు తెలిగన్నుల బాష్పము లుట్టి పాఱఁగా,
వ్రాసినచిత్రరేఖవలె వాలువిలక్షత మీఱునంగము,
న్వాసి దొఱంగ దైన్యరమవైఖరిఁ దోఁచుచు నున్న దాత్మకుఁ.

అంత యథానిర్దిష్టవేషయై బుద్ధిమతిక ప్రవేశించుచున్నది.

బుద్ధిమతిక. ఆహా యేమందు విధివైపరీత్యంబు !

గీ. కొండలుండుచోట్లు గోఁతులై సిరి దక్కు । నిండుకొలఁకు లిప్పు డెండబాఱి,
పుండరీకకుముదపుంజశూన్యములయ్యెఁ । గాలగతిఁ దలంపఁ గరము గడును.

భానుమతిక. సమీపించి,,

ప్రియసఖి ! బుద్ధిమతికా !

బుద్ధిమతిక. కనులెత్తిచూచి. నిట్టూరుపులునిగుడ్చి. ఆత్మగతంబున,,

నాప్రాణసఖి భానుమతిక వచ్చియున్నది. పూర్వము దీనిం గాంచునప్పు డెల్ల సర్వానందంబులు నన్నుం బొదివికొనునట్లుండు. అట్టిదాని నిప్పుడు గాంచుట క్షతికి క్షా రంబిడినమాడ్కి నసహ్యంబయి యున్నయది.

ప్రకాశముగ,,

ప్రియసఖి భానుమతికా !

అని కన్నుల నీరునించుచున్నది,,

భానుమతిక. ప్రియసఖి బుద్ధిమతికా! సకలాంతఃపురపరిచారికాజనంబునీయాజ్ఞావశవర్తులై మెలంగ దేవికిం బ్రాణసమాన వగుప్రియసఖివై యసమానగౌరవంబున వర్తించుచుండినతొల్లింటినీయతిశయం బెక్కడ? సకలజంతుసంతానశోచనీయావస్థ నుండు నిప్పటినీదీనదశ యెక్కడ? ఏల యిట్టు లయ్యె?

బుద్ధిమతిక. ప్రియసఖి ధారానగరవార్త యెఱుంగవు కాఁబోలు? వినుము.

ఉ. ముంజున కిచ్చి రాజ్యరమ ముప్పున సింధులభూమిభర్త దాఁ,
గుంజరరక్షకు న్హరిని గోరి భజించుచు మేనువాసెఁ బో!,
రంజన యేది దేవి సుతు రాజసమానునిఁ బాయలేక యా,
కంజదళాక్షి యున్నది నికామము గుందుచు జీవితంబుతోన్.

భానుమతిక. చెవులుమూసికొని,,

శివశివ! యెంతకఠోరవచనంబు వింటిని. సింధులభూమిభర్త పరలోకంబుం జెందెనా! ఆరాజచంద్రునిం బోలుభూపతియుం గలఁడె?

క. తనప్రజలఁబోలెఁ బ్రజలను। ఘన మగుప్రేమమునఁ గాచుఁ గడుసెయ్యమునన్,
జనవితతికష్టసుఖములఁ। దనకష్టసుఖంబులట్లు తలఁచుచు నడుమన్.

బుద్ధిమతిక. ప్రియసఖి! మహారాజుసుగుణగణంబులు సెప్పి దుఃఖాంబుధిపూరంబు నుద్వేలంబుఁ గావింపకము. ఊరకుండునపుడ మర్మోపఘాతకము లగుచున్నవి. ఏమిసెప్పుదు.

గీ. పరులపాలయ్యె వైభవపదవి యెల్లఁ। జుట్టములఁ బక్కములఁ గడుఁ జులక నయ్యె,
సుతునిఁగనుఁగొనుమండఁగాఁ బ్రతుకుచుండు। దేవికై తాల్చియున్నాను దేహమిపుడు.

భానుమతిక. ప్రియసఖి! ఏల యింతవంత గుందెదవు? భోజకుమారుండు వైళంబ పట్టాభిషిక్తుండు గావలసినవాఁడు; ధరాపరిపాలనంబునకు రాఁబోయెడిని. రాజమాతృగౌరవంబు సావిత్రీదేవికి సంక్రాంతంబు గాకపోవునే? మామనోరమాదేవి తనముద్దులపట్టిని సింధులునిపుత్రుని కొసంగి పరిణయంబుసేయ నావైభవంబును గన్నులారఁ గాంచకపోదుమే? అప్పుడు నీకుంగలతొల్లింటిపెత్తనం బెప్పటియట్ల జరుగం బోయెడిని. కొంతకాల మోర్చుకొనుము.

బుద్ధిమతిక. ప్రియసఖి! ఈమందభాగ్యకు మనోరమాదేవిముద్దులకూఁతును రాజపుత్రుండు చేపట్టుమహోత్సవంబుం జూడంగల్గునే! ఏమే యీముఘామనోరథంబులు? రాజపుత్రుండు వైరిమధ్యంబునందుఁ బ్రతికియున్నం జాలదటే! ముంజపుత్రుని జయంతుని రాజ్యాభిషిక్తునిం జేయుం గోరి భోజకుమారుం జంపకున్నం జాలదటే! ఇంతకంటె మేలు గావలయునే? ఈచింతయు నన్ననారతంబు దహించుచున్నది. సావిత్రీదేవి

కన్న దని పేరుమాత్రమె కాని సర్వవిధముల నాకుమారునిం బెంచినదాన నేన. అట్టి నాకుసయితము రాజకుమారునికడకుం బోఁగూడకపోయె. ఆకుమారుఁడు తల్లిని జూడవలయునన్నను ముంజునానతి కెదురుచూడవలసినట్లయ్యె. అపక్షంబువారలే కుమారునికి స్నానభోజనాదికార్యంబులకుఁ దోడ్పడువారైరి. ఇట్టులుండ నేకాలంబున కేమి వాసఁగునోయని గుందుచుండెదను.

భానుమతిక. ప్రియసఖి యిట్లేల దలపోసెదవు? సింఘులరాజపక్షపాతి యార్యుండు బుద్ధిసాగరుం డుండ లేదా? ప్రధానమంత్రిపదవినుండునతని కెలుకపడక యేకార్యమేని జరుగునా?

బుద్ధిమతిక. ఓసి యాతం డుండిన నింక నేమి? అతని నివృత్తాధికారునిం జేసి బహుకాలం బయ్యె; ఆయాశయును లేదు. మఱియు సింఘులపక్షపాతులు సేనాపతిప్రముఖులు సయితము అధికారమువలనం దొలంగింపంబడిరి. సైనికులును పౌరులును తత్పక్షపాతు లయ్యు వారలఁ దొలంగింప ననువుపడనికారణంబున నందుం జేయునది దోఁపక ముంజుండుండెడిని. సింఘులునికిం బ్రతిపక్షియై యుండినయంగరాజు వత్సుండు ముంజుని కిప్పుడు ముఖ్యమంత్రి. వాఁడు కడు నిర్దయుండు. కరము కష్టుండు. బాలస్త్రీశిశుహత్యలకు సయితము వెనుకంజయిడనివాఁడు. ఇవియెల్లఁ జింతించి చింతించి భోజకుమారుని రాత్రి నిదురఁగూరిమేలుకాంచినవాని విని యనుదినము పునర్జీవితునిఁ గాఁ దలంచుచుండెదము. ఇందు మే మందఱము ముందే ప్రాణపరిత్యాగంబుఁ గావించుకొనవలసినవారమై యుండ మొలబంటికష్టంబున మోకాలిబంటిసుఖ మన్నట్లు ఆర్యుండు బుద్ధిసాగరుండు ముంజుండు తన్ను నివృత్తాధికారునిం జేసినను సింఘులునియందుంగలపక్షపాతంబునం జేసి కార్యార్థియై రాజసభకు వచ్చుచుం బోవుచుఁ గిరము మెలఁకువతో రాజుకడం బ్రవర్తించుచు సభాప్రవేశనిరోధంబుం బడయక యుండెడిని. ఇట్టు లీతండు వచ్చుచుం బోవుచుండుటయుఁ గుమారునిరక్షణంబునకుం గారణంబు గాఁగలదు.

ఆతంకంబుతో,,

ఆనుదిన మింతకుముందు కుమారునికి సౌఖశాయునికమై వచ్చి నాకా వృత్తాంతంబుఁ దెల్పుకల్పవతిక యీదిన మింకను రాకున్నయది. కారణంబు తెలియదు. ఈకల్పవతిక ముంజునిభార్య కనుగుణప్రవర్తనము గావించునట్టులు నటించుచు రాజకులంబునన యుండి యచటివృత్తాంతంబు లారసి నాకుం దెల్పుగూఢచారిణియైనసఖి. దానివలన వృత్తాంతం బారసి దేవిసావిత్రికి నేను కుమారునిసేమంబుఁ దెల్పుచుండెద.

కల్పవతిక. ప్రవేశించి,, కంటనీరుగార్చుకొనుచు,,

బుద్ధిమతికా ! ఏమి కష్టంబు గల్గెనే ? అయ్యో ! ఏమందునే ?
బుద్ధిమతిక. కట్టా ! అని మూర్ఛితయై యిలపయిం బడియె,,
భానుమతిక. ప్రియసఖి! ప్రియసఖి! ఊరడిల్లుము ఊరడిల్లుము.
బుద్ధిమతిక. తెలివిదెచ్చుకొని లేచి,,
ఓసి కల్పవతికా ! భోజకుమారుండు జీవించియున్నాఁడా ?
కల్పవతిక. ఇంతదనుక బ్రతికియున్నాఁడు.

అని వెక్కుచున్నది,,

బుద్ధిమతిక. హాసింధులరాజవంశం బుచ్ఛిన్నంబు గా నున్నదా ? కట్టా ! యెట్లు లోర్వవచ్చు ?

అని వెండియు మూర్ఛాక్రాంతయై వ్రెల్లుచున్నది,,

భానుమతిక. కన్నుల నీళ్లుదుడుచుకొని,,

కట్టా ! సింధులరాజవంశంబున కెట్టికట్టిఁడిదశ సంభవించె ! ఇందుకై చూవె యీ నాతి యివ్విధంబున నుత్తలంపడియెడిని. ఓసి బుద్ధిమతికా ! ఊరడిల్లు మూరడిల్లుము. కల్పవతిక సెప్పెడువృత్తాంతం బంతయు నారసి యందుఁ బ్రతీకారంబు గలదేని చేతన యినంత నహితనివర్తనంబునం బ్రవర్తింపం జనునుగాని యిడుమ దొడరినప్పుడు దుఃఖవిహస్తధైర్య లయి గుందుచుండుట రాజకులసంచారనిపుణ లగుమనబోంట్లకుం దగునా ? అర్థం బారసి యనర్థప్రతీకారంబునకుం గడంగుము. సాధుభావంబునం జేసినపనికి సర్వ సుపర్వులు సహాయపడుదురు.

బుద్ధిమతిక. తెలివిదెచ్చుకొని,,

ఓసి కల్పవతికా ! రాజకులంబునం జరిగినవృత్తాంతం బేమి! వచింపుము.

కల్పవతిక. ఓసి వినుము. అనుదినము కుమారునిసేమం బరసివచ్చువిధంబున వచ్చుమంటి. నిరోగిజనపురస్కృతుండై యొకవిప్రవర్యుండు ముంజునిసభాభవనంబునకుఁ జనువాఁ డెదురుపడె. అతండు భూతభవిష్యద్వర్తమానంబు లెఱింగి చెప్పంగలవాఁ డని రాజు నూతనముగ నన్యదేశసమాగతుం డగునితనిం బిలువ నంపె ననుచు నచ్చోటివారలు సెప్పఁగా నాతనిమాహాత్మ్యంబుం గాంచ నాస వొడమి తత్సమధిష్ఠితం బగుబృందంబు వెంటన సభకుఁ బోతిని. బ్రాహ్మణుండును రాజుం గాంచి స్వస్తి యని పల్కి యతనియానతి నొక యాసనంబునం గూరుచుండి యి ట్లనియె.

ఓరాజా నన్ను లోకులు సర్వజ్ఞుం డని యందురు. నీ వేదేని యడుగుము.

గీ. † ఏది కంఠస్థమై యుండు నెపుడు విద్య। యది ప్రకాశింపఁ జను బుధుల్మదిఁదలంపఁ,
బుస్తకాపేక్షయును గురుబుద్ధ్యపేక్షఁ। బరఁగుమూఢునివిద్య దోడ్పడక చెఱుచు.

అని చెప్పిన నావిప్రునియహంకారచమత్కృతంబు లగువచనంబు లాలకించి యత నిం బరీక్షింప వగు నని యెంచి యానక్షత్రశాస్త్రకుశలునిం గాంచి యోద్విజవరా ఏఁ బుట్టిననాటందొట్టి యీక్షణంబుదనుకం చేసినచరిత్రం బంతయుం జెప్పితివేని నిన్ను సర్వ జ్ఞునిగఁ దలంతు. అనఁగా నాకార్తాంతికుండు రాజు రచించిన కార్యంబు లన్నియు ని గూఢవ్యాపారంబుల సయితము సమగ్రముగ నచియించె. రా జది విని యభిజ్ఞానంబు ల నన్నింటిని గుఱుతువట్టి సంతసించి యైదాఱడుగులు సని బ్రాహ్మణునిపాదంబులపయిం బడి యతని మణిగణఖచితం బగునున్నతాసనంబునం దునిచి ఓబ్రాహ్మణవర్యుఁడా యి ష్టార్థప్రాప్తిహేతువు విద్యవంటిది మఱియొండు గలదా! యిట్టియనవద్యం బగువిద్య యుం డుటంబట్టి మీ కెందుం గొఱంత యుండదు. అని యుగ్గడించి యతని కాజానేయంబు లం బది గుఱ్ఱంబుల నొసంగె. అప్పుడు సభాస్థలాసీనుండై యుండినయార్యుండు బుద్ధిసా గరుండు రాజుంగాంచి దేవా! భోజునిజన్మపత్రిక నీబ్రాహ్మణు నడుగుము. అని చెప్పి న ముంజుండును వల్లె యని యావిప్రుని భోజునిజన్మపత్రిక యొసంగు మని యడుగ నా బ్రాహ్మణుండు నధ్యయనశాలనుండి కుమారుని రప్పింపు మనియెను. అప్పుడు రాజాజ్ఞ చే భటు లధ్యయనశాలనుండి భోజునిం దోడ్కొని రాఁ జనుడుఁ దదాలోకనకౌతుకి తాంతరంగం బయి సభాజనంబు సంపూర్ణపూర్ణిమాచంద్రునిరాకకు సముద్రంబువోలె ను ప్పొంగుచుండె.

బుద్ధిమతిక. ఓసి సకలలోకలోచనచకోరంబుల కతులానందంబుఁ గల్పించుపూర్ణ శారదచంద్రుండు గాదె కుమారుండు!

కల్పవతిక. అప్పుడు కుమారుండును రాజభటసమానీతుండై విచ్చేయుడు,

సీ. వర్ణితసౌభాగ్యవైభవసంతతు లంగంబుఁ గొన్నట్టు లమరువాని,
భూమండలంబును బొడగాంచ నవతరించినసురపతి యనఁ జెలఁగువాని,
మన్మథుం డసదృశమహితాంగధారి యై పొల్చెనో యనఁ జెప్పఁ బోలువాని,
సంపూర్ణపూర్ణిమాచంద్రుండు భూస్థలి కేగుదెంచినరీతి నెసఁగువాని,
గీ. మహితవైభవు భోజకుమారుఁ గాంచి। భాసురోదారరూపసంపదకు నెదల,
నిర్భరానందభరితమై నిఖిలరాజ। చక్ర మటఁ దేలె నానందజలధియందు.

---

శ్లో† కంఠస్థా యా భవే ద్విద్యా సా ప్రకాశ్యా సదా బుధైః,
యా గురౌ పుస్తకే విద్యా తయా మూఢః ప్రతార్యతే.

బుద్ధిమతిక. ఓసి కల్పలతికా! నీచెప్పినగుణంబులెల్ల నాకుమారచంద్రునియం దొప్పునే!

భానుమతిక. ఓసి అంతట నేమయ్యె వచింపుము. దైవజ్ఞుండు భోజునిజన్మపత్రిక యేమని చెప్పె?

కల్పలతిక. ఓసి వినుము. కుమారుండును బితకుం బోలెఁ బిత్రువ్యునికి సవినయంబుగ మ్రొక్కి నిలువంబడియె. ఆ భూలోకచంద్రునిం గుమారునిం గాంచి యాసర్వజ్ఞుండు ముంజునితో నోమహీపతీ యీభోజునిభాగ్యోదయంబు వచింప నావిరించనుండు సయితము శక్తుండు గాఁడు. అట్టులుండ నుదరంభరి బ్రాహ్మణుండ నే నేపాటివాఁడను! అయినను నాబుద్ధికొలఁది వచించెదను. కుమారు నధ్యయనశాల కంపుము; అనఁగా రాజు నట్ల యొనర్పుడు విప్రుఁడు భోజునిజన్మపత్రిక విను మని ముంజునితో నిట్లనియె.

గీ. *ఏఁబదియునైదువర్షంబు లేడునెలలు| మూఁడుదినములుభోజుండు మొక్కలమునఁ,
బాలనము సేయు దక్షిణాపథమునెల్ల | గౌడదేశంబుతోఁ గడుగౌరవమున.

అని చెప్పిన విని ముంజుండు చతురత్వంబున హసించుచు విచ్ఛాయవదనుండయ్యె సుముఖుండునుంబోలె నాబ్రాహ్మణు ననిచెను.

భానుమతిక. ప్రియసఖి బుద్ధిమతికా వేదవిదులవాక్యంబు లసత్యంబులు గావు గాన నిందు ధైర్యం బవలంబింపం జను.

బుద్ధిమతిక. ఓసి కుమారునభ్యుదయంబు విని ముంజుండు విచ్ఛాయవదనుండైన యర్థంబు కర మనర్థావహం బని తోఁచదేటే! బ్రాహ్మణులపల్కులు సత్యంబు లని సత్యయుగసంజాతవుఁబోలె మాటలాడెదవు. నాకు హస్తపాదంబులు విశ్లథంబులువోలె నయ్యెడిని. ఓసి కల్పలతిక! అనంతరం బేమయ్యె? చెప్పుము.

కల్పలతిక. ముంజుండు బ్రాహ్మణు నంపి యెవ్వరితో నేమియుం బలుకక తనశయనప్రాసాదంబునకుం జని పానుపునం బరుండి చింతాస్తిమితుండై యాలోచించి తనకుఁదానె యిట్లనిపల్కె.

గీ. అదియ యింద్రియవర్గంబు లదియ నామ|మదియ బుద్ధియువచనంబులవియతలఁప,
నర్థవిరహితుఁడైనచో నంతలోన | నాతఁడన్యుండయగు చిత్ర మదియసూవె?
అదియునుంగాక.

---

శ్లో. * పంచాశత్పంచవర్షాణి సప్తమాసా దినత్రయం,
భోజరాజేన భోక్తవ్య స్సగౌడో దక్షిణాపథః.

క. అతిదాక్షిణ్యయుతుం డయి। మతిహీనుం డనుపదంబు మానని శంకా,
న్వితుఁడై పరాపవాదో। న్నతికి న్భయపడుచు సంపదలు వాయు ధరన్.

గీ. జాతమాత్రుఁ డైనశత్రువు రోగమ్ము। నెలమిఁ బ్రశమ మొంద నెనడుఁ జేయఁ
డట్టివాఁడు తొలుత నతిపుష్టదేహుఁడై। యుండి పిదప వాని గోలి నడఁగు.

క. నరతతిగుప్తశరీరునిఁ। బరు లేమి యొనర్పఁగలరు బహుభంగుల ను,
ద్ధురము లగువారిధారలు। కరకలితచ్ఛత్రు నరునిఁ గదియం గలవే.

బుద్ధిమతిక. ఓసి భానుమతికా ఈపద్యచతుష్టయభావం బభివ్యక్తం బయ్యెనా? వినుము. మొదటిపద్యమునకు ఘనము వాసిపోయిన మనుజునికి గౌరవంబులేదు గాఁబట్టి తన కీధారారాజ్యం బపరిత్యాజ్యం బనియు ద్వితీయతృతీయపద్యములకుఁ బరాపవాదంబు నకు భయంపడక రాజ్యభాక్తృత్వంబు గల్గియుండుకతంబున శత్రు వగుభోజునిం జంప వలయు ననియుఁ జతుర్థపద్యంబునకు సింధులపక్షపాతులు వత్సరాజాదిగుప్తుం డైనత న్నే మియు బాధింపం జాల రనియు నీభావంబులు విస్పష్టంబు లయ్యెడిని. ఇవి యాలసినచో బ్రాహ్మణునివచనంబులు విన్నతోడన ముంజునికి వానిభావంబునందు ధారారాజ్యలక్ష్మి భోజకుమారుం జెందెనేని తాను జీవితుం డయ్యు మృతకల్పుండనే యగుదును గాన నా కుమారుని కనిష్టంబుఁ గావించితినేని నిరుపహతంబుగ రాజ్యం బేలవచ్చు నసుదు రాలో చన వొడమిన దనుటకు సందియంబు లేదని నిర్ణయింపవలయును. ఓసి యనంతర వృత్తాం తంబును వినిపింపుము నీ కీరహాస్యవృత్తాంతం బె ట్లెఱుకపడియె?

కల్పిపతిక॥ అదియుంజెప్పెదను వినుము. ముంజుండు సభాభవనమునుండి లేవఁ గానే రాజు లందఱును లేచిరి. తనపతి దుర్మనాయమానమానసుండై యు న్నాఁ డని పరి చారికలవలన విని ముంజునిరాణి రాజసమీపంబు వాయకుండునట్లు గిమిక త్తెతో నాకుం జెప్పిపంప నే నది కాలోచితం బనియు నెంచి మనఃకలుషత నొందిన జేనికడం బనులు దీర్ప భయంపడుచున్న తక్కుంగలదాసికల నిండ్ల కనిచి శయనాగారప్రవిష్టుం డైననృప తికిఁ దాళవృంతవీజనాదిక్రియలు సలుపుచు నయ్యెడ మసలుచుంటి. అంతం గొంతకాల మి ట్లాలోచించి తనయంగరక్షకునిం బిలిచి యోరీ నీవు వంగదేశాధిపతిని వత్సరాజును రథగజతురగభటాదిసంయుతం బగుసైన్యంబుతో సూర్యుం డస్తగిరికిఁ జేరుటకు ముందఱ తో డ్కొని రావలయు. అని ముదలయిడి పంపె. ఇంతలోపల భోజనాదులు సేయకుండు పతినాహ్నికకృత్యంబున కియ్యకొలుపుటకు రాణి పరిచారికాపరివృతయై చనుదెంచి నన్నుం బొమ్మనియె. ఇదె యేవచ్చి నీకు వృత్తాంతంబుఁ జెప్పితి.

బుద్ధిమతిక. హా! నాయనిష్టాశంకిత్వంబు సరిపోయినదే! దైవమా సింధులుని వంశంబున కిట్టికట్టిఁడిదశయా కలుగంజేసెదవు! హాదేవి సావిత్రి నిహత వైతివిగదే! వృద్ధ

రాజు వోయినప్పుడ యాతనితో నగ్నిప్రవేశంబు సేయంబోవునిన్ను నేను పరమ పాపిని సఖి నని పేరుపెట్టుకొని నీకుం బుత్రునిం బాసిపోవం జనదు వాఁడు పసివాఁడు గత్యంతరములేనివాఁడు అని చెప్పి యావ్యవసాయంబునుండి తప్పించి యీయసహ్యశోకానల జ్వాలాజాలంబునం బడఁద్రోయుదాన నగుచున్నాను. కట్టా! వత్సరాజును సైన్యసమేతంబుగ రమ్మనుట కుమారునిం బరిమార్పను సింధులపక్షపాతులం దెగటార్పను గాని యితరంబునకుఁ గాదు. ఆహా! ఏమి సేయుదు. వత్సరాజు కరము క్రూరుఁడు. ఎట్టిపాపంబునకైన నొడిగట్టం గలవాఁడు. ఈవచనంబులు విన్నదిమొదలు నాయంగంబులు కాలానల జ్వాలాజాజ్వల్యమానంబులైనట్టు లెత్తియుచున్నవి. హా! తపస్విని దేవి సావిత్రి పతిశోకంబునకె యాహారాదులు మాని కృశించుచున్నదానవు. పుత్రునిగతియు నిట్టు లయిన నేమయ్యెదవో! ఆశోకంబు సమాధాతవ్యంబై యుండె. ఇది యట్లు గాదుసుమీ! వత్సరాజును వానిసైన్యంబుల నోడింపంగలవీరుండు సింధులపక్షపాతులలో నెవ్వండును లేఁడు. ఉండెనుపో వత్సరాజు కుమారు నలుముకొని పాపంబునకుం గడంగుడు నితని కాకాలాంతకుండుసయితమెగుట నిల్వనోపండుగదే! ఇం కెవ్వఁడే దిక్కు! ఏమి సేయుదునే!

భానుమతిక. సింధులపక్షపాతు లగురాష్ట్రపాలాదిదండనాయకులు వత్సరాజును సైన్యములతో నోడించినవారలు గదవే! సింధులాజ్ఞ యని యుండంబోలుదు రంతియ కాని విడివడిరేని జగంబు చీకాకువఱుపరవే! వీరెల్లరు బుద్ధిసాగరుని యాజ్ఞావశవర్తులు; కాన నిప్పుడు బుద్ధిసాగరునికంటె నన్యుండు రక్షకుండు లేఁడు. అతఁడు తనబుద్ధిబలంబున నెట్టిదుష్కరంపుంబనినైనను సాధింప సమర్థుండు. అతని శరణంబు చొత్తము.

నేపథ్యంబునంగలకలానంతరము.

చ. నరపతి ముంజుఁ డిప్పుడు మనంబునఁ గుందుచునుండుటల్ కడుం,
ద్వరితముగాఁగ వంగపతి దారుణుఁ డాత్మచమూసమేతుఁడై,
యరిది నచింతితోపనతుఁ డౌటకుఁ గారణ మారయంగ నీ,
నరపతియింట నేమియొ ఘనం బగునెగ్గగు నంచుఁ దోఁచెడిన్.

బుద్ధిమతిక. కరంబుల నురంబు మోదుకొనుచు,,

కట్టా వత్సరాజు సైన్యంబుతోఁ జనుదెంచినట్లు చెప్పుచుఁ బౌరజనులు కరంబు క్షోభంబుం జెందుచున్నారు. ఓసి ఇం కేమి సేయంగలవే? కఠోర మగుదైవవిలసితము త్వరపడుచున్నదే!

భానుమతిక. ఓసి మనము బుద్ధిసాగరునియింటికిం గ్రక్కునం జనుదము. రండు. ఇందుకు వేఱుపాయంబు లేదు. ముగ్వురునునిష్క్రాంతలైరి.

ప్రవేశకము ముగిసెను.

## ద్వితీయాంకము.



వత్సరాజు ప్రవేశించెను.

వత్సరాజు. ఎవఁ డక్కడ రాజద్వారపాలకుఁడు !

ద్వారపాలకుండు. ప్రవేశించి "

వత్సరాజ ! ఇదె వచ్చినాఁడను.

వత్సరాజు. ఓరి రాజు ముంజుం డెయ్యెడ నుండెడిని ?

ద్వారపాలకుఁడు. వత్సరాజ ! శయనాగారంబున,

వత్సరాజు. ఓరి రాత్రిగానివేళ రా జయ్యెడ నుండం గతం బేమి ?

ద్వారపాలకుఁడు. వత్సరాజ నిరంతరచింతారోగపీడితుండైయుండెడిననివిందు.

వత్సరాజు. ఆత్మగతమున,,

ఇతం డిట్టిదురంతచింతాక్రాంతుం డగుటకుం గతం బెదిగా నుండునో ! సమీపమునకుం జనినంగానియెఱుకపడదు.

ప్రకాశముగ "

ఓరి య ట్లైన నయ్యెడకు మార్గంబు సూపుము.

ద్వారపాలకుఁడు. వత్సరాజ ఇటుర మ్మిటురమ్మ.

ఇరువురుసుపరిక్రమించుచున్నారు.

ద్వారపాలకుఁడు. వత్సరాజ ! అదిగో ముంజభూపతి శయనస్థుండై యుండెడిని. సమీపంబునకుం జనుము.

శయనస్థుండై ముంజుండు ప్రవేశించుచున్నాఁడు.

వత్సరాజు. ఉపసర్పించి నమస్కరించెను,,

ముంజుండు. వత్సరాజ! సమీపమున నాసనమునం గూరుచుండుము.

ద్వారపాలకుంగాంచి "

ఓరి ! వత్సరా జీవోటువాసిపోవుదనుక నియ్యెడ నేరిని బ్రవేశపెట్టకుము. ఉన్నవారి వెలిపఱుచుము. నీవును నీపని జూడుము పొమ్ము.

ద్వారపాలకుండు. నిష్క్రాంతుఁ డయ్యె.

ముంజుండు. వత్సరాజ వినుము.

గీ. రాజు సంతోషపడి భృత్యరాజి కెల్ల । మానమాత్రప్రదానంబుఁ బూని సలుపు.
భృత్యతతి మానితం బయి నిత్యభక్తిఁ బ్రాణముల నైన నుపకృతి రాణఁ జేయు.

నీవు నా కాప్తతముఁడ వగునమాత్యముఖ్యుండవు గాన నావచనం బనుష్ఠింపం జను. భోజకుమారుని భువనేశ్వరీదేవాలయవిపినంబునం జంపి వానిశిరం బంతిపురికిం గొనిరా వలయు.

వత్సరాజు. ఆత్మగతంబున,,

శివశివ ! యెట్టికఠోరకృత్యంబున కీవృద్ధుండు తెంపుచేసినవాఁడు. కష్టా ! లోభం బెట్టికట్టిఁడితనంబున కొడిగట్టించె. ఈతనిబలంబునన నేను పెంపు వడసినవాఁడను గాఁ బట్టి యితనికిం బ్రతివల్క లేక యున్నాఁడను. హితైషి యగుమంత్రి కృత్యంబు గాన నను నయవచనంబుల నితనిం జేతనైనంతదనుక నీదారుణవ్యవసాయంబువలన మరల్పం గడంగెద.

ప్రకాశముగ,,

దేవా దేవరనిదేశం బనుష్ఠింప సిద్ధపడియున్నాఁడ. ఐనను నీపాలం జనువుగలవాఁడను గాన నొకింతుక విన్నవించుకొనం దలంచితి. నావచనంబున నపరాధం బుండిన నోర్వం జనును.

క. భోజుని కిప్పుడు బలమును | తేజంబును సైన్యసమితి దీప్తాస్త్రంబుల్ ,
రాజత్పరివారము లే | దోజ యడఁగి యున్నవాని నొప్పునె చంపన్.

అదియునుంగాక,

క. ఉదరంభరిగాయె భోజుఁడు | మదిఁ బౌరంపర్యభటునిమాదిరి నున్నాఁ,
డదయత నాతనిఁ జంపఁగ | నెదియో కారణము గాన నేను మహీశా.

ముంజుఁడు. వత్సరాజ వినుము. ఈదినము ప్రాతఃకాలంబున భూతభవిష్యద్వర్తమానంబు లెఱింగినకార్తాంతికుండు విప్రుం డొకరుండు భోజకుమారుఁడు రాజ్యం బేలఁ గలఁడని వాక్రుచ్చె. అట్లగునేని మన కనర్థంబు గల్గు. కాన నీయుద్యమం బభీష్టసాధకం బని నిర్ణయించితిని.

వత్సరాజు. హసించుచు,,

రాజా వినుము తొల్లి త్రైలోక్యనాథునికి రామునికి బ్రహ్మపుత్రుండు వసిష్ఠుండు ముహూర్తంబు పెట్టె. ఆపట్టాభిషేకముహూర్తంబునన దాశరథికి రాజ్యభ్రంశంబును సీతాహరణంబును మఱియుం గొన్ని యిడుమలును సంభవించె. అట్టివిరించనునికుమారుని వచనంబు సయితము నిరర్థకంబు గాఁగా నొకయుదరంభరి బ్రాహ్మణునివచనంబులా! పాటికెక్కం బోయెడిని. బిచ్చపుఁబాపనిమాట నమ్మి యొచ్చెంబు లేనిసౌందర్యంబున మన్మథునితో సమానుం డగుకుమారునిం గోలుపోనున్నాఁడవు.

చ. మనుజుఁడు కార్యజాతము సమంజస మైనను గాని కైనఁ దాఁ,
బనుపడి చేయుచో ఫలవిపాకము నారసి పూనఁగాఁ జనుఁ,
ఘనరభసప్రకల్పితము కార్యము కర్తను జంపుదాఁక నా,
తనిహృదయస్థశల్య మయి తద్దయుఁ గాఁతియపెట్టు నిచ్చలుఁ.

ఈకఠోరకార్యము త్వరపడి కావింప ననంతరము దేవరకు మరణోదర్కం బగు శోకంబుఁ గల్పింపకపోదు. ఆ కుమారునియందు నీవుగావించియుండు ప్రేమం బట్టిది యను ట నాకు విదితంబ. ఆయర్థం బటుండ నిమ్ము.

క. సహవాసము సహభోజన, సహహసితాదులును బ్రీతి సలిపి కుమారుఁ,
బహువిధముల నమ్మించియు । నహహా యీరీతి సేయ నగునే నీకుఁ.

దేవ! యీధారారాజ్యశ్రీ కాసపడి యీపాపంబు సేయం గడంగినాఁడవు. ఇట్టి యతినీచకృత్యం బొనర్చినచో సిరియు నీ కుండదు. అత్యుత్కటంబు లగుపాపపుణ్యం బులు వైళంబ ఫలప్రదంబు లగుటకు నిరోధకంబు లెవ్వియు లేవు. పుత్రవధం జేరికిని హితంబునకుఁ గాదు.

క. సుకృతము లెన్ని యొనర్చిన । నికృతి కలుగ నదియు సిరుల నిర్మూలము సే,
యక మానదు తైలము తీ । యక పోయుచునున్న వాత్య యణఁపదె దివియుఁ.

ముంజుఁడు. క్రోధంబుతో,,

ఓరి నీవు రాజ్యాధిపతి ననుకొంటివిగాని సేవకుఁడ నని యనుకొన్నవాఁడవుగావు. కానిచో నిట్లు మాటలాఁడఁగలవా ?

గీ. స్వామి సెప్పినకార్యంబు సరవి సేయు । నట్టిభృత్యుండు భృత్యలోకాగ్రముండు,
వానిజీవితమది సూడ వ్యర్థ మగును। మేఁకమెడచన్నులవిధాన లోకమందు.

అని చెప్పి నిభృతక్రోధుండై యూరక తలవాంచుకొని కొంతతడవుండి,,

ఓరి నీవు నాకాప్తుండవేని నాపనుపు సేయుము. నాకు హృదయంబునం గలయుప తాపభరంబున నన్యులతో మాటలాడ నొల్ల. నీవుచనుము. భోజకుమారునిశిరంబుం గాంచు దనుక నాహారాదులు గైకొనను. ఈశయనాగారంబుతలుపులు మూసికొని యిందయుం డెద.

వత్సరాజు. ఆత్మగతంబున,,

ఇతండు కడుఁగోపోద్దీపితుం డైనవాఁడు. ఇంకఁ గరము దుర్ధర్షుం డగును. కాలో చితం బాలోచింపం దగియున్నది.

లేచి శయనాగారంబునకు వెలికి వచ్చుచున్నాఁడు.

ముంజుండు. లేచి తలుపులు మూసికొనునట్టులు నిష్క్రాంతుం డయ్యె.

వత్సరాజు. ఆత్మగతమున"

ఇంక నే నిచ్చోట నుండి యే ముపయోగము? సభాస్థలికిం జని రాజాజ్ఞానుసరణంబుఁ గావింతు.

అని పరిక్రమించి. చింతాస్తిమితత్వంబుతో,,

ఇప్పుడు నాసేయంగడంగిన దుర్వ్యవసాయం బింతకయేని బయల్పడినచో సింధులపక్షపాతులు నన్నుం జంపం గడంగకపోరు. మఱియు రాజకులంబును గలగుండు పఱుతురు.

చ. కొమరునిఁ జంప సింధులునికూరిమి కెంతయు పాత్రు లైనరా,
కొమరులు దీప్తతేజసులు ఘోరబలాఢ్యులు దండనాయకుల్,
క్రమముగ భోజుని న్ధరణికాంతునిఁ జేయఁ గడంగి యట్టిభా,
వములఁ జరించువారు బలవత్క్రుధ ముంజునిఁ బట్టి చంపరే.

ఇట్టి కఠోరకార్యాంతరంబు జరుగకుండుట కను వూహింపం జనును గాదె. ఎవఁ డక్కడ!

ద్వారపాలకుఁడు. ప్రవేశించి"

వత్సరాజ! ఇదె నీచెప్పినపని సేయ వచ్చియున్నాఁడను.

వత్సరాజు. ఓరి! నీ వతివేగంబున వంగసైన్యస్కంధావారంబున కరిగి తదధికృతునితో బలపాలునితో నేను భోజకుమారుని రథారూఢునిం జేసికొని రాచనగరు వెలువడినక్షణంబునన వంగసైన్యంబులు యుద్ధసన్నాహంబుతో ముంజునినగరు గిరికొనినిలిచి రాచనగరునం జొరఁబోవువారల నిరోధించుచు నందుకుం గినిసినభటులతోఁ బోరుసల్పునట్టులు నావచనంబులుగ వచించి నాయనుజన్మునితో సంగరోపకరణసంపూర్ణం బగురథంబుఁ దోలుకొని తెచ్చి భువనేశ్వరీదేవాలయాభిముఖముం గావించుకొని యుండు మని వచించి గ్రక్కున నీ వీయెడకు రమ్ము.

ద్వారపాలకుఁడు. వత్సరాజ? అట్లయ్య,

అని నిష్క్రమించుచున్నాఁడు.

వత్సరాజు. ఇప్పు డే సేయంగడంగినదుర్వ్యవసాయంబు బుద్ధిసాగరునిచెవి కెక్కెనేని భోజకుమారు నఱుముకొనుట శక్యంబు గాదు.

చ. అనుపమబుద్ధిసంపదల నాసురనాథగురు న్హసించువాఁ,
డని జమదగ్నిసూనునికి నన్నివిధంబులచే సమానుఁ డా,

యనఘుఁడు సింధులక్షితిపునర్మిలిమంత్రి యజేయవీర్యుఁ డా,
ఘనునికి వృద్ధరాజుననుగ్రహకరంబు వశంవదం బిటన్.

కాన నతం డెటెంగి తనవారిం బురికొల్పుకొని మోహరించి భోజకుమారుం గావ వచ్చునంతలోఁ గుమారుని వధ్యస్థానంబునకుం దోడ్కొనిచనుట కార్యసాధకంబు. కాదేని ముంజునికి వశంవదులమాడ్కి దాక్షిణ్యంబునం బ్రవర్తించుచుండిన బుద్ధిసాగరప్రముఖులీయెడరున భోజకుమారునిం బట్టాభిషిక్తునిం జేయక మానరు.

ద్వారపాలకుఁడు. ప్రవేశించి,,

వత్సరాజ! భవన్నియోగం బనుష్ఠించినాఁడ,

వత్సరాజు. ఓరి య క్లైన నీ వతిరభసంబునం గుమారులయధ్యయనశాల కరిగి యుపాధ్యాయునిం దోడ్కొని రమ్ము. ఇదె యే సభాస్థలికిం జనుచున్నాఁడను.

అని పరిక్రమించుచున్నాఁడు.

ద్వారపాలకుండు. నిష్క్రాంతుండయ్యె.

వత్సరాజు. ముందటఁ గనుంగొని,,

ఏలకో యియ్యెడ సభికు లెవ్వరును లేరు? ప్రొద్దు గ్రుంకుసమయం బని కొలువువీడి చనిరి కాఁబోలు!

చింతించి. ఆహా తెలిసె,

చ. కుపితలయాంతకాకృతిని ఘోరపరాక్రముఁ గ్రోధమూర్ఛితున్,
తపనసమాను నన్ను నతిదర్పసముద్ధతుఁ గాంచి సభ్యులున్,
వ్యపగతధైర్యులై పనులు వైళమ దీర్చి స్వమందిరాళికిన్,
నెపములు పెట్టుకొంచు మది నిండుభయార్తతఁ బోయి రందఱున్.

వీరు లేకుండుట నాకుం గడు సహాయం బయ్యె. నిరాతంకంబుగ గార్యంబు నెఱవేర్చుకొన నగును.

ముందుకు దృష్టులు నిగుడ్చి. నవ్వుచు,,

ఏలే!జాతరకుం దొబ్బుకొనివచ్చు సెనుబోఁతురీతి నీయుపాధ్యాయుండు నా చెంగటికిం దిగిచికొనిరాఁబడియెడిని.

ఉ. చేతులపైకిఁ దార్చుకొని చెంగటికింకరు లెత్తికొంచు రా,
నాతతమూర్ఛ పైకొనుట నంగము విహ్వల మాచుఁ ద్రెళ్లఁగా,
నీతకనీనికాకృతుల నేత్రములం జల ముట్టి పాఱఁగా,
నీతఁడు వంతలం గలఁగి యేడ్చుచు వచ్చెడిఁ బ్రాణభీతిచేన్.

ద్వారపాలకుండు ముందు నడవఁగాఁ గింకరవిశృతుండై యుపాధ్యాయాకృతి ప్రవేశించుచున్నాఁడు.

ఉపాధ్యాయుఁడు. అనునయంబుతో,,

ఓరిద్వారపాల! న న్నిప్పుడు వత్సరాజు పిలిపించుటకుం గారణ మేమిరా! కరము కుపితుండై యున్న వాఁ డని యంటివే? మనం బు త్తలంపడియెడిని!

ఒకకింకరుఁడు. చేచాటుచేసికొని. ద్వారపాలునితో,,

అయ్యో యీబాపఁడు కడుఁ బొగరుపట్టినవాఁడు. ఇట్టియెడరులం జులుకుఁ జూపినంగాని వంగి రాఁడు. కాన నీవించుక యూరకుండుము.

ఉపాధ్యాయునిం జూచి,,

ఓబాపనయ్యా! ఊరక నెలజీతాలు మూఁటగట్టుకొని పోవచ్చు ననుకొంటివో? ఎప్పటికైన నిట్లులే సాగుచుండు ననుకొంటివి కాఁబోలు? బాపనయ్య లని మ్రొక్కులు పెట్టుటకు ముసలిముంజరాజు గాఁడుసుమా! నీవంటివారలకండ్లకావర మడఁగింపవలంతి వత్సరాజు నిన్నుంబరికింప వచ్చియున్నాఁడులే!

ఉపాధ్యాయుఁడు. బతిమాలుకొనుచు,,

ఓరిమారనా! యేలరా యింత నాపై కక్కసపడియెదవు? బ్రాహ్మణులపైనఁ గినుకఁ బూన నగునటరా?

మారన. ఓబాపనయ్యా! యీయడఁకువ తొల్లి చూపట్టలేదే? అయ్యా మాపిల్లవానికి రెండక్కరములు సెప్పవయ్యా యని నేను పలుమాఱు వేఁడుకొంటిని. పాదాలకు మ్రొక్కులిడితిని. జీతా లిచ్చెద నంటిని. చెప్పినపని చేసెద నంటిని. ఎంత సెప్పిన నప్పుడు కడు నిగిడితివిగదా! ఇప్పు డేమి సేయంబోయెదవు? పప్పుకూటిమాట వినఁబడినబడి వదలి పదియామడదూరమైనఁ బఱుగెత్తుటయ పనిగా నుండుదువు. అప్పుడు సదువుకొనుబిడ్డండ్ర కేమి దిక్కనుకొంటివో! అదినాలకుసయితము జీతము తీసికొనుచున్నావుగా!

మఱియొకకింకరునితో,,

ఓరి వెంగనా! యీనాయము వినరా! ఎప్పుడైనను తీరుబాటుగలప్పుడు సదువులు విందమని యీయనకడకుం బోయిన నీపొగరుబోతు బాపఁడు తొలిచదువు లని కొకిబికి కూఁతలు కొన్ని గూసికొనుచు నక్కడ నిలువనీక దఱుమువాఁడు. ఇప్పు డెట్లు దఱుమంబోవునో కందము.

ఉపాధ్యాయుఁడు. ఓరీ మారనా కినుకపడవలదురా! నీపిల్లవానికిం జదువులు గఱపెదరా! ఇవన్నియు వత్సరాజుతో లేనిపోనివి సెప్పకురా!

మారన. ఓబాపనయ్యా అట్లైన నీకు దండమయ్యా! మాపిల్లవానికి రంగడికి జీతము తీసికొనక చదువులు సెప్పెదవుగా! మాట తప్పిపోఁగూడదు సుమా!

ఉపాధ్యాయుఁడు. ఓరి! యట్లే; మాట తప్పను.

మారన. బాపనయ్యా! వత్సరా జదిగో యున్నాఁడు. దాపునకుం జనుము.

ఉపాధ్యాయుఁడు. ఓరీ వత్సరాజుం జూచినఁ గాలాంతకునిం గాంచిన ట్లున్నది. ఎట్లు డాయంబోదు. అడుగులు ముందుకుఁ బోవు. ఏమి సేతు.

మారన. ఓబాపనయ్యా యింతపిటికితన మేలనయ్యా! తలకుమించినదండన గలదా ఏమి? ఇందుకే వెఱవవలెనా! కానున్నది కాక మానునా! ఱోఁటిలోఁ దల దూర్చుకొని ఱోఁకటిపోటునకు వెఱవం దీరునా! పదపద! పోకుంటివేని యొకనూకున వత్సరాజునడుగులకడఁ బడఁ ద్రొబ్బెద. చూడు నాయేటు.

ఉపాధ్యాయుఁడు. వడవడవడంకునట్లు నటించుచు వత్సరాజుకడకుం జనుచున్నాఁడు.

వత్సరాజు. ఓయొజ్జలూ నేను మిమ్ముం దోడ్కొనిరా నంపి కడుఁ దడ వయ్యె ఇంతజాగేల చేసితిరి.

ఉపాధ్యాయుఁడు. విభ్రాంతి నభినయించుచు. ద్వారపాలకునితో,,
ఓరి యిందు కిప్పు డేమి ప్రతివచనంబు సెప్పంజాలుదు. చెప్ప నేని యేమిసేయం గలండో!

అని భయంబునంబోలె మ్రాన్పడుచు నిలకుం ద్రెళ్లె.

మారన. బాపనయ్యా! ఓదార్చుకొనుము. బాపలు పిటికిగుండె లనుట తార్కాణ యయ్యె. లేలెమ్ము.

ఉపాధ్యాయుఁడు. లేచి ద్వారపాలకునిం జూచుచున్నాఁడు.

ద్వారపాలకుఁడు. వత్సరాజ! ఈవిప్రుండు భవదాజ్ఞావచనంబు సెప్పినంతన సంభ్రాంతుండై యధ్యయనశాలయం దిట్లు ద్రెళ్లె. అయ్యెడ నుండునిరువురుకుమారభటులచే నితని మోపించుకొని వచ్చినాఁడను. అందువలనం దడ వయ్యె.

వత్సరాజు. ఒజ్జలూ! ఆయర్థం బటుండనిండు. భయపడకుఁడు. నే నడిగినయర్థంబునకుం బదులు తెలియం బలుకుఁడు. జయంతుండును భోజుండును బాగుగఁ జదువుచున్నారే! శాస్త్రంబు లెంతదనుకం గఱపితిరి.

ఉపాధ్యాయుఁడు. వత్సరాజ! యిరువురును బాగుగ నధ్యయనము చేయుచున్నారు. శాస్త్రంబులు సాంతంబులు పఠింపంబడియె. నీతిశాస్త్రంబున నతిప్రవీణులైరి.

వత్సరాజు. ఉపాధ్యాయ! ఆయిరువురలో నెవఁడు విద్యాధికుండు. బుద్ధిచాతుర్యంబును కావ్యనాటకాలంకారవిచక్షణత్వంబు నెవని కధికము?

ఉపాధ్యాయుఁడు. వత్సరాజ! యిరువురునుసమగ్రులే! అయినను జయంతుని కంటె భోజుండె మిన్న యనవచ్చు.

వత్సరాజు. అట్లైన నాభోజకుమారుని విద్యలందుం బరీక్షింపవలసియున్నది.

ఉపాధ్యాయుఁడు. భోజకుమారునిం బరీక్షింపం గలవిద్యావిశారదుండును గలఁడా!

ఉ. భారతి యీవిధిం బురుషభావము దాలిచి వచ్చియున్నదో,
ధారుణిలోఁ గళావితతి తాదృశమూర్తినిదాల్చి పాల్చెనో,
సారసగర్భుఁ డీవిధిని సమ్మతిఁ బుట్టి చరింపఁ బూనెనో,
ఆరసి చూడ భోజుఁడు మహాత్ముఁ డటంచుఁ దలంతు మాత్మలోన్.

వత్సరాజు. ఉపాధ్యాయ భోజకుమారుం డట్టివాఁడేని యవశ్యముగఁ బరీక్షింపం జనును. సర్వజ్ఞుండనం బరగునొకయతివరుండు వేదవేదాంగపారంగతుం డపరవేదవ్యాసుడనం జనువాఁడు నగరప్రవేశంబున కీసడించుకొని భువనేశ్వరీదేవాలయంబుకడకు విచ్చేసి యున్నవాఁడు. ఆతనిం గొని భోజునిం బరీక్షించెద.

ఉపాధ్యాయుఁడు. వత్సరాజ అట్లు సేయవచ్చు.

వత్సరాజు. ఉపాధ్యాయ యిది నీకుం బ్రియం బగునేని భోజకుమారునిం బిలిపింపుము, ఈద్వారపాలకునితోఁ జెప్పిపంపి రప్పింపుము.

ఉపాధ్యాయుఁడు. వత్సరాజ! యిందు నేఁ బ్రియంపడక పోవుటకుం గారణమే మున్నది?

అని ద్వారపాలకుంగాంచి,,

ద్వారపాలకా! విద్యాశాలకుం జని భోజకుమారునిం డాసి భువనేశ్వరీదేవాలయంబునం దతఁడు విద్యలందుం బరీక్షింపంబడంబోవుట యెఱింగించి నామాటగాఁ జెప్పి తోడ్కొని రమ్ము.

ద్వారపాలకుఁడు నిష్క్రాంతుండయ్యె,,
వత్సరాజు. ఆత్మగతంబున,,

భోజకుమారుని తెలుపటిచి భువనేశ్వరీవిపినంబునకుం దోడ్కొని చనుటకు నేఁ బన్నినకపటోపాయంబు ఫలితప్రాయంబ. అయ్యెడకుం దోడ్కొనిచనినయనంతరము కార్యంబు నెఱవేఱుచునంతలో నెవ్వరు నెఱుంగంజాలరు.

ప్రకాశముగ,,

ఉపాధ్యాయ! భోజకుమారుండు భవద్వచనంబునందు గౌరవము గలవాఁడె? వైళంబ సనుదెంచి నిన్నుఁ గారవించునే?

ఉపాధ్యాయుఁడు,,

క. అవనిపతిసుతుఁడు భోజుఁడు | జవదాటఁడు గురులవచనసరణిని నెపుడున్,
భువి విప్రసాధుగురుపద | భువనజమధుపాత్మవృత్తిపూతుఁడు వినుమా!

వత్సరాజు. ఆత్మగతంబున,,

ఇట్టిసుగుణసంపత్తి యీకుమారుని ననారతము కాచుచుండదే! మనరవించిననికృతు లీతనియందుఁ జండభానునియెదుట నంధతమసంబులువోలె రూపుమాయక పోవునే? ఇట్టిసుగుణభూషితుండు గానినాఁడు వీనిని భూభర్తఁగాఁ బ్రజలు గోరుదురే; చిరకాలమునుండి రూఢమూలుం డైనను ముంజునిపై ప్రియంపడక చంద్రోదయంబునకుం జకోరంబులువోలె నితనిపట్టాభిషేకంబునకుం బ్రతీక్షించెదరు. లోకం బెప్పటికిని గుణపక్షపాతంబు.

తలయూచి,,

కానిమ్ము. చేతనైనంతగనుకఁ బ్రవర్తింతము. ఫలము దైవాయత్తము.

అంత ద్వారపాలకుండుముందునడవఁగా భోజకుమారుండు ప్రవేశించుచున్నాఁడు.

భోజకుమారుఁడు. ఓరీ ద్వారపాల మాయుపాధ్యాయు లెయ్యెడ నున్నారు?

ద్వారపాలకుఁడు కుమార! వత్సరాజుతో మాటలాడుచు సభాభవనంబున నున్నవారు!

భోజకుమారుఁడు. ఓరి యట్టైన నయ్యెడ కరుగుదము.

ద్వారపాలకుఁడు. కుమార! యిటురమ్ము ఇటురమ్ము.

భోజుఁడు. పరిక్రమించుచున్నాఁడు.

ద్వారపాలకుఁడు. కుమార! అదిగో ఉపాధ్యాయుఁడు భవదాగమనమునకుఁ బ్రతీక్షించుచు వత్సరాజుచెంగట నుండెడిని. ఉపసర్పింపుము.

భోజకుమారుండు. ఉపసర్పించి. సవినయముగ,,

గురువరా! ఇదె యంతేవాసి భోజుండు నమస్కరించుచున్నాఁడు.

ఉపాధ్యాయుఁడు. కుమార దీర్ఘాయుష్మతుండ వగుము.

వత్సరాజు. ఆత్మగతమున,,

ఇట్టిసాధుసేవకునియందు బ్రాహ్మణాశీర్వచనంబులు సార్థకములుగాక పోవునే !

ఉపాధ్యాయుఁడు. కుమార ! భువనేశ్వరీదేవాలయమున కచింతితోపగతుం డైనయొకసర్వజ్ఞునిచేత వత్సరాజు నిన్నుభ్యస్తవిద్యలయందుఁ బరీక్షింపంగడంగి యయ్యెడ కు మనలఁ దోడ్కొని చన ననుజసమానీతం బగునరదంబు నాయత్తము గావించుకొని యుండెడిని. కుమార వినుము. ఉపాధ్యాయవృత్తి జీవించువానికిం గష్టంబులు మెండు !

గీ. ఆస్పదంబుఁ దొరికె నని యెంచి తృప్తుఁడై। వాదమునకు వెఱచువాఁడు జ్ఞాన,
పణ్యుఁ డైనవైశ్యబంధు వటంచుఁ దా। మాడికొంద్రు ధరణి నఖిలజనులు.

కాన మన కాసర్వజ్ఞునిసన్నిధి కవశ్యముగఁ జన వలసియున్నది.

భోజుఁడు. గురువరా మీమాటల కడ్డంకి గలదా ! నాకఱచినవిద్యలయందు గురువులు సెప్పినయర్థం బు పన్యసింపం జాలియున్నాఁడ. ఇందుకుఁ జంకు గొననేలా !

క. దేవతలయందు భక్తియుఁ। బావనగురుచరణనళినపరిచర్యయు భూ,
దేవతలకృపయు గలనరు। భావమునం దోఁచుఁ గథితపరమార్థతతుల్.

కాన యుష్మదీయపదజలజభక్తిపరత్వంబున నుండునాకు భవత్ప్రతిపాదితాఖిల శాస్త్రసంచయంబులలోనియర్థంబుల నుపన్యసింప నడ్డంబు లేదు.

వత్సరాజు. ఉపాధ్యాయ! అట్లైన భోజకుమారునిం దోడ్కొని నీవు రథం బారోహింపుము. భవద్రక్షణార్థం బేను ఖడ్గం బపకోశంబుఁ గావించుకొని మీవెనువెంట నరిదం బెక్కెదను.

అని ఖడ్గం బొఱవెలికి పట్టుకొని. ద్వారపాలకునిం గాంచి,,

ఓరి నీపని చూడుము పొమ్ము.

ద్వారపాలుండు నిష్క్రాంతుం డయ్యె.

వత్సరాజు. ఉపాధ్యాయ! అదిగో రథంబు. దాని నారోహింతము రండు. సూర్యుండు చరమగిరిశిఖరంబునకుం జేరునంతలో మనము భువనేశ్వరీదేవాలయంబునకుం బోవలయు.

ఎల్లవారలు నిష్క్రాంతు లైరి.

ఇది భోజరాజచరితనాటకంబునందు భోజకుమారగ్రహణం బనుద్వితీయాంకము. సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.

# శ్రీమదాంధ్ర భోజచరిత్రము.

అందు

## భోజరాజచరితనాటకము

## తృతీయాంకము.



### శుద్ధవిష్కంభము.

సరభసగమనంబునం జనుచుం బురుషుండు ప్రవేశించె.

పురుషుండు. బుద్ధిసాగరుండు ఆర్యుండు నాకు ముదల యిడెను. నీ వతిత్వరితగతి రాష్ట్రపాలునికడకుం జని నావచనంబులుగఁ జెప్పునది. భవద్వశగతులై యున్నసైనికులును రాజబంధువులును శూరులును పౌరప్రధానులును వత్సరాజు భోజకుమారునిఁ బురంబు వెలికిం దోడ్కొని చనుటయు వంగసైనికు లదాటున ముంజునినగరును గిరికొని యేరిచేని లోనం జొరనీక మల్లకట్టుటయుం జూచి కుమారునియుం దనిష్టాశంక వొడమి క్రోధోద్దీపితులై ముంజునిపక్షమువారల నలుముకొని చంపం గడంగి మహాక్షోభంబు గావించెదరు. వారిఁగోల్తల సేయుచుండుట వారల యిపుడు మనకుం గార్యంబుఁ గాదు. నీవు ధారానగరసైనికప్రధానుల నతిజవాశ్వికసైన్యసమేతులం బెక్కండ్రం దోడ్కొని వైశంబ చని భువనేశ్వరీదేవాలయవిపినంబున వత్సరాజు కుమారునం దతిపాపం బాచరింపకమున్న వావంగాధిపతి నెదిర్చి కుమారునిం గావ వలయును. అని చెప్పి పంపినవాఁడు. ఏను నతిత్వరితగతిం జనుచున్నాఁడను.

పరిక్రమించుచున్నాఁడు. నేపథ్యంబునం గలకలంబు. పురుషుఁడు నిక్కిచూచి,,

ఔర! యీధారానగరవాస్తవ్యులకు సింధులునియందుం గలభక్తి నేమందు తత్పుత్రుని నాక్రమించుకొనుటంజేసి,,

మ. పౌరులు సైనికుల్ నృపతిబంధులు వీరులు క్రోధవేగవి,
స్ఫారమహోగ్రమూర్తు లయి సాహిణముల్ గజశాలలుఁ రథా,
గారము లుష్ట్రశాలలను గామిను లుండెడుసౌధవీధికల్,
దూరి వధింపఁ బూని కడు దొందడి నార్చుచు నున్నవా రిటు

ఔరా! వీరలహృదయకుటీరంబులం బూర్వమునుండి ప్రధూమితం బగుచుండురోషానలం బొక్కయెడుగునం బ్రజ్వరిల్లుడు నీనిమిషంబునన.

చ. తురగముల న్వధించి బలుతుంగగజంబులఁ జంపి తేరులన్,
ధరణికి ద్రొబ్బి ఖడ్గఖరధారల వీరభటాళిమస్తముల్,
బరువడి ద్రుంచి యంతిపురి బానిసనల న్గమువీటికంపి ని,
ష్కరుణత ముంజపక్షచరసంఘము మాపఁగఁ బూని రుక్కునన్.

పరిక్రమించుచున్నాఁడు నేపథ్యంబున మహాకలకలంబు,,

పురుషుండు. కట్టా! యీయెడరున ముంజపక్షంబువారు గోడుగుడుచున్నారు.
శ్లో,, ఏకః పాపాని కురుతే ఫలం భుక్తే మహాజనః,, అన్నట్లు ముంజుండు పాపంబు సేయఁ దక్కినవారలు చిత్రవధవలనఁ బ్రాణములు గోలుపోవలసివచ్చె. ఇప్పు డీయ్యెడ,,

చ. తల లగలంగ నేనుఁగులు ధారుణిఁ గూలుచుఁ బెట్టుగీకలున్,
బలితపుదేహము ల్లైగఁగ వాజులు ద్రెళ్లుచు నార్చునాద మట్లె,
లిలపయిఁ గూలుచున్ భటు లహీనతఁ జేసెడియార్తనాదముల్,
గలసి మహారవంబు పురిఁ గ్రంతల రథ్యల నెచ్చె ఘోరమై.

వంగసైన్యంబులు ముంజునిం గావ సమకట్టియుండుటం జేసికాఁబోలు నగ్గలం బగు ధారాసైనికనికరంబు నంతట నాపఁ జాలక యుద్దిష్టకార్యంబునన యుండెడిని. ధారానగరసైనికులు బుద్ధిసాగరునియానతిలేమింజేసి రాష్ట్రపాలాదులు కోల్తలచేసి కవ్వింపక యొప్పరికించి యుండుటవలన వారు ముంజుని జంపం బోఁ జాలరు. ఇది బుద్ధిసాగరుని యభీష్టాంతరము.

పరిక్రమించుచున్నాఁడు. ముందుకు దృష్టులు నిగుడ్చి,,

కట్టా! భోజకుమారునివిరహంబున కోర్వంజాలక పౌరులు కడుఁ గఠోరావస్థలకుం బాల్పడుచున్నారు. ఇయ్యెడ.

ఉ. కొందఱు తోమరంబులను గొందఱు ప్రాసపరశ్వధంబులన్,
కొందఱు కుంతసంతతులఁ గొందఱు తీక్ష్ణమహాసిధారలన్,
కొందఱు దీర్ఘభల్లములఁ గొందఱు వహ్నివిషాగ్నిరజ్జులన్,
గ్రందుగ నాత్మహత్యలను గన్నఁటఁ జేయుచు నున్నవారటన్.

ఈదుఃఖంబుం జూడనోపను. అవ్వలికిం జనియెద.

పరిక్రమించుచున్నాఁడు.

కట్టా! ఇయ్యెడ నతికఠోరంబుఁ గాంచవలసివచ్చె. ఇది చూడశక్యంబు గాదు. కటకటా యియ్యెడ విప్రకామినులు భోజకుమారునిదారుణదశావిపాకంబు విని దుఃఖావేశవివశ లయి సొదఁ బేర్చుకొని యం దుఱకం గడంగి యేడుచుచున్నవారు.

నేపథ్యంబున నార్తనాదంబు వినంబడగానే వెంబడిని,,

చ. ముదము దొలంగ సింధులునిముద్దుకుమారుని జంపి రింక శ్రీ,
పదమయి శారదేందురుచిభవ్యవిలాసమనోజ్ఞ మైనయా,
మదనునిముద్దుమోముఁ బలుమాఱును గానక యుండఁ జాల మా,
సదయునిఁ జేరఁ బోయెదము చయ్యన వహ్నిఁ దొలంగి మేనులన్.

పురుషుండు. ఔర! యీభోజకుమారుండు బాలుండు. పౌరులకష్టసుఖంబు లంతగా నెఱుంగం గల్ప్రాయంబును బుద్ధియునిండనివాఁడు. అట్లుండియు నాతని కిడుమ వచ్చినదన్నమాత్రాన దేహంబులనుసహిత ముజ్జగింపఁ గలయంతటియనురాగభరంబు వీరలకుం గల్గియున్నది. ఆతనియందుం గలస్వాభావికసుగుణసంపత్తి యట్టిది.

వెండియు నేపథ్యంబున,,

కష్టా విధి యతివిపరీతంబుఁ గావించె,

చ. అభినవకాంతిసంపదల కాకరమై శతపత్రపత్రస,
న్నిభరుచిరాంతరక్తరుచినేత్రవిలాసవిశోభితంబునై,
సుభగమదద్విరేఫకులసుందరకుంతల మైనభూమివ,
ల్లభునికుమారునెమ్మొగ మిలం గనుభాగ్యము లేదు మా కికన్.

పురుషుం డులిక్కిపడి,,

కష్టా నేను పురజనులు పడుచుండువంతలం గాంచుచు ననతిరభసగమనంబున నరుగుచున్నాఁడ. వైశంబరాష్ట్రపాలునికడకుం బరువిడక యన్యరసాక్షి ప్రత్యూహదయుం డనై కార్యంబుఁ జెలుపం బూనితి. ఇంక నైనను వైశంబ చని బుద్ధిసాగరునానతి సెప్పి రాష్ట్రపాలునిఁ గుమారునిం గావ భువనేశ్వరిదేవాలయవిపినమున కంపెద.

అనిత్వరితగతిఁ బరిక్రమించుచు నిష్క్రాంతుండయ్యె.

శుద్ధవిష్కంభము.

సంపూర్ణము.

---

## తృతీయాంకము.



వత్సరాజానుజసారథికరథారూఢులై భోజకుమారుండు నుపాధ్యాయుండును అప శోకఖడ్గసరుం డై వత్సరాజును ప్రవేశించిరి.

భోజుడుఁ. ఆత్మగతంబున,,

ఏలకో వీఁడు భువనేశ్వరీదేవాలయాశ్రమంబు దాటించి యతిఘోరవిపినంబుత్రో వపట్టించి యరదంబును గడువేగంబునం బఱపుచున్నవాఁడు. సభాస్థలంబున నుడివిన పల్కులవిధంబుఁ జరపక యిట్లు చరించుట లారసిన నాయుం దేదేని పాపకృత్యంబు సేయం గడంగి యున్నారని తోఁచుచున్నది. ఇసీ! ఇందుకుం జింతఁ గూరవలయునే యిప్పుడీరథంబును.

చ. సుమఫలబంధురంబులయి శోభితపల్లవభావితంబులై,
శ్రమపరిహారకంబులయి చాలులుదీరినచెట్టు లుండునా,
శ్రమ మొగి దాఁటి దవ్వుల జరత్తరుఘోరము కాకఘూకలో
కము జనశూన్య మైనపృథుకంటకకాననసీమ కేగడిన్.

పోనిమ్ము. ఇట్లు రథంబుఁ దోలి వీర లేమి సేయంజాలుదురు.

ప్రకాశముగ. ఉపాధ్యాయునిం గాంచి,,

ఓమహాత్మా మన మెప్పుడును గాంచనియీజీర్ణారణ్యప్రదేశము.

శా. క్రూరజరన్మహాజగరఘోరము మాంసవిలోభవిభ్రమ,
త్ఫేరవరావసంకులము దీప్తశిలాగిరికుల్యకంబు వి,
స్ఫారవిశీర్ణతుంగతరుశాఖ మరణ్యవిభాగ మాత్మకున్,
భైరవమై తనర్చుఁ దలఁపం గడుధీరులకైన నేర్తెఱన్,,

మఱియు నిం దతినృశంసులు సయితము చూచిరేని వెండియు నట్టిదారుణకర్మంబునకుం గడంగనీక వెఱపు నెఱపునట్టియతిభీషణం బొండు గలదు. అదియును గనుంగొనుము.

చ. ఘనమణిభూషణంబులను గైకొనఁ గాంతల నర్భకావళిన్,
ఘనుపడి ముచ్చిలించి పెఱపట్టణసీమలనుండి తెచ్చి భో,
రన నిటఁ జంపుచోరుల ధరారమణుల్ తలఁద్రుంచి యాతలల్,
ఘనబలదర్పమేర్పడఁగఁ గట్టినజీర్ణనగాళి వ్రొల్చెడిన్.

ఉపాధ్యాయుండు. భయోత్కంపంబుల నభినయించుచు,,

వత్సరాజ! ఈభీషణస్థలంబుం గాంచినదాదిగ నాడెందంబు మహాభయవివశంబై యుత్తలంపడియెడిని.

వత్సరాజు. ఓబాపఁడా! అట్లయేనిఁ జయ్యన నరదంబు డిగ్గి యూడనిబాడుము.
అని రథంబునిలుపుచున్నాఁడు.

ఉపాధ్యాయుఁడు. వత్సరాజ నీ వీచోటికి మమ్ముం దోడ్కొనివచ్చుటకుఁ బ్రబలతరపాపవ్యవసాయపరాయణత్వంబు కారణంబుగా నుండు నని యెంచియు వ్యా

ఘ్రాక్రాంతం బగుమృగంబుభాతి తప్పించుకొన నను వేది యున్నాఁడ. అరదంబు దిగిన దుష్టశ్వాపదమృక ప్రముఖంబులవాతం బడి మృతుండనే యగుదును. ఇయ్యెడ నిప్పటికి మృతప్రాయుండనై యుండెదను.

భోజకుమారుఁడు. గురూత్తమా ! యేల యింత వంతం గుందెదరు.

ఉ. ఏ నిఁట మిమ్ముఁ గావఁగ మహీపతిపుత్రుఁడ దండ నుండఁగా,
మానవనాథు లెట్టిబలమానితులేఁ జెనకంగఁ జాలరీ,
దీనుఁ డనంగ నెంత నతిదీపితరోషమహోగ్రసింహసం,
తానమునొద్ద నక్క తనదర్పముఁ జూపఁగఁ జాలునే యిలన్.

వత్సరాజు. అసూయతో,,

ఓరీ రాచములుచ! ఆవిప్రునింగాఁచుట యట్లుండనిమ్ము. నిన్ను నీవు రక్షించుకొనం గలవా!

చ. అరిభుజదర్పభారవిపినానలచండతరోరుసాహసో,
త్తరుఁ డిల వత్సరాజను మధారుణి విశ్రుతి కెక్కి యుండ ని,
ర్భరమదమత్తత న్నను గరంబు తిరస్కృతిఁ జేసి తీవు నీ,
శిరమును గత్తిచే నిదిగొ శీఘ్రగతిం ధరఁ ద్రెళ్లఁ గొట్టెదన్.

భోజకుమారుఁడు. సోత్ప్రాసముగ,,

మ. ఓరి మతిప్రహీణ మహిమోన్నతుఁ గా నిను నెంచుకొంటివో,
కోరిక మాకడం గడుపుకూటికి దాస్యము సేయువాఁడ వీ,
దారిఁ జరింపఁ బూనుటలు తథ్యమ యింటికేఁ గావలైనయా
క్రూరపుఁగుక్క స్వామిని విరోధముతోఁ గఱవంగ బూను లే.

వత్సరాజు. వెడనవ్వునవ్వుచు,,

ఓరి నీకు ధారాధిపత్యము గలదనితలంచి కాఁబోలు నన్ను నీక్రిందఁ గడుపుకూటికిం గాచుకొనియుండువరవునింగాఁ దూలనాడెదవు.

ఉ. బాలక నీకు రాజ్యరమ పాయక వచ్చు నటంచు నెంచెదో,
చాలు దురాశ! సింధులుఁడు చచ్చిననాటనె పాసియుండ నా,
ఖేలవు నిన్నుఁ జంపి యతిభీషణసత్త్వపిశాచపఙ్క్తి కిం,
దేలికఁ గా రచింతు వసుధేశ్వరపుత్రక చూడు మొయ్యనన్.

భోజకుమారుఁడు. రోషంబుతో, ఇసీ!

ఉ. మానవిహీన నిన్ను జనమాన్యుఁడు సింధులభూమిభర్త సం
తానము స్త్రీల రాజ్యమును దర్పమున న్హరియించి వెల్చినన్

దీనత వేడి యాతని కధీనుఁడవై జరియించుచుండుటల్,
మానుగ లోఁ దలంచుకొని మాటలు పెక్కులు మానుకొమ్మికన్.

వత్సరాజు. ఆత్మగతంబున,,

ముంజునిమాట మీఱలేక సింధులుండు నాకు నా రాజ్యంబు వెండియు నిచ్చెను గాని కరుణచేత నిచ్చెనా! లోలోపలఁ దనకు సహాయుడనై యుండుటకు ముంజుఁడు నాయందుఁ బ్రేమించినవాఁడు. ఉండని మ్యాయర్థంబు?

ప్రకాశముగ,,

ఓరీ! నీజనకుండు సింధులుండు రాజ్యము సంపాదించినంగదా నీచెప్పినచొప్పున!

చ. అనుపమబాహుగర్వభరితాత్ముఁడు ముంజుఁడు భూమిఁ గెల్వఁగాఁ
దన దని సింధులుండు తనతమ్మునిసమ్మతి నేలుచుండె నీ,
ఘనబలవత్సహాయమును గైకొనఁడేఁ గడు స్పర్ధఁ దేమి సే,
యును దనరాజ్యమం దతని నుంచుటకుం గత మియ్య దారయన్.

భోజకుమారుఁడు. ఓరీ నీవు నోటికి వచ్చినట్టులెల్లఁ బ్రేలుచున్నావు.

చ. అనుపమబాహుగర్వమున నందఱరాజుల నుక్కడంచి నా,
జనకుఁడు బాల్యమంద యతిచారుయశోనిధి భూమి నంతయున్,
తనభుజమందుఁ దాల్చె నిను దర్పితు నల్పుని మూర్ఖుఁ బట్టి తేఁ,
బనిచెను ముంజు నంతటనె పార్థివువిక్రమ మల్ప మయ్యెనే!

ఇట్టియవక్రవిక్రమఘనుల రాజర్షుల దూషించునీనోటిపండ్లు డుల్ల నడచినంగాని పాడి గాదు.

అని తనకాలిపాదుకం గైకొని వత్సరాజును దాలుదేశంబునం బ్రహరించె.

వత్సరాజు. గాఢప్రహారవేదన నభినయించుచు. మహాక్రోధంబుతో,,

ఓరీ! క్షత్రబంధూ, మదీయక్రోధావేగకాలానలజ్వాలాజాలంబునకు శలభంబ వైతివి.

ఖడ్గంబురుఘళిపించుచు,,

ఇదె.

చ. ఘనతరమద్భుజాకలితఖడ్గనిశాతమహోగ్రధారచే,
తను భవదీయమూర్థమును ధారుణిఁ ద్రెళ్లఁగఁ గొట్టి యిర్వ్యేడన్,
గనఁబడువృక్షశాఖకును గట్టెద నూరక యుందు వంతటన్,
పనుపడి సింధులాధిపునిపక్షపువారలు సూచి యేడ్వఁగాన్,,

అని భోజకుమారుని ఖడ్గంబునం బ్రహరింపం బోయె.

భోజుఁడు. సహేలంబుగ పాణిప్రకోష్ఠంబున ఖడ్గంబుఁ దట్టి వేసె.

నేపథ్యంబున మహాకలకలంబు,,

వత్సరాజు. తిరిగిచూచి. శంకించుచు. ఆత్మగతంబున,,

ఏవియో యిచ్చోటకుఁ జమూసమూహంబులు కడువేగంబునం బఱతెంచెడిని. నిరూపించిచూచి,,

ఏవియో యననేల రాష్ట్రపాలప్రేరితంబై సింధులపక్షపాతి యగుధారానగరసైన్యంబు భోజకుమారునిం గావ నేతెంచుచున్నయది. ఇఁక నాయుద్దిష్టకార్యంబుకడముట్టుట దుర్లభంబు.

నేపథ్యంబున,, కొందఱు,,

ఓరీచండాల! వత్సరాజ! రాజకుమారునిఁ గనుబ్రామి తెచ్చి యిచ్చోట నాపసికం దునందు దారుణకర్మం బాచరింపం గడంగితి వటరా! కష్టా! రాజవధంబు మహాపాపం బని యెఱుంగవటరా! అందుం బసిబాలుని నిష్కృతిమెయి నిర్జనంబునకుం దెచ్చి చంపం దెంపుఁజేసితివి. ఛీ! యిట్టిపాపవ్యవసాయంబు నరుండై పుట్టినవాఁడు సేయుపనియే. వృద్ధభూపతి నీవిషయంబునం జేసినమహాసహాయంబుఁ దలంపవైతివి. నీకు సమస్తసంపదలు వస్తువాహనంబులు రాజ్యంబు నొసంగినవానిపట్టిని నిరపరాధిని బాలునిం బట్టిచంపం దెంపుచేసితివి. ఇసీ! నీబ్రతుకువంటినింద్యంబు లేదు.

మఱికొందఱు,,

చ. నిరతము దుష్ప్రవర్తనకు నెమ్మిఁ గడంగెడునిన్నుఁ బట్టి ఛీ,
కరగతి శిక్షచేసి సిరిఁ గైకొని వెండియు సింధులుండు లోఁ,
గరుణ జనించి యిచ్చి నినుఁ గాచెను గాఁ గృత మాత్మలోపలన్,
దొరకొనదొట్టు నీవలె విమూషితవృత్తియు నుండునే ధరన్.

మఱియుం గొందఱు,,

ఓరీ! రాజవంశాపశద!

చ. నిను దలఁగొట్టి యీభువిని నిర్మలకీర్తులు నిండునట్లు పా,
వనచరితుండు సింధులునిపట్టికిఁ బట్టముఁ గట్టి ముంజుని,
న్వనమున కంపి మాధరణివల్లభునానతి నాచరించి యా,
తనిదయఁ గాంచినందుకుఁ గృతజ్ఞతఁ జూపుదు మొక్కట్రేల్మిడిన్.

ఓరీ! నీవు బుద్ధికౌశలంబున నేరికి నెఱుకపడకుండఁ జేసినపాపాచారంబునకు ఫలం బనుభవించుచున్నాఁడవు. చూడుము.

చ. బలమున సింధులక్షితిపుపక్షచరుల్ భవదీయపక్షవ,
ర్తుల గజవాజిబృందములతో భటపఙ్క్తులతో రథాళితో,
బలమునఁ జంపి వంగబలసంతతులం దునుమాడి నిన్ను న,
గ్గల మగుకిన్కఁ జంపుటకుఁ గాఁ జనుదెంచిరి మానవాధమా!

భోజకుమారుఁడు. హరిహరీ! అని చెవులు మూసికొని,,

ఆహా! యే నతిదారుణం బగుపాపంబునకు భాజనం బగుచున్నాఁడను. నాకతంబున ననపరాధిప్రాణివర్గంబు ప్రవృత్తం బయినదని వింటిని. ఆర్య రాష్ట్రపాల రాజభక్తిం గానిపించితివి. క్రోధోద్దీపితులై తాతభక్తి గలరాజపుత్రులు హతశేషులం జంపుచుండుదురు గాన వారికి మహారాజసింధులేశ్వరునిపాలనంబున నుండినవారి కేరికైన దుఃఖంబుం బొరయకుండఁ బ్రవర్తింపం జను నని ముదల యిడి సైన్యంబుల నగరంబున కంపుము. ఆదారుణవ్యవసాయంబు మానిపింపుము. ఈవత్సరాజు నతినీచ నతిజుగుప్సితకర్మాచరణనిహతతేజు శిక్షింప సైన్యంబుఁ గావలయునే! కుక్కను గొట్ట బచ్చనకోల యేల? మదీయపాదుకాప్రహారంబున విభగ్నదంతం బగుముఖంబుతో వెలవెలఁబోయియున్నాఁడు చూడుము.

వత్సరాజు. ఆత్మగతంబున,,

ఔరా ఏమి యీభోజకుమారునియుదారత! ఇట్టిమహాధీర ప్రకృతి నతిత్వరితగతి రాజ్యలక్ష్మి వరింపకున్నె.

అసూయతో,

ఈయర్థంబుఁ జింతింప మన కేల? ఎవ్విధంబుననేని ముంజునభీష్టంబు నెఱవేర్పుట లగ్గు! ఇంక వీనిం బరాక్రమంబున జయింప శక్యంబు గాదు. పెద్దలయానతి నతిక్రమింపని సాధుభావంబునం జనువాఁడు గాన రాష్ట్రపాలాదులవచనంబులకును విధేయుండు గాక ముంజునభిప్రాయంబు తాన జరుప వెరవుమెయి నీతనిం గడంగించెదను.

ప్రకాశముగ,

మహారాజకుమార! నాయపరాధంబు క్షమింపుము. నే నుదరంభరిని. ముంజునానతి సేయుకింకరుండను.

అని ప్రణమించుచున్నాఁడు.

రాష్ట్రపాలుఁడు, ప్రవేశించి,

కట్టా! యీవత్సరాజు సాధుభావంబునం గుమారునికిఁ బ్రణతుం డయ్యె నని తలంపం జనదు. మోసగాండ్రకు మొదటివాఁడు. నికృతిమెయి నిట్టు లుద్దిష్టకార్యంబు

సాధింపం గడంగియుండు. పెద్దలయందుఁ దద్దయు భక్తిగలవాఁడు గానఁ గుమారుండును వంచనకు లోఁబడును. నేఁ గుఱంగటనుండి యీయొగ్గువలనఁ గుమారు నివర్తింపఁ జేయఁ జనును గానఁ బాదచారి నై వచ్చితిని. కుమారునరదంబు నారోహింపనలయు!

అని రథారోహణ మభినయించుచున్నాఁడు.

రాష్ట్రపాలుఁడు. కుమార! నీయానతి సల్పినవాఁడను.

భోజకుమారుఁడు. ఆర్య! అట్లైన సంతసంబ.

వత్సరాజుం జూచి. ఓరీ మత్పితృవ్యునానతి యెట్టిది ?

వత్సరాజు. భోజకుమారుని చెవిలోఁ జెప్పుచున్నాఁడు,

భోజకుమారుఁడు. పక్కునవ్వి,

ఓరి యిదియేనా ముంజభూపతియానతి ! తనకుమారుని జయంతుని ధారారాజ్యంబునకుం బట్టంబుగట్టం దలంచి యిట్లు చేసెం గాఁబోలు. నాపితృవ్యుం డీయలంతిపనికై యింత యాయాసంపడుట యేల! నన్నడిగిన జయంతునికి రాజ్యం బియ్యకపోదునే! వాఁడు నాకు రెండవహృదయం బనం బరఁగువాఁడు గదా! వానికన్నం బ్రణయపాత్రంబు మఱియొక్కరుండు లేఁడు.

వత్సరాజు. రాజకుమార ! నీహృదయం బతనియందట్లు నచ్చియుండుట నిక్కంబ. అయిన నేకారణంబున నట్లానతిసేయవలసివచ్చెనో యెఱుంగను. నీవును తండ్రికి సమానుం డగుపినతండ్రినానతి సల్పి పితృవాక్యపరిపాలనం బొనరించిన శ్రీరాముని చందబున శాశ్వతయశఃకాయంబు సంపాదించుకొనుము.

రాష్ట్రపాలుఁడు. ఆత్మగతమున,,

భోజకుమారుం డీమాయావిపలుకులు విని ముంజునానతికి లోఁబడునేని సర్వంబేకపదంబున వినష్టం బయినయదియు. ఈవ్యవసాయంబువలనఁ గుమారుని మరల్ప వెఱవూహింపవలయు.

భోజకుమారుఁడు. ఆర్య రాష్ట్రపాల ప్రజలకు రాజాజ్ఞాతిక్రమణంబు పాడిగాదు. రాజు తండ్రియే యై యుండిన రెండుప్రకారంబుల నతనియానతి గౌరవింపం జనును. అదియునుంగాక,

చ. ఘనతరమాంసరక్తపరికల్పితమై మలమూత్రగేహమై,
మనుజునికాయ మొప్పు ; జనమాన్యయశోనివహంబు దాన నె,
ట్టన గడియింపఁగాఁ జను ; విడంబన గాంచును సేయఁడేని ; యా,
మనుజునిజీవనంబు వృథ ; మానక సేతు పితృవ్యునానతిన్.

దీన నాకు బహిశ్చరం బగుప్రాణంబు నానొప్పుజయంతునికి ధారారాజ్యం బు సంప్రాప్తం బగు. జీమూతవాహనాదులు మిత్రునికిం బ్రాణంబులచే నుపకరించుటకుం గడంగి మహితం బగుయశంబుం గాంచరే !

రాష్ట్రపాలుఁడు.

చ. నిరుపమసాహసప్రణయ నీవువచించినమాట యొప్పు భూ,
వర నవసాహసాంకునికి వర్ణితకీర్తికిఁ బుట్టి నట్టినీ,
కరు దన వచ్చునే యది మహాబ్ధిగభీరులు నీదుపూర్వు లీ,
ధరణిఁ బ్రజాసమర్చనలఁ దాపనివారలు సూవె యాత్మలన్.

అవధరింపుము.

క. తనకంటె యశము పర మగు । ధన మని నీపూర్వు లాత్మఁ దలఁచి ప్రజారా,
ధనమాత్రతత్పరత్వముఁ । గొనుచుఁ బ్రవర్తించి రాత్మగుణమండితులై.

అట్లు నీవును బ్రజారంజనంబునం దద్దయు విఖ్యాతి వడయఁ దలసినవాఁడవు.

కుమార వినుము.

చ. నిను నీదుర్మతి పట్టి తెచ్చె నని నిర్నిద్రతీవ్రాశోకవే,
గనితాంతాకులులై పురంబున జనుల్ కాంతాసమూహంబుతోఁ,
దనువుల్ వాసిరి యగ్నిలోఁ బడియు శస్త్రచ్ఛిన్నులై గాంచియున్,
వినుమీ బాలురు వృద్ధులు న్వనరు చుర్వింబ్రద్ది రోలాకునన్.

ఇట్లనురక్తులైనప్రజల నూచముట్టం జంపుట న్యాయమా ! భవద్విషయ మగున మంగళవార్త వినంబడెనేని ధారానగరంబు సంగరంబుముగిసినపాలికలనికిం దుల్యంబు గాఁగలదు. మఱియును వినుము.

మ. నీవలె నుత్తమప్రియుఁడు నీయనుజన్ముఁడు నాజయంతుఁడున్,
భావమునందు నీచరణభక్తియుఁ బ్రేమముఁ గాంచియున్నవాఁ,
డీవిధి నీవధంబు వినెనేని శరీరము వాయ కుండునే,
తావక మైనయీవిరహదావహుతాశనదగ్ధదేహుఁడై.

అదియునుం గాక ముంజమహీపతియు లోభావిష్టహృదయుండై కాలవైపరీత్యంబున ని ట్లాజ్ఞాపించె నంతియకాని యాతండైన నీనిధనానంతరము భవద్విరహంబుచేఁ బ్రాణం బులు వాయువాఁడ. ఇందు సందియంబు లేదు.

మ. పుత్రునికంటెఁ బ్రేమమునఁ బోడిమిఁ బెంచి సహాసనాదులన్,
మిత్రునిమాడ్కిఁ జూచుచు నమేయము లైనభవద్గుణావళుల్,

స్తోత్రము సేయుచు న్సభలఁ జొక్కుచునుండెడువాఁడు ముంజుఁడుక్,
చిత్రమె నిన్నుఁ జంపి తనజీవము వాయుట దుఃఖసంతతిక్.

ఇయ్యెడరు కాలవైపరీత్యవశతం గలిగినది. ప్రమాదో ధీమతా మపి,, యని చెప్పం బడియుండలేదా ? జ్యోతిర్విదునివచనంబుల భేదంబుం జెంది నీపితృవ్యుం డీకట్టిఁడిపని కొడిగట్టెను గాని కడుద వ్వారసి చేసినవాఁడుగాఁడు. మఱి కొంతతడవునకు నిన్నుం దలంచుకొని పనరిపనరి వినాశంబుం జెందకపోఁడు. దీన ధారాధీశులవంశంబు వినష్టం బగు. ఇంతకంటె నెక్కేమున్నది ?

భోజకుమారుఁడు. ఇంచుక యాలోచించి. ఉపాధ్యాయునిం గాంచి,,

ఓబుధోత్తమా ! ఆర్యుండు రాష్ట్రపాలుండు సెప్పినవచనంబులు సత్యంబులు. పౌరప్రజానురంజనంబు కార్యంబుగా నడుచుకొనినసింధులక్ష్మావల్లభునిసుగుణగణాక్రీత మానసులై యుండుపౌరులును రాజకుమారులును తత్పుత్రుండ నని నాయం దునిచిన ప్రేమభరంబున నాయనంతరము వంగసైన్యంబులం దునుమాడి మత్పితృవ్యునిం జంపం దెంపుచేసి తమప్రాణంబులును వాయుదురు. ఈరాష్ట్రపాలుండును బుద్ధిసాగరప్రముఖులును ధారాసైనికులం బురికొల్పుకొని మోహరించిరేని వీరిం జయింప నేరికిం బరంబు గాదు. వీరలు మదీయజనకునియందుఁ గరము కృతజ్ఞత్వంబుతో వర్తించువారు. మఱియు జయంతుండు నన్నెడబాసి యుండలేఁడు. నాజీవితము పోయినయనంతరము వాఁడు దేహము ధరించుట యసంభావ్యము. ముంజుండును నన్ను నాజనకుండు తన యుత్సంగంబున నిడలుట యాదిగా నాతండ్రికంటెఁ గరము ప్రీతిమెయిం బ్రవర్తించెడిని. ఇతనికి నాయం దిట్టిభావంబు గలుగుట స్వాభావికంబు గాదు. ఆరోపితక్రూరభావంబు సారిదిని నివర్తింపఁగాఁ దొల్లింటివాత్సల్యంబు తలయెత్త నామరణంబుం దలంచుకొని ప్రాణపరిత్యాగంబునకుం గడంగక పోఁడు. కఠోరవిధివిలసితంబునలన నాయం దతిస్నేహార్ద్రం బై యుండుముంజునిహృదయం బిత్తెఱి యతికఠినభావంబుం జెంది యున్నది.

చ. జలధి స్థలంబుగా నగు నిజంబు ; స్థలంబు సముద్ర మౌను పో !
కులిశ మదౌను పుల్ ; పులును ఘోరపువజ్రతఁ గాంచు ; వహ్ని శీ,
తలతఁ జెలంగు ; మంచు దవదాహతఁ జెందు ; విధిచ్ఛచేత ని,
స్తులమహిమం డతం డతనిదుర్లలితాద్భుతశక్తి యెట్టిదో.

రాజాజ్ఞాతిక్రమణంబు సేయం గూడనిదియు. రాజాజ్ఞ ననువర్తించినం గులవిచ్ఛేదంబు గల్గు. ఇందుఁ గర్తవ్యాకర్తవ్యంబు దెలుంగక యుత్తలంపడునాహృదయంబునకు సమాధానం బొందు గల్పింపుము.

ఉపాధ్యాయుఁడు. కుమార ! ఇందు నేఁ జెప్పఁదగినది యట్లుండనిమ్ము. నిన్నుం జంపం దెంపుచేసినయీవత్సరాజు నడుగుదము. ఏమి సెప్పం గలండో చూతము.

అనివత్సరాజుంజూచి,,

వత్సరాజ ! నీకిందుఁగ ర్తవ్యంబని తోఁచినయర్థంబేమి ? నుడువుము.

వత్సరాజు. తలవాంచుకొనియూరకుండెను.

వత్సరాజానుజుండు. బ్రాహ్మణోత్తమా యింక వత్సరాజు చెప్పన దే మున్నది. ముంజునానతి సేయంగడంగి భోజకుమారునికి నది సేయుంజాలమి ముంజునికిని గానివాఁ డ నయితి నని చింతాక్రాంతుండై గుందుచున్నవాఁడు. భోజకుమారుని కేదియుఁ జెట్ట గలుగక యుండునట్టులును ముంజునియెదుట వత్సరాజు మోముఁ జూపం గలుగునట్టులు నిప్పుడు తగిన వెర వూహింపం జనును. కాలానుసారంబుగఁ దక్కినయవి సమకూరు.

రాష్ట్రపాలుఁడు. సంతసంబుతో,,

పసివాఁడైనను వత్సరాజానుజుండు పల్కినపలుకు సమయోచితం బయ్యె. యుక్తియుక్తం వచోగ్రాహ్యం బాలాదపి శుకాదపి,, అని సూవె నీతివచనంబు ప్రవర్తించిన యది. ఇం దుఱువైన వెఱ వూహింపంగలవాఁ డీయుపాధ్యాయుండ. బ్రాహ్మణులబుద్ధు లు యుక్తాయుక్తవిచారంబునందు బరమకౌశలంబుం గాంచియుండు.

ఉపాధ్యాయుఁడు. అర్య రాష్ట్రపాల ఏ బ్రాహ్మణుఁడ నైనంగదా యట్లనవలెను?

అందఱు నబ్బురంపడి చూచుచున్నారు.

భోజకుమారుండు. కానినాఁడు నీ వెవ్వఁడవు ?

ఉపాధ్యాయుఁడు. భోజకుమార ! ఈధారానగరంబున నీజనకుం డగుసింధులక్షు మావరునిమన్ననలు వడయుచుండినమాయామంథరుం డనుమాయావిని.

వత్సరాజు. భయోత్కంపంబులతో. వానింగాంచుచు. ఆత్మగతంబున,,

కట్టా! భక్ష్యాశచేతఁ బాముపెట్టెఁ గొఱికినమూషికంబునలెం జిక్కికొంటిఁగదా! ఈమాయామంథరుం డజేయుండు. బుద్ధిసాగరునికిం బ్రాణతుల్యుం డైనమిత్రుండు. వీని నెఱుంగక యతిక్రమణంబుఁ గావించినందుకు వీఁడు న న్నూరక విడువం బోఁడు. దైవ మా! ఏమి సేతు. వీనిచేతినుండి యెట్లు తప్పించుకొందు.

అనుకొనుచు వెలవెలఁబోవు మొగంబుతో నుండె,,

భోజకుమారుఁడు. మాయామంథర! నీ వుపాధ్యాయవేషంబుం బూని వచ్చుటకుం గతం బేమి?

మాయామంథరుఁడు. కుమార చెప్పెదను వినుము. అర్యుండు బుద్ధిసాగరుండు వత్సరాజును బిలువ ముంజుం డంగరక్షకునిం బంపుట యెఱింగి ప్రాతఃకాలంబున జ్యోతి

ష్కునివచనంబులకు వివర్ణత్వంబుం జెందినముంజునిముఖం బవలోకించి రాఁగలయర్థం బూహించి యుండువాఁ డుపాధ్యాయునిఁ గార్యాంతరవ్యాజంబునఁ దాఁ బిలిపించుకొని కుమారరక్షణార్థం బతనిచోటికి న న్నంపె.

భోజకుమారుఁడు. నవ్వుచు,,

మాయామంధర! బ్రాహ్మణజాతిసహజంబు లగుభీరుత్వాదులఁ బాగుగ నభినయించితివి. మఱియు నీతుచ్ఛం డొనరించినయధిక్షేపణాదులకు శక్తుండు గానివానిచందంబున నోర్చుకొంటివి. ఇది కర మబ్బురంబు.

మాయామంధరుఁడు. భోజకుమార! సింగపుంగొదమవంటియనన్యవిక్రమంబు గల నీవు వీనికి లోఁబడ వని యెఱింగి యీవత్సరా జెందనుకఁ దుష్టునో చూత మని యూరకుంటి నంతియకాని వీనిని క్రోల్పులిం గఱవఁబోయినశునకంబుగతిం బట్టింప కుండుదునె! ఇప్పుడు నాపరాక్రమం బెల్లవారును జూడవచ్చు. సకలదేశాధీశసభలలోనిమల్లురును మంత్రవిద్యాకుశలురును మాయావిచక్షణులును నాచే విజితులు. నాకుం గప్పంబు గట్టెదరు. ఈవత్సరా జనంగ నా కెంత. నక్కవలెఁ గపటంబునం గాని ప్రవర్తింపఁడు. ముంజునిసమీపం బెడబాయ కుండమింజేసి వీఁ డింతదనుక బ్రతికి యున్నాఁడు. కాని చో వీనినీచవర్తనలకు వీని నెన్నఁడో నలిపివేయకపోతినే! ఇప్పుడు నాయేలిక యగుసింధులేశ్వరునియందుం గృతజ్ఞభావంబుతో నేను ఈపాపవర్తనుండు నాయేలికపట్టియందుం జేయంగడంగినచెట్టకుం దగినట్టులు.

చ. మదమున మల్లయుద్ధమున మస్తకముం బగులంగ గొట్టి భీ,
ప్రదముగ ఱొమ్మగల్చి రుధిరంబులు ధారలుగట్టి కారఁగాఁ,
బదములు చేతులు న్విఱిచి పక్షములం బొడిచేసి డొక్కలో,
మెదలెడు ప్రేవు లీడ్చి వెస మేదిని రాచెదఁ గాల లీలమై.

పటపటఁబండ్లుగొఱుకుచు. వత్సరాజుంజూచి,,

ఓరీ! నాయేలినవానిపట్టితలఁ గొట్టి యీచెట్టులకుం గట్టెద నంటివే! దానికిఁ బదులుగ. నిన్ను.

చ. తల దెగఁగొట్టి హస్తమునఁ దాలిచి ప్రేవులప్రోవు లుద్ధతిన్,
బలితపుఁగంఠదామములభంగి ధరించి గళోరురక్తధా,
రల వెసఁ బీల్చుచు న్శవ మురంబున నే నిడికొంచు ముంజుముం,
గల నటనంబు చేసెదను గ్రక్కున సింధులపక్షు లుబ్బఁగన్.

అని మల్లచఱచుచు లేచెను,,

వత్సరాజు. భయసంభ్రమంబులతో భోజునిపాదంబులపయింబడి,,

మహారాజకుమార ! యీ బెబ్బులి తనయడుగున నణుముకొనిన మేకపిల్లం గావ నీవ శక్తుండవు. నీవార లెల్ల శరణాగతరక్షణతత్పరులు. నేను భృత్యుండను గాననివి నాయ పరాధంబులని యెంచక రక్షింపుము.

అని యేడుచుచున్నాఁడు.

భోజకుమారుఁడు. మాయామంగర యీదీనునియందుఁ బ్రతాపంబుఁ గాన్పింపఁ గడంగుట యుచితంబు గాదు. ఈసంరంభంబు మానుకొనుము.

రాష్ట్రపాలుండు. ఓరి నీవు మాయామంగరుండ వని యెఱింగినంతట నాహృద యంబు మహానందాంబుధిం దేలుచున్నది. నేను వచ్చి చేరునంతలోఁ గుమారుని కేవిధ మగునెగ్గుగాని సంభవింపకుండం గాచుట కీవెఱవు వన్నినబుద్ధిసాగరుండు బుద్ధిసాగరుం డ. వత్సరాజానుజుండు నుడివినయర్థంబునకుం దగినయుపాయం బాలోచింపుము. భోజ కుమారునిపల్కుల గారవం బునిచి వత్సరాజుం బీడింపకు.

మాయామంగరుఁడు. ఓరి వత్సరాజ ! తొల్లి సింధులునిచేత నిప్పు డతనిపట్టిచేత రక్షింపఁబడితివి. విడిచితిని. ఇఁక జాగ్రతతోఁ బ్రతుకుము.

వత్సరాజు. లేచుచున్నాఁడు.

మాయామంగరుఁడు. ఆర్యరాష్ట్రపాల! ఏను నామాయామహిమచేత నొకశిరంబుఁ గల్పించి యిచ్చెద. అది వత్సరాజు గొంపోయి భోజునిశిరం బని రాజునకుం జూపునది. ఇది మొదలు భోజకుమారుండు నిగూఢవర్తనంబున నుండం జనును. బుద్ధిసాగరుం డనం తరకర్తవ్యంబుఁ జరుపు.

రాష్ట్రపాల వత్సరాజ వత్సరాజానుజులు,
ఇదియ సరి యయినప్రస్తుతోచితము.

మాయామంగరుఁడు. అట్లైన భువనేశ్వరీదేవాలయసమీపమునకుం జని యిప్పుడు సేయంగడంగినకార్యంబు నిర్వర్తింతము.

వత్సరాజు. భోజకుమారుండు తనమరణసమయంబునం దండ్రికిఁ జెప్పిపంపిన ట్లొ కసందేశం బున్న మనము పన్నినయుక్తికిం దగియుండు.

మాయామంగరుఁడు. ఔ నది సరియే! అదియు నాదేవిదేవాలయమునొద్దన స మకూర్చుకొన నగు. అందఱు మఱ్ఱియొడకుఁ బోదము రండు.

అని యెల్లవారు నిష్క్రాంతులైరి.

ఇది భోజరాజచరితనాటకంబునందుఁ గుమార రక్షణం బను

తృ తీ యాం క ము. సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీమదాంధ్రభోజచరిత్రము.

అందు

## భోజరాజచరితనాటకము.



## చతుర్థాంకము.

కిరాతకుమారవేషధారియై భోజకుమారుండు ప్రవేశించుచున్నాఁడు.

భోజుఁడు. ఆర్యుండు బుద్ధిసాగరుండు ధారాధీశులకులంబునకు సేమంబు గాంక్షించువాఁడుగాన నతనిమాట యనతిక్రమణీయంబు. మాయామంథరుండు కృత్రిమశిరంబుఁ గల్పించి వత్సరాజుచేతి కిచ్చిపంపి యేకతంబున నన్నుం జీరి యోమహారాజకుమార నీమంత్రి బుద్ధిసాగరుండు నీకుం జెప్పుమన్నమాటలు వినుము. రాజకుమార! మాయామంథరుండు పన్నినమాయ యుద్ఘాటితము గాకుండ నీవు కిరాతవేషధారివై భువనేశ్వరీదేవాలయంబునకు వెనుక నుండుకట్టుదొనకుఅంగట సంచరించుచుండ నగును. ఎల్లి లేఁబ్రొద్దున నావచనంబుం గొని వచ్చెడుభటుండు సెప్పెడుప్రకారం మనుష్ఠింపం జనును. అని చెప్పి యామాయావి చనియె. ఇప్పుడు ప్రభాత మగుటం జేసి,,

చ. వెలవెలబోయెఁ దారకలు వేఁడ్కలు సెందెను జక్రవాకముల్,
దళదరవిందకోశతతిఁ దత్తఱి వెల్వడు తేంట్లఝుంక్రియల్,
గలయఁగఁ బర్వెఁ, దూర్పుదెస కాంతి నహించె నిశాధినాథుఁడున్,
జలనిధిఁ గ్రుంకె మందగతిఁ జల్లనితెమ్మెర వీఁచె ప్రొద్దయ్యెమై.
ఏను నతనివచనంబుల ననుసరించుచు నాకములసరస్సమీపమునకుం జనియెదను.

పరిక్రమించుచున్నాఁడు,,

నేపథ్యంబున,,

హాకుమారచంద్ర!

ఉ. జీవితనాథ! హాసుగుణజీవన! హాసుగుణైకమాన్య! హా,
భూవిదితోరుకీర్తి! జనపుంజవిలోచనభాగ్యవైభవా,

ద్భావితమూర్తి ! నీచరణతామరసంబుల కాస మీఱఁగా,
సేవ యొనర్చు భాగ్యమది చేకురదాయె నదృష్టహీనతన్.

భోజకుమారుఁడు. ఆలకించి,,

ఎవ్వతెయో యొకకామినీతిలకంబు తనకభిమతపతిసంప్రాప్తిలేమింజేసి గుందుచు న్నట్టులు దోఁచుచున్నది. మఱియు,,

క. నాదంబు వికలకురరీ। నాదంబదివోలెఁ దోఁచె నామానసమున్,
సాదరభావముఁ గాంచిన । దేదియొ కత మిట్టు లగుట కెఱుఁగంబడదే.

దీనజనులదుఃఖంబు విని యోర్వంజాలను గాన నట్లు తోఁచియుండు. ఇంకను విందము.

నేపథ్యంబున,,

చ. అభినవమన్మథుం డనుచు నందఱు సెప్పఁగ నాలకించి శ్రీ,
విభుసదృశాత్ముఁబ్రీతి గనువిందుగఁ గన్గొనఁ గోరుచుంటి నా,
యభిజనకాంతిరూపవిభవాతిశయంబులు పెంపు దక్క నా,
యభిమతుఁ బ్రాణనాథుఁ గవనైనను నోచకపోతి నక్కటా !

భోజకుమారుండు. కట్టా ! యిది యభిజనరూపవిభవాదులు గలిగినకన్య తనయభి మతపతిం గన్నులనైనం గానక పలవించుచున్నది. ఇది యేయుత్తమునింగుఱించి యిట్లు విలపించెడినో. ఇట్టియుత్తమురాలి నతం డేలఁ గావం గడంగండో ! క్రమంబున నర్థంబులు విశదంబులు గాఁగలవు !

అని వినుచున్నాఁడు. నేపథ్యంబున,,

ఉ. నాజనకుండు నాజనని నన్నని రాగముతోడ నొండొరుల్,
భోజకుమారుఁ డీముగుదఁ బోడిమిఁ బెండిలిచేసికొన్నచో,
రాజదుదారసర్వగుణరాజికి సత్ఫల మబ్బు నంచుఁ దా,
మోజ యొసంగఁ జెప్పుకొను చుందురు వార లిట్టు లుందురో.

భోజకుమారుండు. ఔరా ! ఎవ్వనిగుఱించియో యన నేల ? నన్నుంగుఱించియే పలవించుచున్నది. ఎవ్వతెయో నన్నుం గుఱించి యిట్లు పలవించుటకుం గతంబేమి యౌరా మత్ప్రాప్తిలేనినాఁ డీమదనతి యేమి యయ్యెడినో !

నేపథ్యంబున. హా! కుమారచంద్ర !

చ. ఖరమతి ముంజభూపతి యకాండసుదారుణవజ్రపాతని,
ష్ఠురగతి నీ కొనర్చె నని సోదు బగిల్చినయట్లు దెల్పఁగాఁ,
గరము కఠోర మీయసునికాయము కాయము వాసి పోక ని,
ర్భరపరితాపభారమునఁ బల్మఱు కుందుచునున్న దక్కటా.

కాన నీకట్టుదొనంబడి ప్రాణంబులకుం గలపరితాపంబుఁ బాపికొందును.

భోజకుమారుఁడు. కట్టా! యీముద్దులగుమ్మ నాపయిం గలప్రేమంబున నాకుం గలిగినదారుణదశావిపాకాపవాదంబునకు నొచ్చి విచ్చలవిడి విలపించి యీకొలనియందుఁ బడం బోయెడిని. ఏను వేషాంతరధారినై యుండుకతంబున దీనిం గావ ననువు గలిగి యున్నవాఁడ. త్వరితగతి సరస్సమీపమునకుం జనియెద.

అని పరిక్రమించుచున్నాఁడు,,

కట్టుదొనగట్టున నిలువంబడి నిమీలితాక్షియై యొకకన్య ప్రవేశించుచున్నది.

భోజకుమారుఁడు. సమీపమునకుంజని. కనుంగొని,,

బళిర! దీనిచక్కఁదనం బేమందును?

చ. చిలుకలకొల్కి యెవ్వతెయొ చిత్తసముద్భవుచిన్ని నెయ్యపుం,
గులుకుమిటారియో దివిజకోమలియో నవయౌవనేందిరా,
సులలితరేఖయో విధునిసుందరరమ్యనవావతారమో,
జలజశరోరుబాహుజయశౌర్యపికాసకళావిలాసమో.

మఱియు నీకన్యకకుం గలభద్రలక్షణానఘులు నిరూపింపఁగా,,

గీ. దీనిఁ జేపట్టు నెవ్వఁడు జానుమీఱ | వాఁడు వార్ధిపరీత మౌవసుధ కెల్ల,
భర్తయై పొల్చు మఱి వాఁడు బడయునట్టి | సౌఖ్యసంపద లేదని సరవిఁ దోఁచె.

కన్యక. హాదైవమా! నాప్రాణనాయకునికి సకలజననయననిర్మాణఫలాయమాన శరీరసౌభాగ్యసారునికి నశేషభూభృద్గణశిక్షణుం డగువానికి ధారానగరరాజ్యలక్ష్మీస్స్వయంగ్రహమంగళసముచితవయోవిశేషునికిఁ గఠోరదశాపరిపాకంబుఁ గల్పించితివి. నీకంటెం గఠోరుండును గలఁడె? ఇప్పుడు నాసేయునుద్యమంబునకు విఘాతం బొనర్పవేని నిన్ను దయాళుం డనవచ్చు. హాఅంబ! హాతాత! సుతావత్సల మీరలు నానాథునికిం గలిగిన గతికిఁ గరము పరితపించుచుంటిరి. ఇఁక మదీయమరణంబును విని యెట్లు నిల్వనోపుదురు. హా! ప్రాణనాథ! మదీయజీవితనిబంధన అభినవవికసితశతపత్రలక్ష్మీమనోహారం బగునీముద్దుమొగంబుం గనుంగొనుభాగ్యంబైనను లేకపోయె. ఇట్టియభాగ్యశరణ నగు నేను నీయందుం జేసినప్రేమంబున కుచితంబుగ నీమేను పరిత్యజించెదను.

అని నీట నుఱుకం బోవుచున్నది.

భోజకుమారుఁడు. సరభసగతి డగ్గఱి,,

ఓసుందరీ! నీయభిమతుండు నీకడన యుండ నీయతిసాహసంబునకుం గడంగం జనునె?

కన్యక. కన్నులు దెఱచి చూచి. హర్షంబుతో నలునలంకులు దిలకించి,,

ఔర! నాప్రాణనాథుండు నాచెంగటన యున్నాఁ డనుట యసంభావితంబు గాదె! అనవరతచింతావిశేషరణరణకవిభ్రాంతివలన మదీయహృదయంబున కిట్లు దోఁచెడిని.

మరల నిమీలితనేత్ర యగుచుఁ గొలన నురకం బోవుచున్నది.

భోజకుమారుఁడు.

క. మదవతి నీయభిమతునికి । ముద మొసఁగఁగఁ గడఁగుదేని మొనయుదువే యీ,
యదనున నీసాహసమున । కిదిగో నీకాంతుఁ డిప్పు డిట్యేడ నుండన్.

కన్యక. కన్నులు దెఱచి చూచి,,

ఈసుధావర్షంబు గురిసినజలధరం బెద్దియో?

విమర్శించి,,

రెండియు వినంబడినది గాన నిది భ్రాంతికల్పితం బనరాదు. బాష్పజలపరిప్లుతంబు లగుటంజేసి కన్నులకుం జెంతల నుండునవి గానంబడక యుండెడిని. కన్నులుదుడుచుకొని చూతము.

అని బాష్పపరిమార్జనముఁ గావించుకొని చూచి. సంతసంబుతో,,

ఈభద్రముఖుండు కుమారుం డెవ్వండొకో? వీనిం గాంచి నామానసం బానందరసప్రవాహపరిప్లుతం బగుచున్నయది. ఇందుకుం గతం బేమొకో?

ఉ. ఆంతర మైన హేతువు పదార్థములం దొక టుండు సక్తమై,
పంతుగ నారయ న్బహిరుపాధులఁ బ్రీతులు సెందుచుండ న,
త్యంతము పంకజాతము లహర్పతిఁ గాంచి వికాసమొందుఁ దా,
మెంతయుఁ జెమ్మగిల్లెడి మహి న్శిలజాలు హిమాంశుఁ జూడఁగాన్.

హా! ఈయన్యచింతనంబు మన కేల? శయనంబున నన్నుం గానక సంభ్రమించుచు నాసకియలు సెప్ప మదీయజనకప్రేషితచారసంచయంబు నా చను దెంచినజాడలు దెలిసికొని నన్నుం బోదివికొనునంతలో నీజలంబులం బడి నాప్రాణనాథునం గుంచిన నిష్కారణప్రేమంబు సఫలంబు గావించెదను.

అని వెండియు నిమీలితనేత్రయై జలంబుల నుఱుకం గడంగుచున్నది.

భోజకుమారుఁడు.

క. రమణీమణి నీనాయకు | నమరేంద్రసమానుఁ జూచి యాశాయుక్తిన్,
క్రమమును జఱుపక యీవిధి | దెమలెద విది యేల? మదికిఁ దెలియంబడదే?

కన్యక. కన్నులుదెఱచి. ఎదుటంగాంచి. భోజకుమారునితో,,

భద్రముఖ! పతివిరహంబున కోర్వఁజాలక ప్రాణంబులు వాయం గడంగినదాని నన్ను నీవె యిట్లూరార్పం గడంగితివో? కాదేని ముంజభూపతిదుర్ణయంబునఁ బరలోకగతుం డైననాప్రాణనాథుఁడు నాకడకుం జనుదెంచె ననుట యెక్కడిమాట. లోకంబునం బరోపకారప్రవణులు ఐడయరాని సుఖంబులు లేవు. కాన నాయభిమతంబునకు విఘ్నంబు సేయక పుణ్యంబు ఐడయుము.

భోజకుమారుఁడు. ఓకన్యకామణీ నీచెప్పినమాట యొప్పు. అం దొకించుక సంశయం బడిగెద. నివర్తింపంజేసెదవేని నీయభిమతార్థనిర్వాహంబునకు నేన సహాయుండ నగుదును.

కన్యక. భద్రముఖ! గ్రక్కున నడుగుము చెప్పెదను.

భోజకుమారుఁడు. ఓకన్యకావతంసమా! సింధులునిపట్టి కింకను పరిణయము జరిగినట్లు కానంబడదు. అట్లుండ నాతనినీవు ప్రాణనాథుం డని పల్కుట యెట్లు పన్నంబగు. తద్విరహంబునకు ఖిన్నవై నీవు జలంబులంబడి ప్రాణత్యాగంబుఁ జేసికొనుటకుం గడంగుట యారసిచూడ నీ వతనికిం బ్రాణసమానురాలగుపత్ని వనియుం దోఁచెడిని. ఈవిషయంబునందుఁ గడు సంశయాకులంబై యున్ననాహృదయంబునకుఁ బ్రసన్నతఁ గల్పింపుము.

కన్యక. భద్రముఖ! వినుము.

క. తొలుదొల్త నెవనిఁ గోరునొ | చెలుకలకొలుకులమనంబు చెలువుఁ డతండే,
యలివేణుల కగు; నన్యునిఁ | దలఁపం జన దనిరి నీతితత్త్వజ్ఞులిలన్.

అందును సతీతిలకంబు జననీజనకులయభిమతియుం గాంచి యుండుఁగాదే! అట్లే యాసింధులునిపట్టియందుఁ బ్రేమావేశంబుం గాంచి యున్నదానను. అతనిఁ గాక యన్యుని విననైన నొల్ల. కాన నా కతండు ప్రాణనాయకుం డగు. అట్టినానాథునికిం గలిగిన చెట్టకుం దాళఁజాలక యీపనికిం బూనుకొంటి. కనికరించియంతరాయంబు గావింపకుము

భోజకుమారుఁడు. కన్యకామణీ! నీచెప్పినయది సమంజసంబ. అభోజకుమారునికయినకఠోరదశకుఁ బ్రాణంబులు వాయం బూనుకొన్నధారానగరపుంగన్నెలలోనిధా

నవు గావు. పౌరులలో నాయొఱుంగనివారు లేరు. నీ పతినికిం దగినపట్టంపురాణివి గాఁగలదాన వని నీభద్రలక్షణావళులు దెల్పెడిని. ఇది సాకల్యంబుగఁజెప్పి సంశయంబుఁ బాపుము.

కన్యక. ఆత్మగతంబున,,

వీనికి వృత్తాంతంబుఁ దెల్పి శీఘ్రంబ యభిమతార్థంబు నెఱవేర్చుకొనియెదం గాక.

నేపథ్యంబునం గలకలానంతరంబు,,

ఓరి చారులారా! కడువేగంబునం జని కట్టెదొనకుఱంగట వెదకుఁడు. అందుల కేకతంబ చని యుండునేమొ? తత్సమీపననవాటికల నారయుఁడు.

త్వరితగతిం జారులును దాసికలును బ్రవేశించిరి.

దాసికలు. చూచి,, అదిగో మనరాచపట్టి యీకోనేటిగట్టున నున్నది. ఇది యియ్యెడ కేల వచ్చెనో! ఓభర్తృదారికా మాకడుపునఁ బాలుపోసితివి. నిన్నుం గానక దేవి మనోరమ కరము పలవించుచున్నది. నీతండ్రి విజయాదిత్యుండు కరము విహ్వలతం జెందుచున్నాఁడు. భోజకుమారునియెడరునకు కడునడలుచున్నవారు నిన్నును గానక పోయినఁ గాయంబులు ధరించుకొనం బోరు.

అని కన్యకలు దానిం బలసికొనుచున్నారు.

భోజకుమారుఁడు. ఆశ్చర్యంబునొందుచు. ఆత్మగతంబున,,

ఔరా! విజయాదిత్యునికూఁతురా యిది? బళిర యీకన్యకామణియందు నావిన్నలక్షణంబులెల్ల నమరియున్నవి. ఇది నాయం దనురక్త గావున లీలావతిగా నుండును. ఆకన్యకాతిలకంబ నాయం దనురాగంబు గలది యని విందు. తదీయజననీజనకులు నాయిందువదనను నా కీఁ గడంగి యుండిరట. విధి యనుకూలఫలప్రదానంబునకుం గడంగి యున్నదిగాన నన్నీచంద్రముఖికడకుం దోడ్తెచ్చె. దాన నీముగుద నీటంబడ నభ్యంతరం బయ్యె. ఇట్టియనురక్తయు రూపవతియు విద్యావతియు గుణవతియు నగుమదవతీమణిని గాచుకొనుమంగళంబు సేకూరెం గాన దీనిని వెంబడించి మఱియుం బెక్కులు శుభంబులు గల్గక పోవు. అది యట్లుండుఁగాత. ఈముద్దియుం దోడుకొని దీనిజననీజనకులిప్పు డియ్యెడకుం జనుదెంచుటకుం గారణం బేమొకో ఎఱుకపడదు. ఈదాసీజనంబును విచారించినం దెలిసికొననగు.

ప్రకాశముగ,,

ఓకామినులార! ఈకన్యకామణి విజయాత్యునికూఁతు రంటిరి. ఆరాజపుత్రి యియ్యెడ కేల రానయ్యె. ఈకన్నెతల్లిదండ్రులు నిడియు వసుమానసనగరంబునుండి యె

ప్పుడు వచ్చిరి? ఈచెల్వభోజకుమారునియం దనురక్తయయి యతని కడరు వాటిల్లెనని విని దుఃఖంబు సహింపంజాలక యీకోనేటం బడిప్రాణంబులు పాపికొనం బోవ మమ్మా రే ననుపుమెయి నుచితవచనంబుల నివర్తితంగావించినాఁడ. ఈదీనురాలిని గాంచి కరుణ గగ్గి యున్నాఁడను. గాన నడిగెద. కూడు నేని వినిపింపుఁడు.

దాసికలలోనొకతె. భద్రముఖ మాయేలికలపున్నియపుంబంటలు నీవై దారుణవ్యవసాయంబునకుం గడంగినయీభర్తృదారిక కడ్డంబ వైతివి. నీకంటె మాకుమహోపకారులు గలరె! నీకుం జెప్పంగూడని యర్థంబు మాకు లేదు. వినుము. సింధులుని మంత్రి బుద్ధిసాగరుం డంపినయశ్వారోహకుండు భటుం డొక్కరుండు గతదినమున సూర్యుండు చతుర్థప్రహరంబునం బ్రవేశింపఁ బలుగునాటి కడుఁబడలి రొజుచు నురుగులుదొరఁగుమోముతో నవిరళశ్రమజలధారార్ద్రం బగుకాయంబుతో నొప్పువారువంబు నెక్కి రాజునెదుటికి వచ్చి గుఱ్ఱంబుఁ దిగకయ నమస్కరించి యొకపత్రిక యందిచ్చి ధారానగరంబునకు సూర్యుండు గ్రుంకక మునుప నేఁ బోవలయు నని యశ్వంబును మరల్చుకొని చనియె. విజయాదిత్యుండును సంభ్రమించుచు నాలేఖ విప్పి చూడఁగా నందు ధారానగరంబునందుం గొన్ని యొడరులు వాటిల్లియున్నవి. ధారాధిపతులసేమంబుఁ గాంక్షించువారలు గాన మీర లాశ్వికబలపరివృతులై ధారానగరంబునకు రాఁ జనును. వెనువెంట నేతేరం గాంక్షించుకాంతలను సయితము తోడ్కొని రాఁ జనును. ఈపత్రికాపఠనావసానకాలంబ ప్రయాణకాలంబు గాఁ గలదు. అని వ్రాసియుండం గాంచి దేవికి మనోరమకు వృత్తాంత మంపి యీలీలావతితోఁ జనుదెంచినపట్టంపురాణిం దోడ్కొని యసంఖ్యేయాశ్వికసేనాపరివృతుండై సూర్యుం డస్తమించి యామంబు గడవఁగా ధారానగరంబున కేతెంచినవాఁడు.

భోజకుమారుఁడు. ఆత్మగతముగ,,

ఆర్యుండు బుద్ధిసాగరుండు ఆకస్మికముగ విజయాదిత్యుని రప్పింప గారణ మేమకో! వంగసైన్యంబులం జయింప ధారాసైన్యంబులె చాలుం గాన నందుల కని తలంపం జనదు. మఱియొకనిగూఢార్థంబు మనంబున నిడుకొని చేసియున్నవాఁడు.

ప్రకాశముగ,,

కాంతలార! అంతం జరిగినవృత్తాంతం బేమి?

దాసికలలోనొకతె. భద్రముఖ వినుము. మారాజు విజయాదిత్యుఁడు ధారానగరసమీపమునకుం జేరుటయు వత్సరాజు భోజకుమారు నలుముకొని యతనియందుం బాపాచరణంబునకుం గడంగియున్నాఁ డని విని విలయకాలదండధరునిరీతి మండిపడి వంగబలంబుల నుఱుమాడ నుద్యోగింప నంతలో బుద్ధిసాగరప్రేషితులు కొందఱు సనుదెంచి చెప్పిన

వచనంబుల నుద్యుక్తకార్యంబు మాని సింఘులునిపట్టికిం గలిగిన దారుణదశాపరిణామంబుం దలంచి తలంచి పనవి పనవి చేయునదిరియుఉంగక నగరబహిస్థలంబునన సైన్యంబులతో నున్న వాఁడు. ఏమును రాణియు నాయెడరున నున్నవార మగుటంజేసి యీకన్యకం దలంపక యుంటిమి. ఇది యంతకము వెదకుచుండి యది దొరకగానే యీదారుణవ్యవసాయంబు సేయ ననువుమెయి వెడలి పాటివచ్చినయది. ఇది మాభర్తృదారిక. భోజకుమారుని యందుఁ గడు ననురాగంబు వహించి యనారతము మానలన నతనిగుణగణంబులు వినుచుండు. నీవలన వెండియు మాభర్తృదారికం బడసితిమి. దీనిం గానక మారాజును రాణియుఁ గడు నడలుచున్నారు. కానం దోడ్కొని చనియెదము.

భోజకుమారుఁడు. కాంతలార యట్లచేయుఁడు.

దాసికలును భటులును కన్యకం గొని నిష్క్రమించుచున్నారు.

భోజకుమారుఁడు. ప్రియావిరహంబున దుర్మనాయమానం బైనమానసంబును కొంతతడ మీసరస్తీరజకుసుమలతానికరనిరీక్షణంబున నాశ్వాసింపం జేసెదను. ఈదక్షిణమున నుండువృక్షవాటికకుం జని బుద్ధిసాగరునివార్తాహారి యేతెంచుదనుక నందు వసించెదను.

అనిపరిక్రమించుచు,,

నే నంపినపద్యంబుం జూచియు నాశిరంబువంటిమాయాశిరంబుం గాంచియు నా పితృవ్యుండు తా నేస్థితి నున్నవాఁడో? రాజాంతఃపురంబున నేమి జరుగుచున్నదో!

అనుచు నిష్క్రాంతుండయ్యె.

ఇది భోజరాజచరితనాటకంబునందు లీలావతీకన్యకారక్షణం

బనుచతుర్థాంకము.

సంపూర్ణము.

---



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీమదాంధ్ర భోజచరిత్రము.

అందు

## భోజరాజచరితనాటకము.

## పంచమాంకము.



### మిశ్రవిష్కంభము.

విజయాదిత్యుండు పాదచారిగ్గాయి ప్రవేశించుచున్నాఁడు,,

విజయాదిత్యుఁడు. నిట్టూరుపు నిగుడ్చుచు,,

కుమారచంద్ర! విపరీతకాలపరిణామంబుచే నీపితృవ్యునివలన నెట్టిదారుణదశావిపాకంబు నొందితివిరా! నాకు నాకుమారునియందుం గలప్రేమభరంబుకన్నను మిక్కుటంపుఁబ్రేమభారంబుఁ గల్పించి విధి యీయప్రతివిధేయం బగుదుఃఖసంతాపంబున వేఁగం జేసినవాఁడు. హాకుమార! నీముఖారవిందంబు గాంచిననాఁడు మహానందాంబుధ నోలలాడినట్టు లుండునే! ఆనీగంభీరభాసంబునా నీవినయధౌరేయతయునా నీవృద్ధగురువిప్రభక్తియునా నీసకలవిద్యావైశారద్యంబు నానీసకలసుగుణగణశరణ్యతయుఁ దలంచుకొన్న హృదయంబు నీ ఱయ్యెడిని. నాక యిన్నిఁండ ననారతము సహాసనభోజనశయనంబుల నెడపడక నీతో వసించినవారల కెట్లుండవలె?

నేపథ్యంబున మహాఘోషంబు కల్గుచున్నది.

విజయాదిత్యుఁడు. విని. ఉలిక్కిపడి. కనులెత్తిచూచి,,

కట్టా! పెక్కండ్రు కాంతలు గుంపులై చేయునాక్రందనధ్వని వినంబడియెడిని. యిది యేమియో యెఱుంగం బడదు.

ఎదుటంజూచి,,

ఇదె యొక్కతె యెయ్యెడకో బరువిడుచున్నది. దీని నడిగినం దెలియు నని తోఁచెడిని.

ఆకాశంబులక్ష్యంబు చేసి,,

ఒని యీయార్త్రాక్రందనధ్వని యేమి ?

సరభసగమనంబున నొకకాంత ప్రవేశించుచున్నది.

కాంత.

చ. తనయునిఁ జంపఁగాఁ బనిచి దారుణవృత్తిని ముంజుఁ డాతఁడం,
పినయొకచీటిఁ జూచి కడుఁ బీడితుఁడై వ్యసనంబుచేత వ,
హ్నినిఁ జొరఁ బోవఁగా నృపునినీరజనేత్రలు శోకమగ్నలై,
పనవుచునున్నవార లలపట్టపురాణులయేడ్పు లీరొదల్,,

విజయాదిత్యుఁడు. నెవ్వోబపోయిన ట్లుండి,,

ఔరా! ఏను రాచనగరునకా వచ్చితిని! కుమారుని కయినదారుణదశం దలంచుకొనుచు దుఃఖపూరంబున మునింగి యొడ లెరుంగకయుండునన్నుఁ బరిచయబలంబునకు వశంవదంబులైననాపాదంబు లిచ్చ్యేడకుం దెచ్చినయవి. ఈకాంత పచించినయనంతర మిది యిచ్చోటని స్మరణంబునకు వచ్చినది. ఈముంజభూపతికిం దనపుత్రులకంటె భోజకుమారునియం దతిప్రీతితో వర్తించువాని కిట్టికఠోరబుద్ధి గలుగుట కాలవశంబునంగాదె! కట్టా కాలవశంవదుండై దారుణకర్మం బాచరించి స్వాభావికగుణంబుచేత సంతపించుచుఁ బ్రాణపరిత్యాగంబుఁ జేసికొనం గడంగి యున్నాఁడు. ఏరికిని విధివిహితం బలంఘ్యంబుగదా.

చ. సిరికిని కౌస్తుభంబునకుఁ జెల్వపువేలుపుమ్రానికిన్, సహో,
దరుఁడయి క్షీరవారిధికిఁ దా సుతుఁడై ప్రణయప్రసన్నతన్,
హరుఁడు తల న్ధరింప శశి కాయెనె క్షీణత వాయ ; దైవని
ష్ఠురగతి దాతిరేకనకిఁ జొప్పుఱఁజేయఁ దరంబె యేరికిన్,,

మఱియును,.

చ. వనమున కేగె దాశరథి బంధన మాబలి గాంచెఁ బాండవుల్,
ధనము గోలుపోయిరి పృథానిధనంబును వృష్ణు లొంది రిం,
కను దశకంధరుండు వధఁ గాంచె నలుండును రాజ్యవిప్లవం,
బెనసెను గాలవశ్యులయి యెల్లరు దూలెద రిట్టు లారయన్.

ఏను ముంజుం డొనరించినదారుణకర్మంబున కాగ్రహంబుం జెంది తదీయస్వభావం బెఱింగినవాఁడను గాన విధివిహితం బనివార్యం బని యడంచుకొని యుంటి. ఇప్పుడతండు తనయదుఃఖం బోర్వంజాలక యగ్నిం బడంబోవుట కెంతయుం జింతిల్లెదను. భోజకుమారుండు మహామనీషి, అతఁ డేమి వ్రాసెనో యెఱుంగవలయు. ఓకామినీ

వత్సరాజు భోజకుమారునిం దోడ్కొని మహామాయాభవనవిపినంబున కేగిన యనంతరము ప్రవృత్తం బగువృత్తాం తేమియో తెలుపుము.

కాంత. అయ్యా చెప్పెదను వినుము. భోజకుమారు నటుముకొని వత్సరాజు వెం డియుఁ గాదారిప్రొద్దునకు రాచనగరునకుఁ జనుదెంచి ముంజునిం గాంచి ప్రణమించి యోరాజా నీయానతిఁ గావించితిని. ఇదె నీ కుమారునిశిరంబు. కనుంగొనుము. అని గత్నకుండలయుగళంబును నిమీలితనేత్రంబును స్ఫురద్వక్త్రంబు నగుభోజకుమారుని మస్తకంబుం గానిపించె. అది చూచి ముంజుం డొక్కింతతడ వేఁడిచి వత్సరాజుం జూచి యోరీ ఖడ్గప్రహారసమయంబున నాకు నాకుమారుం డేదేని చెప్పుమనెనా ! యని యడి గిన నావత్సరాజు రాజా నీ కీపత్రంబున నేమో వ్రాసిపంపినవాఁడు. ఇదె గైకొని చూ చుకొనుము. కత్తితో శిరంబు నఱకం బోవునప్పుడు వాఁడు సమీపంబున నుండువట తరుపత్రంబులు రెండు గైకొని యొకటి దొన్నెగాఁ గుట్టి ఛురికాచ్ఛిన్నం బగుజంఘా రక్తంబున దాని నింపి మఱియొకపత్రంబున నేమియో వ్రాసి యిది నరపతి కిమ్మని యిచ్చెను. అని యొకపత్రంబు ముంజునిచేతి కొసంగిన నాతఁడును వత్సరాజ ఈశిరంబు నెయ్యెడ నేని భూమియందుం బూడిచివేయుము; అని చెప్పఁగా వత్సరాజు సనియె. అంత ముంజుండు తనభార్యచేత దీపంబు దగ్గఱకుం దెప్పించుకొని యాపత్రంబుం జదివెను.

మ. †లలి మాంధాతృమహీశుఁడు న్గృతయుగాలంకారుఁ డంతె న్మృతిన్,
జలధిం గట్టినదిట్ట రావణశిరస్సంహర్త యేడీ పెరల్,
బలవంతు ల్దివి కేగి రప్పుడ పృథాపత్యాదు లోపార్థివా,
యిల బోలే దలవారితో నిజముగానే బోవు నీతో నిఁకన్.
అని యాపత్రికయందు వ్రాసియుండె.
విజయాదిత్యుఁడు. ఆకాశము లక్ష్యము చేసికొని,,

హాకుమార! విద్వచ్ఛిరోరత్నమా ! నీకుంగల ప్రజ్ఞావిశేషంబు నీవు జీవించియుండిన నెంత సంతసంబుఁగల్పించునో నీవు పోయినందుచేలన నంత సంతాపంబుఁ గల్పించెడిని. పితృవ్యునికి బాగుగ బుద్ధిచెప్పితివి. ఇది చూచి ముంజుం డేఁక జీవించునే.

కాంతం జూచి,,

ఓసి అనంతరం బే మయ్యె?

---

శ్లో. †మాంధాతాచ మహీపతిః కృతయుగాలంకారభూతో గతః,
సేతు ర్యేన మహోదధౌ విరచితః క్వాసౌ దశాస్యాంతకః,
అన్యేచాపి. యుధిష్ఠిరప్రభృతయో యాతా దివం భూపతే,
నైకేనాపిసమం గతా వసుమతీ నూనం త్వయా యాస్యతి.

కాంత. అదిచూచి యర్థం బెఱింగి ముంజుండు హా! హా! పుత్ర జీవితమిత్రయని ఘోషించుచు మూర్ఛనొంది శయ్యాతలంబుననుండి భూమిం బడియె. అంత దేవి యాతనిం బట్టియెత్తి శయ్యపైఁ బెట్టి చేలాంచలంబున విసరుచు ననేకశిశిరోపచారంబులు సేయ మూర్ఛదేరి పుత్రునిం బలవించుచుం జేయునది లేక దేవింగాంచి యోదేవి నన్ను ముట్టకుము; నేను పుత్రవధం బొనరించినమహాపాతకిని; చండాలుండను; అని వాపోవుచు ద్వారపాలకులచేత విప్రులను రావించి వారికి వందనంబు సల్పి పుత్రవధంబు సల్పినతనకుం బ్రాయశ్చిత్తంబుఁ దెల్పుఁడని వేడుకొనఁగా వార లగ్నిప్రవేశంబు సేయుమని చెప్ప నట్లు సేయఁ గడంగి యెవరు వారించినను నివర్తింపక యుండుటంజేసి పుత్రశోకాతుర యయ్యు సావిత్రి సింధులరాజపత్ని యత్యుదారస్వభావ గావున తనమఱంది కనిష్టంబు గల్గుటకుఁ దాళంజాలక బుద్ధిసాగరునిచేతం గాక యితరులచేత నీకార్యంబు గా దతనిం బిలిపింపవలయు నని ముంజపత్నులకుం జెప్పి తదనుమతిని న న్నతనికడ కంపెను. ఏఁ బోవలయు. కరము గౌరవ్యుల రగుటంజేసి యించుక నిలిచి మీరడిగినదానికుత్తరం బొసంగితిని. రాణియాజ్ఞ జరుపఁ బోయెదను.

అనుచు నిష్క్రాంత యయ్యె.

విజయాదిత్యుఁడు. నే నిప్పుడు ముంజుం డగ్నిం జొరంబోవుచోటికిం జనియెద.

పరిక్రమించి. ఎదుటంజూచి,,

ఇదె పౌరులు పెక్కండ్రు బాలవృద్ధము గుంపులుగూడి రాచనగరునం జొరఁ బారుచున్నారు. ముంజునగ్నిప్రవేశంబుం జూడం గాఁబోలు?

మఱియొకవలనికి దృష్టులు నిగుడ్చి,,

కటకటా! యియ్యెడ,,

చ. ధరణీసురోత్తముల్ కుసుమదర్భఫలాదుల మంత్రయుక్తితోఁ,
బరిసరభూములందు విధిపద్ధతి నర్చన సల్పఁ బూతమై,
కరము సువాసనల్ గలయఁగందపుఁగట్టెలఁ బెల్లు రేయుచున్
దరికొనుచున్న దియ్యెడ నితాంతభయంకరకీలి కీలలన్,,

ముంజుని నిప్పులో నుఱుకకుండం జేయుట కుబుద్ధిసాగరుండు చాలినవాఁడు. అందులకై యేను ప్రయత్నింప నక్కఱలేదు. అంతఃపురజనం బెల్లఁ బతివినాశదుఃఖవివశంబై యుండుటంజేసి నాచనుదెంచుట యెఱుఁగం బోదు. కానఁ బౌరులలోఁ గలసియుండి జరుగువృత్తాంతంబుఁ గనుంగొనియెదను. నేను మన్నగరంబు నిర్గమించునప్పుడును ధారానగరంబునం జొచ్చునప్పుడును కడు శుభసూచకంబు లగుశకునంబు లయినవి. మానసంబు పౌరులవచనంబులు విని సంతసించుచున్నయది. విషాదం బంతస్సక్తంబు

గాలేదు. కాన నిందులకు శుభం బుదర్కంబై యుండనోపు నని యెంచెద. బుద్ధిసాగరు
నిబుద్ధినావ మహావిపత్సముద్రంబులం దరింపఁ జేయు నని యెల్లవారలుం గుదురు.

నేపథ్యంబునం గలకలంబు.

విజయాదిత్యుండు విని,,

పోని కగ్నిప్రవేశసమయంబు సమీపించె. ఈముంజుఁడును,

ఉ. తాన మెునర్చి భూసురవితానము దానముచేతఁ దన్పి తా,
సూనునిహత్యకుం గరము స్రుక్కుచుఁ గన్నుల బాష్పసంతతుల్,
మానవరీతితోఁ దొరఁగ మానిను లేడ్చుచు వెంబడించి రా,
దీనత మూర్తిఁ గొన్నవిధి దేవు హుతాశనుఁ దారసిల్లెడున్.

నే నీతనిదృష్టిపథంబుం బరిహరించి యెుండువలన నుండెదను.

అనుచు నిష్క్రాంతుండయ్యె.

మిశ్రవిష్కంభము.

ముగిసెను.

---

## పంచమాంకము.

అంత యథానిర్దిష్టుండు ముంజుండు ప్రవేశించుచున్నాఁడు.

ముంజుండు. వాపోవుచు,,

ఓరి నాముద్దులపట్టీ! భోజకుమార! హావినయవివేకధుర్య! నే నెంతపాపిష్ఠుండనురా!

ఉ. హాసుగుణైకమండన మహాశుభలక్షణ భద్రమూర్తి నే,
నీసున నిన్ను జంపి ప్రజ లెల్లను ఛీ! యనఁ జేసికొంటి పో,
భాసురబుద్ధి సింధులుఁడు పంచినమేరకుఁ బట్టభద్రునిం,
జేసి జనంబు సమ్మదముఁ జెందఁగఁ జూడక పోతి నక్కటా.

సావిత్రి. కన్నుల బాష్పంబులు దుడుచుకొనుచు. వెక్కివెక్కి యేడుచుచు,,

వత్స! ముంజ! నీవు నీకుమారులకంటె నీయన్నకుమారుని నధికసమాదరంబునం బెని
చితివి. వాఁడొనర్చినకర్మంబు వాని నట్లు గావింప నీవేమి సేతువు. ఇదినీదోసం బనరాదు.

ముంజుండు. ఆర్యా!

చ. అనుదిన మాత్మసూనులకు నందఱకన్నను నెయ్య మెుప్పఁ గాఁ,
బెనిచితిఁ బెద్దచేసితినిఁ బ్రేముడి యుంచితి విద్య నేర్పితిన్,
జనకుఁడు లేనివాఁ డ నుచు జాలిఁ గరంగుదు వానిఁ జూచుచోఁ,

మనమున నట్టివాని జనమండలి దూఱఁగఁ జంపఁ బంపితిన్.

సావిత్రి. వత్స! విధి తా నుద్దిష్టదారుణకర్మంబు నెఱవేర్పం గడంగెనేని వాత్సల్యవంతులంగొనిగ్గైనను తనకడంగినదాని ముగింపకపోదు. తొల్లి సకలలోక సౌఖ్యదాయకం బగుకుసుమంబుచేత నజునిసతి నిందుమతిని దైవంబు పిలుకుమార్పలేదా! ఈశోకపరీతంబై యుండునంతఃపురంబు వాపోవుచుండుటం గాంచుము. మించినకార్యంబునకు వగచుట గతజలసేతుబంధనంబు. ఈయనర్థాంతరావహకార్యంబువలన లగ్గగునే?

ముంజుండు. ఆర్యా! నీవంటిధర్మనిరతురాలును గలదా! నీకుమారునిం జంపించి నదారుణకర్మునిం గర్మచండాలుని నిర్లజ్జునిం బుత్రశోకం బడంచుకొని యూరార్పం గడంగితివే! మాయన్న సింధులని పేర్మికిం దగినక్షమాగుణంబు గలదానివిగదా నీవు. నీక్షమాగుణంబునకైనను మెచ్చి దేవతలు కుమారునిం బ్రతికింపకపోయిరి.

జనులం గాంచి,,

ఓపౌరులార! వింటిరా!

చ. వినయవివేకధుర్యు నతివిశ్రుతకీర్తిఁ గిశోరసుందరున్,
జనకవిహీను బౌరజనసమ్మతు సింధులతుల్యు నాత్మజున్,
మనునిభుఁ జంపఁ బంపుదురె మానితభూభరణక్షమున్ ధరా,
జను లిటువంటిపాప మతిసాహసవృత్తులునైనఁ జేతురే.

నేపథ్యంబున,,

ఓరాజ ముంజ గడచినయర్థంబుఁ దడవనేల! నీవేని బ్రతికియుండి యీజనంబులం గాచుచుండుము.

ముంజుఁడు. అడలుచు,,

ఓపౌరజనంబులార!

చ. తనయవధంబునం గలుగుదారుణదుఃఖదవాగ్నికీలలన్,
దనువును గాల్చుచుంట నుచితంబనరా దిఁక ముంజుఁడు న్మృతుం,
డనఁ జనువాఁడు గాన స్వకృతాఘమహాపరితాపసంతతుల్,
మనమును గాల్పకుండ దవమధ్యమునం బడి మేను వాసెదన్.

అంతఃపురజనంబు. హానాథ! ఈదారుణవ్యవసాయంబువలన నివర్తింపుము. పుత్రమరణశోకంబును సయితమడంచుకొని భవన్మరణంబునకుం గుందుచు నేడుచుచుండు సింధులపత్నివచనంబులనైనను గారవింపుము.

ముంజుఁడు. నిట్టూరుపులు నిగిడించుచు,,

ఉ. అంగజకోటిసుందరుని నాత్మజు సింధులరాజు దా మదు,
త్సంగతలంబున న్విడిచి స్వర్గముఁ జెందిన దాదిగాఁగ నే,
నుంగర మాసఁ బెంచితిని నూల్కొనకుండఁగఁ జేసె దైవము,
త్తుంగబలాతిదారుణతతో నను వంచితుఁజేసి గ్రక్కునన్.

ఆకుమారునిం బాసి యేను ప్రాణంబులు నిల్పుకోనం జాలను. గ్రక్కునన యీహుతాశనునికిం దను వాహుతిసేతు.

అని యగ్నికి సమీపించి. అంజలిబంధంబుఁ గావించుకొని,,

క. సుతవధఁ జేసినపాపిని । హుతవహ నిను శరణు చొచ్చుచున్నాఁడను భూ,
తతతి యెఱుఁగ నఘసం। తతిఁ బాపుము నన్ను వేగ దహియించి తగన్.

అని యుఱుకంబోవుచు. అకాసంబుఁ లక్ష్యంబుఁ గావించుకొని,,

హాకుమార !

మ. మనుమాంధాతృమహీపతుల్యుఁడవు సన్మాన్యుండ వీ వొయ్యనన్,
ఘనకీర్తుల్ గని నామహానికృతిచేఁ గాయంబు సాలించి శో,
భనలోకంబును బొంది తీవు కడు పాపం బేను గావించి పా,
వనలోకచ్యుతిఁ గాంచి దుర్గతికిఁ బోవ న్నాగితి న్మూర్ఖతన్.

అని నిప్పున నుఱుకం బోయె. ఎల్లవారు నేడ్చిరి,,

ససంభ్రమగతి బుద్ధిసాగరుండు ప్రవేశించి,,

ఓముంజభూపతీ! ఇట్లు గొల్లున నెల్లవారలు పలవింపఁ గరము కఠోరవ్యవసాయం బునకుం బూనితివేల ?

ముంజుఁడు. బుద్ధిసాగర ! నావంటికర్మచండాలుండును గలఁడా !

చ. పెడతలఁబట్టె బుద్ధియును పేరిమి యంతయుఁ గోలుపోతి పో,
కడు పసివాని నాత్మజుని కౌఁగిటఁ జేరిచి పెంచినట్టినా,
బుడుతని ముద్దులాని శుభబుద్ధిని నమ్మినవాని నక్కటా !
వెడగను జంపుకొంటి పలవించినఁ దీరునె వంత యెంతయున్.

కాన నాపాపంబు వోవ నగ్ని నుఱుకం గడంగితిని,,

బుద్ధిసాగరుఁడు. ముంజరాజ ! నీ వెట్లురాజాధముఁడవో వత్సరాజట్లమాత్యాధముఁడ. ఏకార్యంబుగాని దూరాలోచన సేయక యొనర్చినచో ననర్థావహం బని యెఱుంగరా ! పుత్రశోకంబువలన నీ వగ్నిం బడంబోతివి. నీపడినయగ్నిన పడి ప్రాణంబులు వాయ నెందఱు గడంగియుండెదరో ఆలోచించితివే ! లోకంబునం బ్రవృత్తం బగువృత్తంబు వినుము.

క. కతిపయదివసము లుండెడి । యతిమదకర మైనయట్టియౌవనమందుక్,
మతిహీనులు తమజన్మము । వితయగున శ్లాఘ్యచరింత్రు వివిధాపకృతుల్.

క. ఉపకారమొండె నవ్విధి । నపకారంబొండె హృదయమందు మఱచు నా,
యుపలమతి భూమిలోపల । నపగతతేజుండు బ్రతుకు ననుటయు ముధయే.

ముంజుడు. ఆర్య బుద్ధిసాగర! నీచెప్పినవచనంబులు వేదతుల్యంబులు. తాము మృత్యువుచే భక్షితు లగుచుండుట యెఱుంగక పరుల కపకృతి సేయంగడంగినవారు నావంటిమూర్ఖు లనుటకు సందియంబు లేదు. మఱియు సింధులుండు నాకు రాజ్యం బప్పగించె ననుకృతజ్ఞత లేక యతనిసుతుని కపకారం బొనర్చితిని. కాన నిట్టిపాపసమాచరణుండు జీవించుటయు నిష్ఫలంబు. నీవచనంబులచే బాగుగ బుద్ధి దెచ్చుకొంటిని. మనఃకల్మషంబు లుడిగె. ఇంక నగ్నిం బడియెద. అంతరాయంబు సేయకుము.

బుద్ధిసాగరుడు. ముంజభూపతీ రాజగువాడు తనకుం గలదుఃఖం బెంత యయ్యు నోర్చుకొని లోకులను దుఃఖంబు వొరయకుండఁ గాచుట యుఱవు. లోకారాధనంబ రాజులకు ముఖ్యకర్తవ్యంబు.

క. బీజాంకుర మతిసూక్ష్మం । బోజఁ బ్రయత్నమునఁ గావ నొప్పిద మయి తా,
నీజగతి ఫల మొసంగెడి । నోజను లోకంబుఁ గావ నొసఁగును ఫలముల్.

ఎ ట్లన్నను?

క. కనకంబులు రత్నంబులు । ఘనములు వివిధములు సకలధాన్యంబులు నిం,
కను గలయవి యెల్లను భూ । జనులవలన రాజునకును సమకూరు ధరన్.

కానఁ బ్రజారాధనంబునకుం గడంగియుండిననీకిం బ్రజామారణదారుణకర్మంబు తగదు. నీ వగ్నిం బడినఁ బౌరు లెల్లవారు ప్రాణంబులు వాయ నున్నారు,

ముంజుండు. బుద్ధిసాగర! నీ చెప్పినవచనంబులు తగినవియె. కుమారునివిరహంబు సహింపనోప. నే నెట్లు సేయుదు.

బుద్ధిసాగరుడు. ముంజభూపతీ! సహసా విదధీత న క్రియాం,, అని చెప్పియుండుటంబట్టి యారసి కార్యంబు సేయ వచ్చు. సభాభవనంబు సేరి విచారింతము. భోజకుమారుం డేఁబదియైదువర్షములు భూమి నేలఁగలం డని వేదవిదుఁడు సెప్పినవచనంబు కల్ల యగునే! అతండు సర్వజ్ఞుండు. సర్వజ్ఞుని తో సమానుండు. కాన నాకుం బ్రత్యాశ వదలక యున్నది. విధివిలసితం బచింత్యంబు. ఇప్పటి కిట్టిఖేదంబు సమకూర్చినవిధి మోదంబును గలిగింపకున్నె!

ముంజుడు. ఆర్య బుద్ధిసాగర! మంత్రజ్ఞులవచనంబులు మేలు సమకూర్పకపోవు. కాన నీచెప్పినచొప్పునం బ్రవర్తించెదను.

బుద్ధిసాగరుఁడు. ఎవఁ డక్కడ ద్వారపాలకుఁడు?

ద్వారపాలకుఁడు. ప్రవేశించి,,

ఆర్య బుద్ధిసాగర! ఏమి ముపల?

బుద్ధిసాగరుఁడు. ఓరి ముంజభూపతికి సభాభవనమార్గంబుం జూపుము.

ద్వారపాలకుఁడు. ముంజభూపతీ యిటు రమ్ము.

ముంజుండు. సమస్తజనంబుతో సభాభవనంబునకుం బ్రవేశించుచున్నాఁడు.

బుద్ధిసాగరుఁడు. ప్రతిహారీ! నీవు రాజద్వారంబున వింతమానిసి యొన్వఁడేనిఁ జను దెంచినం బిలుచుకొని రమ్ము పొమ్ము.

ద్వారపాలకుఁడు. ఆర్య బుద్ధిసాగర! భవదాజ్ఞ ననుష్ఠించెదను.

అని నిష్క్రాంతుఁడై యొక కాపాలికునితోఁ బ్రవేశించి,,

ఓమహాత్మా! కాపాలిక! అదిగో రాజును బుద్ధిసాగరుం డార్యుండు నున్నారు

అని చెప్పి నిష్క్రాంతుం డయ్యె,

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ!

సీ. తరుణదంతావళదంతదండము హస్తతలమునఁ బట్టి యుద్దండదీప్తి,
లాలితవిద్రుమలతలతోఁ దులఁదూఁగుజడలు శిరంబునఁ గడలుకొనఁగఁ,
గర్పూరమృగమదకలిత మాభసితంబు నఖిలాంగకంబుల నలఁదికొనుచు,
స్ఫటికకుండలయుగ్మచారుశోభావ్యాప్తి దనరెడిచెక్కుటద్దములతోడ,

గీ. మహితకాశేయకౌపీన మాత్రధారి। యగుచుఁ గాపాలికుండు వీఁ డరుగుదెంచె,
నీతనికిఁ గల్గుసామర్థ్య మే మొయెఱుఁగ।మనకుఁ జను నంచుఁ దలఁచెదమనమునందు.

ముంజుఁడు. బుద్ధిసాగర! యిట్టివారలయందు శక్తివిశేషంబు లుండుఁగాన నడుగుము.

బుద్ధిసాగరుఁడు. మహాత్మా కాపాలిక నిన్నుం గాంచినచో సాక్షాత్కరించిన చంద్రచూడుండని తోఁచెడిని.

కాపాలికుండు. ఆత్మగతంబున,,

నేను చంద్రచూడుం డనువాఁడనే! ఎఱింగియేకద బుద్ధిసాగరుం డడిగెడిని.

ప్రకాశముగ,,

అయిననేమి?

బుద్ధిసాగరుఁడు. మీరలు వసించెడినెల వెది? ఎక్కడినుండి వచ్చెదరు. మీకు దేహయాత్ర యెట్లుజరుగుచుండు?

కాపాలికుఁడు. ఆత్మగతమున,,

ఈయూరన యుండువాఁడను. విద్యావిశేషంబుల నిద్యోడన జీవింతు. ఇది తెలిసి రప్పించినని వెఱుఁగవే!

ప్రకాశముగ,,

వినుఁడు వచించెదను.

క. ప్రతిదేశంబున భవనము। ప్రతిభవనమునందు నిడఁగఁబడు భిక్షాన్నం,
బతులజలమ్ములు సరసీ। తతులను దత్త్వార్థ మెఱుఁగుధన్యులకు శివా.

మఱియును,,

గీ. ఊరనూరఁ గుటీరంబు లుత్తమములు। గలవు ప్రతినిర్ఝరంబుల జలము లెపుడు,
సులభ మన్నంబు బిచ్చంబునలన మాకుఁ। దలఁప విభవంబు లేలనిష్ఫలము లవియు.

బుద్ధిసాగరుఁడు. మహాత్మా నీచెప్పినవచనంబు లుపపన్నంబులు. ఇట్టిమీవంటి మహానీయులయందుఁ జమత్కారావహంబు లగుకళావిశేషంబు లుండునుసూవె. అట్టిది యోగవిశేషంబుగాని విద్యావిశేషంబుగాని కలదేని కరుణించి తెల్పుఁడు.

కాపాలికుఁడు. ఆత్మగతంబున,,

నాకడ నుండువిశేషంబులు నీ వెఱుంగనివే! నీపంపుననే వచ్చినవాఁడ నైతి.

ప్రకాశముగ,,

చెప్పెదను వినుము.

సీ. మా కొక్కదేశంబు మనికిప ట్టన రాదుసకలస్థలంబుల సంచరింతు,
మాత్మగురూపదేశాదుల నుందుము కరతలామలకంబుగతిని భువన,
తలమును గాంతుము దారుణశస్త్రాస్త్రఖండితమూర్ధునిఁ గాలసర్ప,
విషభరపీడితు వివిధరోగసమూహబాధితు శిథిలునిఁ బాపకర్ము,

గీ. నధికతప్రాణు విగహీను నపగతోరు। రోగవేగునిఁ జేయునిరూఢి నాకుఁ,
గలదు శివునిప్రసాదంబు గలదు నాకు। గురుపదాంబుజభక్తిచేఁ గోర్కి గలుగు.

ముంజుఁడు. సత్వరముగఁ జనుదెంచి కాపాలికునిపాదంబులపయిం బడి యేడుచుచున్నాఁడు,,

కాపాలికుఁడు. రాజా లెమ్ము. ఏమువకుము. నీయిష్టం బేదేనిఁ గలిగినఁ దానిని చంద్రచూడునన్నుగ్రహంబున సమకూర్చెదను. వచింపుము.

ముంజుఁడు. బాష్పగద్గదంబుతో,,

ఓయోగీంద్ర! నేను మహాపాపిని. పుత్రునిం జంపించితిని. నాయందుం గనికరించి నాపుత్రునిం బునర్జీవితునిం గావింపుము. మీవంటిసాధువులు పరోపకారప్రవణులు

గదా! నీవు రుద్రకల్పుండ వని తోఁచెడిని. నాపుత్రునిం జీవితునిం జేసి నాకులం బుద్ధరింపుము.

కాపాలికుఁడు. రాజా భయంపడకుము. నీకుమారుండు జీవించియున్నాఁ డని యనుకొనుము. అతండు శివునియనుగ్రహంబున నిప్పుడ నీయింటికి రాఁబోయెడిని ఎవ్వఁడాతనితలఁ ద్రుంచెనో వానిచేతి కిచ్చి హోమద్రవ్యంబులు గొన్ని మహామాయాభవనంబునకుం గుమారుని జంపినచోటికిం బంపుము.

ముంజుఁడు. ప్రతీహారీ! వత్సరాజుకడకుం జని యీమహాత్మునితో నితఁడు సెప్పినద్రవ్యంబు లెత్తించుకొని పొమ్మని నాయానతిం జెప్పుము.

కాపాలికుఁడు. రాజా యేఁ బోయెదను. కుమారుం డిదె వచ్చుచున్నాఁడని యనుకొనుము.

అని నిష్క్రాంతుం డయ్యె,,

ముంజుండు. ఆర్య బుద్ధిసాగర కాపాలికుండు తాఁజెప్పినవచనం బీడేర్పంగలండె?

బుద్ధిసాగరుఁడు. రాజా ఇట్టిమహానీయులు తమకడ లేనిసామర్థ్యంబులు భూపాలురసభలందుం జెప్పికొనరు. చూడు మితఁడు మనవలన ధనాదికం బపేక్షించెనా? బలిమాలి యిచ్చినం గైకొనఁడు. అట్టివాఁ డసత్యం బేల వల్కు?

ముంజుఁడు. గద్గదకంఠంబుతో,,

బుద్ధిసాగర,,

క. వికచశతపత్రలక్ష్మీ। ప్రకటిత మగుతనయుమొగము భద్రముగా నా,
సకలేందుబింబరుచితో। నికటంబునఁ దోఁచి నాకు నెఱపునె ముదముల్.

బుద్ధిసాగరుఁడు. ముంజమహీపతీ! ఇట్టిమహావిపదంబుఁ గలిగించినవిధి వెంబడిన మహాముదం బొక్కటిఁ గలిగింపక పోదు. నీయభీష్టంబు లీడేరు.

ముంజుండు. కుతుకంబుతో,,

బుద్ధిసాగర!

చ. చలదలినీలకుంతలము చారునవాంబుజరమ్యలక్ష్మికి,
న్నిలయము మందహాసరుచినిర్ఝరసౌభగభావితేందిరా,
కలితము ముద్దుపట్టిముఖకంజము నాహృదయప్రమోద మ
న్జలనిధి వెల్లిగొల్పఁగ నిశాకరబింబముగాఁ జెలంగునే.

పురుషుండు. త్వరితగమనంబుతోఁ బ్రవేశించుచున్నాఁడు,,

పురుషుఁడు. మహారాజ వర్ధిల్లెదవు. పుత్రుండు పునర్జీవితుం డయ్యె.

ముంజుండు. హర్షంబుతోఁ గన్నుల నానందబాష్పంబులు గురియుచు,,

భద్రముఖ! భోజకుమారుండు జీవించెనా! ఈమాట సెప్పి యమృతవర్షంబుఁ గురిపించితివి,,

పురుషుఁడు. రాజా యోగీంద్రుననుగ్రహంబునం బ్రబికె. ఆతనిమహామాయా భవనంబుకడనుంచుకొని వత్సరాజప్రముఖులు పట్టణంబునకుందగువైభవంబుతోఁ దోడ్తెర నీముదలకుం బ్రతీక్షించెదరు.

ముంజుఁడు. ఓరీ యీయమృతవచనంబుసెప్పినందులకుఁ గోశాధికారులకు నాముదల సెప్పిలక్షధనంబుఁ గైకొనుము.

బుద్ధిసాగరునితో,,

అమాత్యోత్తమా బుద్ధిసాగర! నీవు నన్ను గ్నిప్రవేశంబువలనఁ దప్పింపక పోతివేని యీమహాకల్యాణంబుం గాంచనుగదా? నన్నును నాకొమారునిఁ బ్రతికించి ధారాధీశులకులం బుద్ధరించినవాఁడవు. నీవంటికృతజ్ఞుం డగునరుండు గలఁడే! ఇఁకం గుమారునికిఁ బట్టాభిషేకమహోత్సవంబు నొనరింప సముచితసర్వకార్యనిర్వహణంబునకు నీవ తగినవాఁడవు. వత్సరాజాదు లన నేల? భవదాజ్ఞావశవర్తినై నేన ప్రవర్తించెదను. అభిషేకోచితకార్యంబుల కానతి యొసంగుము.

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ నీయాజ్ఞ ననుష్ఠించెదను.

పురుషునిం గాంచి,,

ఓరి! రాజకులంబునం గలనియోగిజనంబులకెల్ల భోజకుమారునిపట్టాభిషేకమహోత్సవంబుఁ దెల్పి వారివారినియోగంబులందు జాగరూకతతోఁ బ్రవర్తింప ముంజభూపతియాజ్ఞను బ్రకటించునది. విజయకుంజరం బనుపట్టపేనుంగును గైచేసి దాని మున్నిడుకొని ధారానగరసేనానాయకులు ఆశ్వికహాస్తికరథికపదాతిబలంబులతో నరిగి భోజకుమారుని వరార్హాభరణాదిపట్టాభిషేకోత్సవోచితవేషాలంకృతునిం గావించి విజయకుంజరంబువయిం గూరుచుండం బెట్టుకొని తూర్యవాద్యంబులతో గణికాజనప్రవర్తితనర్తనంబులతో భూసురాశీర్వాదంబులతో వందిమాగధబృందంబులవర్ణనంబులతోఁ దోడ్తేరం జనును. తత్తత్కార్యాధికారులు పట్టణంబున నెల్లయెడల శోభనాలంకారంబులు గావించి కుసుమపల్లవతోరణంబులు గట్టించి రాజరథ్యలం జందనోదకంబులు సల్లించి కుసుమోపహారంబు లిడి మంగళాలంకారంబులు సల్పియుండఁ జనును. జ్యౌతిషికు లుత్తమముహూర్తంబు నిర్ణయింప వలయు. ఈచెప్పినపనులు వారివారికిఁ దెల్పివైళంబ నెఱవేర్పవలయు.

పురుషుండు. ఆర్య బుద్ధిసాగర! భవన్నియోగం బనుష్ఠింపం జనియెద.

నిష్క్రాంతుండయ్యె.

బుద్ధిసాగరుఁడు. ద్వారంబున నుండువాఁ డెవ్వండు?

దౌవారికుఁడు ప్రవేశించి,

ఆర్య బుద్ధిసాగర ! యేమిముదల !

బుద్ధిసాగరుఁడు. దౌవారిక ! అంతఃపురంబునకుం జని తదధికృతులతో నంతః పురజనంబు మంగళాలంకారాలంకృతంబై యుండను రాజాజ్ఞ యని చెప్పుము.

దౌవారికుఁడు. ఆర్య బుద్ధిసాగర ! అట్లయెు

అని నిష్క్రాంతుం డయ్యె.

నేపథ్యంబునందుఁ దూర్యధ్వనులు వినంబడుడు,,

ముంజుండు. బుద్ధిసాగర తూర్యధ్వానంబులు వినంబడియెడిని. కుమారుండు రాజ రథ్యకు వచ్చె నని యెంచెదను.

బుద్ధిసాగరుఁడు. ముంజమహీపతీ ! అత్యున్నతం బగునీమహాసౌధంబు నెక్కి కుమారాగమనమహోత్సవ వైభవంబుం గనుఁగొందము. మనమును కుమారుండును వచ్చునంతలో సభాభవనంబును బహువిధాలంకారాలంకృతము గావింతురుగాత,

ముంజుండు. బుద్ధిసాగర ! అట్లయెు.

అందఱును సౌధారోహణ మభినయించిరి.

బుద్ధిసాగరుఁడు. ముంజమహీపతీ నీకులంబు నేఁడుగదా వన్నెకెక్కినయది. ఇట్టి సుగుణాకరుండు కుమారుండు జనించుటకంటెఁ గులంబునకు వే అొండు వన్నె గలదా?

ఉ. ఉన్నతసౌధవీధికల నుండి పురేందుముఖీలలామముల్,
సన్నుతరీతి లాజలను చందనపంకము మంగళాక్షతల్,
మున్నగువానిఁ జల్లఁగఁ జయావితతుల్ నలువంకల న్మహో,
ద్యున్నతిఁ గొల్వ నీకొమరుఁ డొయ్యన వచ్చెడు వేడ్కఁ జూడుమా.

ఎల్లవారును సూచుచున్నారు.

ముంజుండు. కనుంగొని యానందబాష్పంబులతో,,

ఉ. మన్మథకోటిసుందరుని మాన్యుని నాతనుజన్ము భోజునిన్,
సన్మతి వైభవాన్వితుని జాతముదంబునఁ జూచినాఁడ నా,
జన్మము సార్థకంబుగను జవ్వని నుత్తమవంశజాత సం,
పన్మహిత న్గుణాఢ్య వెసఁ బత్నిగఁ జేయుఁదలంతుఁ నిప్పుడున్.

భోజకుమారునికి నుత్తమకుత్తకాశినీతిలకకరగ్రహణంబును చతురుదధిపరీత ధరామండల రాజ్య లక్ష్మీపాణిగ్రహణంబును వెనువెంటన చేయం గోరుచున్నాఁడను.

క. నవమన్మథుఁడనఁ దగునీ | యవనీపతిమాళిసుతుని కనురూపగుణో,
ద్భవ యయి రతివలె నొప్పెడి | ధవళాయతనయన వెతకఁ దరమే యిపుడున్.

బుద్ధిసాగరుఁడు. ముంజమహీపతీ భోజకుమారుని కనురూపరూపవిభవగుణగణోపేత నెక్కడ నేని వెదకవలయునే! ఈయర్థంబు మనము పలుమా ఱారసియున్నయది గాదె!

క. విజయాదిత్యునికూఁతురు । రజనీకరబింబవదన రతి యనఁ దగు నా,
గజయానయ యితనికి సరి । నిజముగఁ జెప్పెదను గూర్పు నీరజనేత్రిన్.

ముంజుండు మోదాతిశయంబుతో,

బుద్ధిసాగర! నాసహోదరికిమనోరమకుముద్దులపట్టి లీలావతీకన్యక భోజకుమారుని కిం దగినదియ. విజయాదిత్యుండు నాకుం బోరానిచుట్టము. ధారాధీశులకులంబునకును వసుమానసాధిపతులకులంబునకు సంబంధంబు పూర్వానుగతము. అన్యోన్యసదృశంబు. పౌరజానపదసమ్మతము. అట్లయ్యు నాసహోదరీభర్తకు వృత్తాంతంబుం దెలిపి వారలఁ గన్యకతో రప్పింప నాలస్యం బగునే యనిసంతపించెదను. ఇందు కేమి వెరవో వచింపుము.

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ! ఇందులకు సంతపింపవలసినది లేదు. నీభావుకుండు విజయాదిత్యుండు ధారానగరవార్త విని చనుదెంచి యున్నాఁడు. నీ వగ్నిసన్నిధానంబున నుండునప్పుడు వగచుచుం జేయునది లేక పౌరసంఘంబునదీనుండైయుండెడిని.

ముంజుఁడు. మహాముదంబుతో. సంభ్రమించుచు,,

బుద్ధిసాగర! నాభావుకుండు వచ్చియున్నాఁడా! సౌభాగ్యవతుల మనోరమాలీలావతులం తోడ్తెచ్చినాఁడా!

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ! వారలతోడన వచ్చియున్నాఁడు.

ముంజుఁడు. కన్నుల నానందబాష్పంబులతో,,

మంత్రివర్య! ఏమి యీసంతోషపరంపరలు? బుద్ధిసాగర! వైళంబ నీవు నాభావుకునికడకుం జని నేను త న్నెదుర్కొని గారవింపనిశ్చయించితి మానసంబున నుంచుకొనకుండం బ్రార్థించి పరిణయాలంకారంబుతో మనోరమాపురస్కృతను లీలావతీకన్యను దోడ్కొని నే నీసౌధంబు దిగి పట్టాభిషేకభవనంబునకుం జనుదెంచునంతలో నయ్యెడకుం జనుదెంచి యుండునట్టులు ప్రార్థించి యట్లు గావింపం బూన్చి వైళంబ రమ్మా.

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ యట్లయ యని నిష్క్రాంతుం డయ్యె.

ముంజుఁడు. తన పట్టమహిషిం గాంచి,,

ఓదేవి యీబుద్ధిసాగరుని బుద్ధిచాతుర్యం బేమనవచ్చు! రాఁగలయర్థంబుల దూరాలోచన చే నెఱింగి తొలుత న తదనుగుణకార్యనిర్వహణంబుం జేసి తన్నుం జేరిచిన వారికిం గడుసుఖంబు సంపాదించుచుండు. ఇతనిబుద్ధిచతురతకు మెచ్చియేకదామాయన్న సింధులేశ్వరుండు భూపాలనభారంబు నితనియం దుంచినవాఁడు,

ముంజునిదేవి. ప్రాణనాథ! ఇట్టిదేవగురుసమాను నొప్పరికించుటంజేసి కాదె మన కుఁ గఠోరదశ సంభవించినది.

ముంజుండు. దేవి నీవచనంబులు సత్యంబులు. నే నొప్పరికించిన నితఁడు మన యందుఁ బ్రేమభరంబుంచినవాఁడు గాన మనల ననువర్తించుకొనియుండె.

బుద్ధిసాగరుండు ప్రవేశించుచున్నాఁడు,,

ముంజమహీపతీ నీచెప్పినచొప్పు జరిపితిని. కుమారుండును నగరియేనుఁగు మొగసాల కుం జేర వచ్చెడిని. వధువును స్వయంవరమంగళోచితవేషంబుతో నయ్యెడకుం జను దెంచియుండు.

ముంజుండు. అట్లైన నయ్యెడకు మన మందఱ మరుగుదము.

ఎల్లవారును బరిక్రమించుచున్నారు.

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ!

చ. సితసుమదామకంబుఁ గుడిచేత ధరించి వివాహయోగ్యస,
న్నుతరమణీయవేష యయి నూల్కొనుభూషణరశ్మిజాల మా,
తతగతిఁ బర్వ దేహము దాల్చినరాజ్యరమావిధంబునన్,
సుతనువు వొల్చుచున్నయది చూడుము కోడలి మోద మారఁగాన్.

ముంజుండు. కనుఁగొని,,

ఆర్య బుద్ధిసాగర! దేహముఁ దాల్చినరాజ్యలక్ష్మివలె నున్నదనియంటివే! అది సరి యయినమాట. ఈకన్యకారత్నంబును బరిణయంబైనవాఁడు జలధిమేఖలామండితభూ మండలరాజ్యలక్ష్మికి స్వయంవరపతి యగుటకు సందియంబును గలదే. ఇప్పుడు నాకో డలిస్వయంవరోచిత స్థితివిశేషం బతులానందదాయకం బయ్యెడిని.

ఉ. భూసురకామినుల్ సకలభూషణభూషితగాత్రలై కరం,
బాసఁ బురస్కరించుకొని యంగన మంగళగానపద్ధతిన్,
భాసురరీతిఁ బాడెదరు బంధురమంగళవస్తుహస్తలై,
శ్రీసతి వచ్చరల్ గొలుచుచెల్వునఁ గొల్చెద రాస దాసికల్.

అంత యథానిర్దిష్టవేషయై లీలావతికన్య ప్రవేశించుచున్నది.

బ్రాహ్మణకాంతలు. రాజపుత్రి నీకు మేనమామయు శ్వశురుండు నగుముంజభూ పతి నీయాగమనమునకుం బ్రతీక్షించుచున్నాఁడు. అతనికి వందనంబు సేయుము,

లీలావతీకన్య. ముంజునికి నమస్కరించుచున్నది.

ముంజుండు, సంతోషంబుతో,,

వత్సా! లీలావతీ!

చ. అలఘుగుణాఢ్యు భోజుఁ గుసుమాస్త్రసమానునిఁ జెట్టపట్టి యీ,
జలధిపరీత మాధరకుఁ జయ్యన నీవు సపత్నివై మహా,
బలులఁ గుమారులం గని కృపాకలితాత్మత బంధువర్గముం,
మెలఁకువఁ గాచుచుం బతికి మే లొనరించుచు సౌఖ్య మందుమీ.

బ్రాహ్మణకాంతలు. రాజపుత్రి నీశ్వశ్రు వగుసావిత్రీదేవిపదంబులకుం బ్రణామంబు సేయుము.

లీలావతికన్య. సావిత్రీదేవిపదంబుల కెరఁగె.

సావిత్రీదేవి. లీలావతి నెత్తి కౌఁగిటం బొదివికొని,,

ముద్దులకోడాలా! ఇఁక నీవలన నీధారాధీశులవంశంబు వన్నెకెక్కఁ గలదు.

క. కులశీలవయోవిద్యా | బలయుతుఁ డైనట్టిపతికిఁ బ్రాణప్రియవై,
యిలువేల్పుల గురుజనముల | సులలితభక్తిప్రకర్షశుద్ధిఁ గొలువుమీ.

ఇదె ముంజమహీపతిరాణి నీశ్వశ్రువు. ఈదేవికి నమస్కరించి ప్రియంబు వడయుము.

లీలావతీకన్య. ముంజునిరాణికి నమస్కరించుచున్నది.

ముంజుని దేవి.

క. ముంజకులభాగ్యలక్ష్మీ | మంజులలావణ్యరూపమంగళగృహమా,
పుంజీకృతగుణగణమా | రంజన నాకొమరునికిని రాణివి గమ్మా!

అని చెప్పుచు లీలావతీకన్యను గౌఁగిలించి విడుచుచున్నది.

బుద్ధిసాగరుఁడు, ముంజభూపతీ! అదె కనుంగొనుము.

ఉ. మురజవితానరావములు ముద్దులు గుల్కువిపంచికాధ్వనుల్,
మురళివిరావము ల్సెలఁగ ముంగల వేశ్యలు నాట్యమాడఁగా,
హరిహయువై భవంబు చెలువారఁగ హస్తివరంబు డిగ్గి భూ,
వరతనుజుండు వచ్చె వరవర్ణిను లారతు లెత్తఁ జేర్మిలోఁ.

లీలావతీకన్యకం గాంచి,,

రాజపుత్రి లీలావతీ! భోజకుమారుండు మొదటికక్ష్యాంతరంబుఁ గడఁచి లోనం బ్రవేశింపఁగానే నీ వాతనిగళంబున సుగంధికుసుమదామకం బిడుము.

అంత యథానిర్దిష్టుండై భోజకుమారుండు ప్రవేశించుచున్నాఁడు.

లీలావతీకన్య. భోజకుమారుని గళంబునం గుసుమమాలికయిడుచున్నది.

నేపథ్యంబునం గలకలానంతరము.

మాకెల్లర కిది ప్రియంబు. ఇక్లైవాంఛితాంతరంబుం జూడఁ ద్వరపడుచున్నారము.

భోజకుమారుఁడు. ఆత్మగతంబున,,

ఈపౌరులు లీలావతీస్వయంబరముకంటెం బ్రియం బొందుగల దనివచించెదరు. నా కట్లుగాదు.

మ. దరహాసద్యుతు లాననాంబుజమున దళ్క్రొత్తుచుండంగ ని,
ర్భరలజ్జాకులమై కటాక్షలహరీపఙ్క్తుల్ పయిం బర్వ మం,
థరమై పుల్కలు గాత్రయష్టిఁ గలయం దన్వంగి మత్కంధరన్,
వరణార్థం బగుపుష్పమాల్య మిడుటే వాంఛాఫలప్రాప్తి యౌ.

బుద్ధిసాగరుఁడు. రాజకుమార! నీమేన తకూఁతురు లీలావతీకన్య నీయం దనురక్త. నిన్ను వరించినది. దీని కరకమలంబుఁ గరపల్లంబునం బట్టుకొని నీసేమంబునకు జంద్రోదయంబునకు జలధిచందంబున నుప్పొంగుచుండుపితృవ్యునికిని పితృవ్యపత్నులకును తల్లికిని యథోచితాచారంబునం బ్రియంబు నడుపుము.

భోజకుమారుఁడు. లీలావతీకన్యతో ముంజప్రభృతులకు నమస్కరించుచున్నాడు.

ముంజుఁడు. భోజకుమారునిఁ గౌఁగిటం బోఁదివికొని. ఏడుచుచు,

క. వరగుణ పరమనృశంసత | నరయక నేఁ జేసినట్టియతిదారుణదు,
ర్భరకార్యమునకు నోర్చితి | వరు దయ్యోను నీగుణంబు హరిహాయతుల్యా.

భోజకుమారుఁడు.

గీ. అయ్య జంతువునకు నాపదలను సంప| దలను జేయువాఁడు దైవ మతఁడ,
దొలుతఁ గష్ట మొసఁగెఁ దోడన సుఖ మిచ్చె| ప్రాణిచయము విధికిఁ బరవశంబు.

కాన నిందు దుఃఖింపం జనదు.

బుద్ధిసాగరుఁడు. ముంజభూపతీ! పట్టాభిషేకసుముహూర్తంబు డాసినయది. ఆస్థానమండపమునకుఁ గుమారునితో నందఱును జనవలయును.

ఎల్లవారును పరిక్రమించుచున్నారు.

బుద్ధిసాగరుఁడు. లీలావతీకన్యకతో భోజకుమారుని రత్నాసనంబునం గూరుచుండం జేట్టి. ముంజునింగాంచి,,

ఓముంజభూపతీ! అదిగో పురోహితు లందిచ్చెడుమంగళరత్నకలశంబులు గైకొని తీర్థోదకంబుల నీయిరువుర కభిషేకంబు సలుపుము. పట్టబంధంబు నాచరింపుము.

ముంజుండు. అభిషేకంబు సల్పి పట్టంబు గట్టుచున్నాఁడు.

నేపథ్యంబునం గలకలంబు,,

బుద్ధిసాగరుఁడు.

చ. మొరసెను దూర్యవాద్యము లమోఘములై దివి నిండె విప్రు లా,
దరమునఁ జేయుదీవెన లుదారములై దిశలందుఁ జొచ్చె నా,
నరులజయధ్వనుల్ గడనకత్తెలనాట్యవిరావముల్ సభాం,
తరమున నిండె భోజుడుఁను ధారుణికిం బతి యౌట దెల్పుచున్.

ముంజుఁడు. ఎవరక్కడ! సితచ్ఛత్రచామరధారిణులార రండు.

సితచ్ఛత్రచామరధారిణులై కాంతలు ప్రవేశించిరి.

ముంజుఁడు. ఓకామినులార! వీనిచేఁ గుమారు నలంకరింపుఁడు.

కాంతలు ఆప్రకారం బాచరించిరి.

ముంజుఁడు. భోజకుమారునిం గాంచి,,

కుమార! వినుము.

ఉ. ధరణీరాజ్యము నీది నీ కొసఁగితిన్ ధన్యుండ నైతి న్మహీ,
భరము న్రామభగీరథాదిధరణీపాలోత్తముల్ దాల్చిన,
ట్లరవిందాననఁ గూడి తాల్పుము కరం బాసక్తితో నింక శ్రీ,
ధరతుల్యు న్నిను భర్తఁగాఁ బడసి మోదం బందెడిన్ సత్ప్రజల్.

భోజకుమార! ఇంకను నీ కేమి ప్రియం బొనగూర్చువాఁడ!

భోజకుమారుఁడు. తండ్రి యింతకంటెం బ్రియం బొందుగలదే.

అయిన నిది యగుం గాత.



భరతవాక్యము.

ధర్మమేజయు మెుంచుచుఁ దనరుఁగాత | నెల్లసుఖములు ప్రజలకు నెసఁగుగాత,
లీల శ్రీమంతరామభూపాలమౌళి | పండితులఁబ్రోచుఁగాత సద్భక్తితోడ.

ఇది శ్రీమదాంధ్రభోజచరిత్రంబున భోజరాజచరిత్రనాటకమునందు

భోజరాజపట్టాభిషేకం బనుపంచమాంకము

సర్వంబును సంపూర్ణము.



శ్రీరస్తు.

శ్రీ.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీమదాంధ్ర భోజచరిత్రము.

అందు

## భోజరాజకవిరాజచరితము.

### ప్రథమాశ్వాసము.



శ్రీభోజకుమారునికిం బట్టంబుఁ గట్టి ముంజుండు తనపుత్రులకొక్కొక్కనికి నొక్కొక్క గ్రామంబొసంగి పరమప్రేమాస్పదుండగు జయంతుని భోజునియొద్ద నునిచి పరలోకసుఖంబపేక్షించి తనపట్టమహిషీవర్గంబుతోఁ దపోవనంబునకుం జనియె. అంత భోజుండు దేవబ్రాహ్మణప్రసాదంబున రాజ్యంబుఁ బాలించుచు బుద్ధిసాగరుని ముఖ్యామాత్యునిం గాఁ జేసి సమస్తప్రజలకు సుఖము గలుగునట్లు తనరాజ్యంబు భుజించెను. ఇట్లు కొంతకాలంబు గడవఁగా నొకనాఁడు రాజు క్రీడోద్యానంబునకుం జనుచు ధారానగరవాసి యగు బ్రాహ్మణునిం గాంచెను. ఆవిప్రుండు రాజుం గాంచి కన్నులు మూసికొని వచ్చుచుండఁగాఁ జూచి భోజుండు బ్రాహ్మణుని నీవు నన్నుం గాంచి స్వస్తి వల్కక మఱియుం గన్నులు మూసికొనియెదవు; ఇందులకుం గారణం బేమి? యని యడుగ నాబ్రాహ్మణుఁడు దేవరా నీవు వైష్ణవుఁడవు గాన విప్రులం గాఱియపెట్టవు; కాఁబట్టి నీవలన నాకు వెఱపు లేదు. మఱియు నెవ్వనికేని నేమేని యొసంగవు; నీకు దాక్షిణ్యంబు లేదు; అట్టులుండ నీ కాశీర్వదించుటచే నేమి? అదియునుంగాక ప్రాతఃకాలమునఁ గృపణునిముఖంబుం గాంచఁగాఁ బరునివలనను లాభమునకు హాని గలుగును. అనులోకోక్తి గలదు గానం గన్నులు మూసికొంటిని.

క. ఇల నెవని ప్రసాదము ని | ష్ఫల మగుఁ గోపము నిరర్థభావముఁ గను నా, .
బలహీనుఁ బ్రజలు గోరరు | కలకంఠులు పేడిఁ గోర్కెఁ గాంచనిభంగిన్.

గీ. అప్రగల్భునివిద్యయు నధికకృపణు | ధనము భీతాత్ము భుజబలదర్పభరము,
ననెడియీమూఁడువ్యర్థంబులనుచు నెఱుఁగు | మర్త్యభువిలోనధారాపురాధినాథ.

దేవ! నాజనకుండు వృద్ధుండు కాశికిం జనుచుండ నయ్యా! నేను జరుపుకొనవలసిన యర్థం బెఱింగింపుఁ డని యడుగఁగా నాతండ్రి యిట్లనియె.

క. మన సర్వో నేని నీకుఁ । విను సచివజితు న్విటాళివిజితుని నారీ,
జనజితుని రాజుఁ గలయం । దును గొల్వఁ గడంగఁ జనదు దుఃఖమునందుఁ.

గీ. పాతకంబుల కెల్లను బరమపాత । కంబు లై యొప్పు రెండు భూమండలమున,
దుష్టసచివుండు రాజొక్క దోషమతనిఁ।గొలుచువాఁడొక్క దోషంబుకుత్తలమందు.

క. అవివేకమతి ధరాపతి । సవివేకులఁ బ్రెగ్గడలను సరసకుఁ జేర్పం,
డవినీతులు ప్రబలురు నీ । భువి సజ్జను లతనికడకుఁ బోవుట లెట్లో!

క. నరపతి సిరి లేకున్నను । వరగుణమండితుఁడ యైన వలయును గొల్వఁ,
ధరలో జీవిక గలుగుట । నిరతము కాలాంతరమున నిరుపమఫల మై.

అని చెప్పి చనియె. ఔదార్యము లేనివానికి దాక్షిణ్యం బుండదు. రాజా! తొల్లి కర్ణదధీచిశిబివిక్రమప్రముఖు లగుక్షితిపతులు పరలోకం బలంకరించియుఁ దమదానంబువలనం బొడమినదివ్యనూతనగుణంబులచేత మహీమండలంబునందు వసించుచున్నవారు. అ ట్లగుదురే యితరరాజులు?

క. చెడఁబోవుమేను గావం । గడఁగకు; యశమున్గడింపఁ గడఁగుము చెడ; ది,
య్యొడ మేను వాసిపోయిన । జెడక యశఃకాయముండు చెలువున ధరలోఁ.

గీ. పండితునిపాల మూర్ఖునిపాల నేని । బలముగలవానిపాల దుర్బలునిపాల,
ప్రభునిపాల దరిద్రునిపాల నేని । మృత్యు వొకరీతి వర్తించు సత్య మిదియ.

క. నిమిషనిమిషమున కాయువు । శమ మొందుచునుండుఁ గాని సత మనరా దు,
త్తమకీర్తిఁ గడింపఁగ నగుఁ । గ్రమమునఁ జంచలతఁ గాంచుకాయముచేతఁ.

క. అది జీవిత మని సుకృతులు । మది నెంచరు జ్ఞానవిక్రమత్యాగంబుల్,
విదిత మగులజ్జ భోగము । నెద నెఱుఁగనివానిబ్రతుకు నిహలోకమునఁ.

రాజు నావాక్యంబులచేత నమృతప్రవాహమున మునిఁగినవాఁడునుంబోలెను పరమాత్మయందు లీనుం డైనతెఱుంగునను లోచనంబుల నానందబాష్పంబులు గార్చుచు విప్రునితో ని ట్లనియె. ఓద్విజసత్తమా వినుము.

క. సులభులు ప్రియవాదులు నరు । లిల హితమును బలుకువార లెక్కడనో భూ,
తలమునఁ బ్రియమును హితముఁ । బలికెడువారలును వినెడుపతులును మృషయే.

గీ. అలమనీషులు హితవాదు లగుట లేదు । అహితైషి మనీషియు నగుట లేదు,
స్వాదువై హిత మైనయౌషధముమాడ్కిఁ । బండితుండైనమిత్రునిప్రాప్తియరుదు.

అని చెప్పి బ్రాహ్మణునికి లక్షధనం బొసంగి బ్రాహ్మణా నీపే రేమి యనియడుగ విప్రుండు తనపేరు గోవిందుం డని భూమిపయి వ్రాసెను. రాజు చదువుకొని విప్రుఁ

డా ప్రతిదినము రాజభవనమునకు వచ్చుచుండుము; నీకు నిషేధంబు లేదు; కౌతుకంబున విద్వాంసులను కవులను సభకుం దోడ్కొని వచ్చుచుండుము. ఏవిద్వాంసుండుగాని దుఃఖంబుం బొరయ కుండనగు. ఈయధికారంబును బరిపాలింపుము. అని చెప్పెను.

ఇట్లు కొన్ని దినములు జరుగఁగా రాజువిద్వత్ప్రియుండు దానవిత్తేశ్వరుండు నను విఖ్యాతిం గాంచెను. అంత రాజుం జూడఁ గోరి కవులు నానాదిశలనుండి వచ్చిరి. ఇట్లు ధనాదులను వ్యయముచేయురాజుం గాంచి ముఖ్యామాత్యుం డిట్లనియె. దేవ! కోశబలం బు గలరాజులే జయంబు గాంచుదురు.

క. ఎవనికిఁ బటుతరమాతం | గవరంబులు కోశచయము ఘనదుర్గచయం,
బవనిఁ జెలంగునొ వాఁ డో | యవనీపతివంద్యచరణ యరిదుర్జయుఁడో.
రాజా! లోకంబుం గాంచుము.

క. ధనికులకె ప్రాయికంబుగ | ధనమందును దృష్ణ యధికతర మై యుండున్,
కను కోటిద్వయసక్తము | ధనువది లక్షంబుకొఱకుఁ దహతహ పడదే.
అని చెప్పఁగా రా జతని కిట్లనియె.

క. దానము నుపభోగంబును | మానుగ సుహృదనుభవంబు మానినధనమున్,
బూనిక దాఁచిన నది చెడి | తాన యలక్ష్మియయి నరునితప్పక చెందున్.
ఇట్లు సెప్పి యామంత్రిని మంత్రిపదవినుండి తొలఁగించి యాస్థానంబున మఱియొ కని నునిచి వాని కి ట్లనియె.

క. †లక్ష మహాకవి కొసఁగుము | వీక్షించి తదర్ధ మిమ్ము విబుధునికిని సం,
శిక్షితుని కొక్క గ్రామము | సుక్షితి యల్పజ్ఞునికిని శుభమతి నిమ్మా.
మదీయమంత్రిప్రభృతులలో నెవఁడు వితరణంబును నిషేధింపం గోరు; వానిం జం పి వేయునది. అంగులకుం జెప్పంబడినది వినుము?

క. ఇచ్చినది యనుభవింపం | జొచ్చినది య ధనికులకును జూడఁగ ధన మా,
చచ్చినపిమ్మటఁ బెర లెద | మెచ్చుచు భోగింత్రు ధనము మెలఁతలఁ బ్రీతిన్.

క. దాతయ ప్రజలకుఁ బ్రియుఁ డో | భూతలమున; గాఁడు ద్రవిణపూర్ణుం డరయన్,
బ్రీతిని జలదముఁ గోరెదు | భాతి; జలధిఁ గోరరయ్య ప్రజ లెప్పటికిన్.

గీ. సంగ్రహైకపరుం డయి జలధి యడఁగి | యుండును రసాతలంబున; నోజమీఱ,
భువనములకును బైన నంభోద మెపుడు | గర్జనము సేయుచుండ దేకడుముదమున.

---

శ్లో. †లక్షం మహాకవే ర్దేయం తదర్ధం విబుధస్యచ,
దేయం గ్రామైక మర్ధస్య | తస్యాప్యర్ధంతదర్థినః.

అనిపల్కెను. ఇట్లు వితరణశాలి యని భోజుని విని యొక్కఁడు కళింగదేశీయుండు కవి సనుదెంచి మాసకాల ముండియు నరేంద్రునిదర్శనంబు దొరకక భోజనము నకుఁ బాథేయంబు సయితము లేమి శ్రమపడుచుండి యొకనాఁడు వేఁటకై వెలువడినరాజుంగాంచి యి ట్లనియె.

గీ. భోజభూపతిఁ జూడ నప్పుడు సరగున । మూఁడుగళితంబులగుచుండునాఁడునాఁడు,
శత్రువులచేతిశస్త్రముల్ సరసకవుల । ముప్పులును జవ్వనులపోఁకముడులుపెలుచ.

రా జతనికి లక్షధన మొసఁగెను. అంత భోజుండు మృగయాలంపటుండైతిరుగుచు నొకపుళిందపుత్రకుండు గానము సేయుటఁ జూచి వానిగీతమాధుర్యంబునకు డెందంబున నమందానందంబు నొంది వానికి నయిదులక్షలధన మొసంగెను. అప్పుడు కవి కడునగ్గలంబగునాతనిదానంబును గిరాతార్భకునిం గాంచి నరేంద్రునిచేతనుండుతమ్మిపువ్వునెపంబున రాజునకుం దెల్పుచున్నాఁడు.

క. సరసిజమా నీకును గుణ । భర ముండిన వెలుఁగఁ బోదు ; పాయక మధుపో,
త్కరభోజ్యము నీకోశము ; । సిరి కిర వైనట్టినీకుఁ జెడు గిది యరయన్.

అని చెప్పఁగా భోజుండు వానియభిప్రాయం బెఱింగి లక్షధనం బొసంగి యాబ్రాహ్మణున కి ట్లనియె.

క. కళయే పూజ్యము దొరలకు । కులమునఁ బుట్టుటయె పూజ్యకోటి నెనయ దా,
బలవంతుఁడు శంభుఁడు తన । తలను గళావంతుఁ బూజ్యత న్గొనియాడున్.

ఇట్లు సెప్పుచుండఁగా నెక్కడనుండియొ యైదుగురు కవులు సనుదెంచిరి. వారలం గాంచి రాజు తనమనంబున నిప్పుడ యింతధనం బొసంగితినే యనితలంచుచు మాన్పడియుండె. అంతఁ గళింగదేశవాసి కవి రాజునభిప్రాయం బెఱింగి వెండియుఁ బద్మవ్యాజంబునం జెప్పుచున్నాఁడు.

క. శతపత్రము కిను కేలా । యతిసౌరభలోభనీయ మగునీమధుసం,
తతికై వెదకక మాను నె । ప్రతిపత్రం బాసమీాఱ బంభరకులముల్.

అని చెప్పి ప్రభువు ప్రసన్నవదనుం డైనం గాంచి ప్రకాశంబుగ నిట్లనియె.

క. పిసినారి చాలు నే తన । వసువుల నొసఁగంగ గాఢవాంఛఁ గుదువఁగాఁ,
బస లేక తాకు నంతియ । యసితాక్షులఁ జేడి చేత నంటెడురీతిన్.

క. యాచితుఁడై ముద మందుచు । యాచకునకు నొసఁగి పూర్ణహర్షముఁ గనునా,
భూచక్రవాసి వినినన్ । లోచనములఁ గనిన స్వర్గలోకము దొరకున్.

అని చెప్పఁగా రాజు సంతుష్టుండై వెండియుఁ గళింగదేశవాసికవికి లక్షధనం బొసంగె, అంత నాలొలుతటికవి యెదుట నుండునార్వుఱఁ గవులం గాంచి యొకవులా

ర! రా జిప్పుడు మహాసరస్సేతుభూమియం దున్నవాఁడు. తనభవనంబునకుం బోఁ గడంగును. ఇంతలో నేదేని వచింపుఁ డంచు వచించె. వార లందఱు మహాకవు లయ్యుఁ తొలు తటిరాజుపను లెఱింగినవారలైయున్నవారుగాన వారలలో నొక్కొక్కఁడు సరోవ్యా జంబున రాజున కనియె.

క. నిండక వచ్చెడుకుండలు । నిండియు జనకుండుకలశనివహంబులు వే,
మెండుకొని త్రోవఁ గూడక । యుండుటకు సరోవరంబ యుపమవు గావే.

అది విని రాజు వానికి లక్షధనం బొసంగెను. అంత గోవిందపండితుండు ఆక వులపయిం గోపగించుకొనియె. వానికో పాభిప్రాయం బెఱింగి రెండవకవి యి ట్లనియె.

క. ఎవనితృషదీర్ప వాదట । నెవఁడు జలంబులను గ్రోలఁ డెలమిని హ్రదమా,
రవరవలు సెలఁగ నక్రము । భవదపలంబనము గ్రోథపడకుండినచోఁ.

అనఁగా విని వానికి రాజు రెండులక్షలధనం బొసంగి గోవిందపండితుని వ్యాపార పదవినుండి తొలఁగించి నీవును సభకుం జనుదెంచుచుండునది యేమియు దౌష్ట్యంబు సే యం జనదు అని చెప్పి యంత నాకవుల కొక్కరికి చెఱి లక్షలక్షధనం బొసంగి తన నగరంబు సేరెను. ఆకవులును తమయిచ్చం జనిరి. అంత నొకనాఁడు రాజు తనముఖ్యా మాత్యుని కిట్లనియె.

గీ. బ్రాహ్మణుండయ్యుమూర్ఖుఁడైపరగు నేని। పురము వెలినుండఁజనువాఁడునిరతముగను,
పండితుం డయి ధరణిని పరఁగు నేని । కుంభకారుఁడుపురినుండఁగూడ దెపుడు.

అని చెప్పి యట్లు చేయించె. కాన ధారానగరంబున మూర్ఖుం డెవ్వండును లేఁ డయ్యె. అంతం గ్రమంబున నేఁబండ్రు వరరుచి, బాణ, మయూర, రేఫణ, హరి, శంక ర, కళింగ, పూర, వినాయక, మదన, విద్యావినోద, కోకిల, తారేంద్ర ప్రముఖులు స ర్వశాస్త్రవిచక్షణు లందఱును సర్వజ్ఞులు పండితులు శ్రీభోజరాజసభ నలంకరించిరి.

## రాజునకును శంకర, కాళిదాసకవులకును సమావేశము.



ఇట్లుండ నొకనాఁడు విద్వద్బృందంబులు సేవింపఁగా శ్రీభోజభూపతి కవిశిరో మణి కవిత్వప్రియుండు విప్రప్రియబాంధవుండు సింహాసనమున నుండఁగా ద్వారపాలుం డు సనుదెంచి ప్రణమించి దేవా విద్వాంసుం డొక్కరుండు వాకిట నున్నాఁ డని విన్న వించి రాజువలన నానతి వడసి యాపండితునిం బ్రవేశపెట్టెను. ఆబ్రాహ్మణుఁడును దక్షిణహస్తం బెత్తి యి ట్లనియె.

కవి. ‡ నరపతి! సేమ మాను,,

అనఁగా భోజుఁడు. కవినాథుఁడ శంకర యేమి పత్రికావరమున,,

కవి. పద్యము,,

భోజుఁడు. ఎవ్వనిదివర్ణన,,

కవి. నీది,,

భోజుఁడు. పఠింపుము,,

కవి. అట్లయే|| వరసితచామరప్రతతి వారక వీవఁగ సంచలించునీ,

తరుణులహస్తకంకణవితానరుణాత్కృతిఁ గొంచె మాపుమీ.

† గీ. మూఁడులోకములను సితములుగఁ జేయఁ|గడఁగెనన నీయశము వృద్ధిఁ గాంచఁగాంచ,

నంతరంగము నాకుఁ బ్రియాలకాళి | తెల్ల నౌ ననుచింతచేఁ దల్లడిల్లు.

అంత రాజు శంకరకవికిఁ బంద్రెండులక్షలధనం బొసంగెను. అందఱు పండితుల మోములు వెల్లఁబాఱె. రాజభయంబున నెవ్వఁడే నేమియుఁ బల్కఁడయ్యె. రాజు కార్యవశంబున నింటికిం జనఁగా రాజు లేనిసభయందుఁ గవిరాజులు ఔరా యేమి యీభూపాలునియుజ్జకి; వీనిఁ గొలువ నేల ? వేదశాస్త్రవిచక్షణులకుఁ దన్నాశ్రయించుకొనియున్నకవులకు లక్ష యొసంగె. వీఁడు ప్రియుంపడక పోయిన నేమి ? ఈశంకరకవి కేవలుఁడు గ్రామ్యకవి. వీని కేమిప్రాగల్భ్యము గలదు. అని యిట్లు దూఱుచుఁ గోలాహలంబు సేయుచుండఁగాఁ గనకమణికుండలంబులు దాలిచి దివ్యమగువలువ గప్పుకొని రాజకుమారుండువోలె మృగమదపంకకళంకిత మగుమేనితోఁ గ్రొత్తపూలదండలు దుఱిమినసిగతోఁ జందనాంగరాగంబుతో వలపుఁగొలుపు మూర్తిం దాలిచినవిలాసంబుభాతి మేనుధరించిన కవితవిధంబున శృంగారరసంబు జాలువాఱినచందంబునఁ భూమిం జెందినమహేంద్రుని

---

‡ శ్లో. రాజ న్నభ్యుదయోస్తు శంకరకవే కిం పత్రికాయా మిదం పద్యం కస్య తవైవ భోజనృపతే పాఠ్యతాం పఠ్యతే | ఏతాసా మరవిందసుందరదృశాం ద్రాక్చామరాందోళనా దుద్వేల్లద్భుజవల్లికంకణఝణాత్కారః క్షణం వార్యతాం.

చ. నరపతి సేమ మాను కవినాథుఁడ శంకర యేమి పత్రికా,

వరమునఁ బద్య మెవ్వనిది వర్ణన నీది పఠింపు మట్లయే,

వరసితచామరప్రతతి వారక వీవఁగ సంచలించునీ,

తరుణులహస్తకంకణవితానఝణాత్కృతిఁ గొంచె మాపుమీ.

శ్లో. † యథాయథాభోజయశోవివర్ధతేసితాంత్రిలోకీమివకర్తుముద్యతా,

తథాతథామేహృదయంవిదూయతేప్రియాళకాళీధవళత్వశంకయా.

వైభవంబునం దోఁచుచు నొకవిద్వాంసుండు సనుదెంచెను. ఆతనిం గాంచి యావిద్వత్సభ భయకౌతుకంబులు సెందె. అతఁడు ఎల్లవారలకుం బ్రణామంబు సలిపి భోజభూపతి యెయ్యెడ నని యడుగ వారు నిప్పుడ సౌధాంతరంబుం జెందె నని నుడువఁగా వారలకు వెవ్వేఱఁ దాంబూలంబు లొసంగి యేనుఁగులగుంపులనడుమం బొలుచుసింగంబుచందంబునం దోఁచుచు నామహాపురుషుండు శంకరకవి కొసంగినదానంబువలనఁ గినుకఁ బూని యుండుకవుల నెఱింగి యిట్లనియె. మీరలు శంకరకవికిఁ బండ్రెండులక్షలధనంబు రాజొసంగె నని తలంపంజనదు. రాజునభిప్రాయంబు మీర లెఱుంగరు. మానసంబున నుపక్రాంతంబగుశంకరపూజనంబునందు శంకరకవి యొకలక్షంబునన పూజింపంబడెను. మఱి యాతనియం దుండువారల నాతనినామంబున వెలుఁగుచుండువారల నేకాదశరుద్రుల శంకరునిమూర్త్యంతరముల సాక్షాత్కరించినట్లు దలంచి వారలకు వెవ్వేఱ నొక్కొకలక్షయును శంకరమూర్తి యగునాశంకరకవికే యిచ్చినట్టులు రాజునభిప్రాయము. అని చెప్పఁగా నెల్లవారును కడు నచ్చెరువు నొందిరి. అంత రాజపురుషుం డొక్కరుండు వైశంబ యావిద్వత్స్వరూపంబు రాజునకుం దెలిపె. రాజును తనయభిప్రాయం బెఱింగిన వాని మహేశునివంటి మహాపురుషునిఁ గాఁ దలంచుచు సభకుం జనుదెంచెను. ఆపురుషుండు రాజునకు స్వస్తి చెప్పెను. రాజు నతని నాలింగనము చేసికొని ప్రణతుండై తనకరతలంబున నతనికరతలంబుఁ బట్టుకొని సౌధాంతరంబునకుం దోడ్కొనిచని యుత్తుంగగవాక్షంబునం గూరుచుండి యో బ్రాహ్మణుఁడా ఏయక్షరంబులు నీనామంబునం దగిలి సౌభాగ్యంబుం గాంచె; నీవిరహంబున నేదేశపుజనులు బాధపడియెద రని యడుగఁగాఁ గవి రాజుహస్తంబునందు కాళిదాసః అని వ్రాసిన రాజు పఠించి యతనియడుగులపైఁ బడియె. వార లయ్యెడ నుండఁగా సంధ్య యయ్యె. రాజు చెలికాఁడా సంధ్యను వర్ణింపు మనెను.

చ. ‡ సరసిజకాంతి దుర్వ్యసనసంగతువిద్యవిధానఁ దగ్గ ష,
ట్చరణములుఁ విదేశమున సాధులమాడ్కిని దీనతం గనెఁ,
నరులను నొంచె దుష్టనరనాథుఁడు వోలెఁ దమంబు లుబ్ధుఁ డౌ,
పురుషునియర్థసంచయముబోలె నిరర్థతఁ గాంచె నేత్రముల్.

అని చెప్పి కాళిదాసుండు మఱియుఁ వర్ణించుచున్నాఁడు.

క. ఉపచారము కర్తవ్యము । సుపురుషులకు సౌహృదంబు చూపట్టెనుదాఁ,
కుపగతసౌహృదులకు నగు । నుపచారము కైతవముగ నూహింపంగన్.

క. రమణీయకావ్యరచనయు । విమలం బగుకవులక్రమము వేడ్క నెఱుఁగునా,
సుమనస్కుఁడు వసుపూర్ణత । యమరినమహి కవుల కిచ్చు నరమర తొలఁగన్.

---

శ్లో. ‡ వ్యసనినఇవవిద్యాక్షీయతేపంకజశ్రీర్గుణినఇవవిదేశేదైన్యమాయాంతి భృంగాః ।
కునృపతిరివలోకంపీడయత్యంధకారోధనమివకృపణస్యవ్యర్థతామేతి చక్షుః.

క. *సుకవియరయెఱుఁగునుపో మహి । సుకవులు శబ్దములఁ గూర్చుసొంపునువంధ్యా,
ప్రకరంబు ప్రసవవేదన । యొకకొంత యెఱుంగనట్టు లూరు లెఱుఁగరుగా ?

అంతం గ్రమంబుగ భోజకాళిదాసులకుఁ బ్రీతి పెరుగుచువచ్చెను. కాళిదాసుండు వేశ్యాలంపటుం డని యెఱిఁగి యెల్లవారును వానిని ముట్టుకొన కుండిరి. అట్లుండ నొకనాఁడు సభామధ్యంబునందుఁ గాళిదాసునిం గాంచి భోజుండు తనమనంబునఁ బ్రాజ్ఞుండయ్యు వీనికి స్మరపీడాప్రమాదంబు బాయక యున్నదే యని యనుకొనెను. అది యెఱింగి కాళిదాసుం డి ట్లనియె.

గీ. ‡ దర్పకోదారచాపలతాప్రసంగ । మునకు మానవు లన నెంత వినవె తొల్లి,
త్రిపురముల నేర్చినట్టియాదేవదేవు । పౌరుషం బట్టిదియు సగపాలు గాదే.

అంత సంతసించి భోజుఁడు ప్రత్యక్షరలక్ష యొసంగెను. కవి భోజునిస్తుతించుచున్నాఁడు.

చ. $ అరు దగునీయశంబు జగ మంతయుఁ దెల్లఁగఁ జేయఁగా మహా,
పురుషుఁడు క్షీరవారినిధిఁ బూనికతో వెదకంగసాగె నా,
హరుఁ డలవెండికొండఁ గులిశాయుధుఁడు న్సురదంతి హంసమున్,
సరసిజగర్భుఁ డిందువును సైంహికుఁ దిప్పుడు భోజభూపతీ.

ఉ. † నీరము క్షీరము న్గొనుచు నీరజసంభవుఁ డెల్లపుల్గులన్,
జేరును తక్రముం గొనుచు శ్రీపతి సంద్రములం జరించు గా,
రీరమణుండు ద్రిమ్మరు గిరిప్రతతు న్నెగకంటఁ గాంచుచున్,
చారుభవద్యశోంగన భృశంబుగ లోకము లెల్ల గ్రమ్మఁగాన్.

---

శ్లో. * సుకవే శ్శబ్దసౌభాగ్యం సత్కవి ర్వేత్తి నాపరః । వంధ్యా నహి విజానాతి పరం దౌహృదసంపదం.

శ్లో. ‡ చేతోభువ శ్చాపలతాప్రసంగే । కావాకథా మానుషలోకభాజాం,
యద్దాహశీలస్య పురాం విజేతు స్తాదృగ్విధం పౌరుష మర్ధ మాసీత్.

శ్లో. $ మహారాజ శ్రీమన్ జగతి యశసా తే ధవళితే । పయఃపారావారం పరమపురుషోయం మృగయతే । కపర్దీ కైలాసం కరివర మభౌమం కులిశభృ । త్కళానాథం రాహుః కమలభవనో హంస మధునా.

శ్లో. †నీరక్షీరే గృహీత్వా నిఖిలఖగతతీ ర్యాతి నాళీకజన్మా । తక్రం ధృత్వాతుసర్వా, నటతి జలనిధీన్ చక్రపాణిర్ముకుందః । సర్వా నుత్తుంగశైలాన్ దహతి పశుపతిః, ఫాలనేత్రేణపశ్యన్ । వ్యాప్తా త్వత్కీర్తికాంతా త్రిజగతి నృపతేభోజరాజక్షితీంద్ర.

ఉ. † తోయజసూతి నీయశముఁ దూఁచుటకై రజతాద్రి సేయఁగాఁ,
ఛాయక దానియందు లఘుభావము గన్పడఁ బూర్తి కందు గో,
నాయకు దానిపైన సతినాయకుఁ దచ్ఛిరమందు జాహ్నవీ,
తోయము దాన శేషఫణిఁ దోఁజవైరని దానిపై నిడెన్.

ఉ. ‡ వల్లవ పోయె దెందుఁ ద్రిదివంబుననుండి; సురర్షి ఘాసముల్,
గొల్లలు గాఁగఁ గామగవికూఁతుకుఁ దెచ్చుట; కేమి లేవె పాఁ;
లెల్లెడ భోజునీవి విని హ్రీఁగతి దానికిఁ జన్ను లెండెఁగా;
పొల్ల ప్రయాస మాతనిరిపు ల్దిని రంతయు దాని మేదినిన్.

అని చెప్పఁగా విని రాజు తుష్టుండై ప్రత్యక్షరలక్ష యొసంగె.

అంత నొకప్పుడు శ్రుతిస్మృతిపారంగతులు కొందఱు రాజు కవిత్వప్రియుం డని యెఱింగి పురంబునకు వెలి భువనేశ్వరీదేవాలయసమీపమునం గవిత్వంబు సేయం గూరుచుండిరి. అం దొక్కరుండు పండితమ్మన్యుండు† క,, నరపతిభోజనమిడుమా,, అనియొకచరణంబు పఠించెను. అంత మఱియు నొక్కరుండు‡ క,, సరగున ఘృత సూపభారసంపూర్ణముగా'' అనిచెప్పెను. ఉత్తరార్థంబు తోఁచనిదాయె. అంత దేవతాభవనంబునకుంబ్రణామార్థ మరిగినకాళిదాసుం గాంచి విప్రులుమేము సమగ్రవేదవిదుల మయ్యును మాకు భోజుం డేమియు నొసంగఁడు. మీవంటివారలకు యథేష్టముగ నొసంగుచున్నాఁడు. మేము కవిత్వము సేయ నియ్యెడకు వచ్చినారము. కడుఁదడవు చింతించి పూర్వార్ధము రచించితిమి. దాని కుత్తరార్ధంబుఁ జేసి యిమ్ము. అట్లయిన మా కేదేని యిచ్చు నని వల్కుచుఁ దాము రచించినపూర్వార్ధంబుం జెప్పిరి. అది విని కవి.

---

శ్లో. † విప్ర ద్రాజశిఖామణే తులయితుం ధాతాత్వదీయం యశః । కైలాసంచ నిరీక్ష్య తత్ర లఘుతాం నిక్షిప్తవాన్ పూర్తయే। ఉక్షాణం తదుప ర్యుమాసహచరం తన్మూర్ధ్ని గంగాజలం। తస్యాగ్రే ఫణిపుంగవం తదుపరి స్ఫారం సుధాదీధితిం.

శ్లో. ‡ స్వర్గా ద్గోపాల కుత్ర వ్రజసి సురముసే భూతలే కామధేనోః।వత్స స్యానేతు కామ స్తృణచయ మధునా ముద్ధదుగ్ధం న తస్యాః । శ్రుత్వా శ్రీభోజరాజప్రచురవితరణం వ్రీడశుష్కస్తనీ సా । వ్యర్థోహి స్యా త్ప్రయాస స్తదపి తదరిభి శ్చర్విత్వం సర్వ ముర్వ్యాం.

వల్లవపోయెదెందు,, అనుపద్యమున స్వర్గమునసుండు గోపాలకునికిని నారదమునికిని సంవాదరూపముగా భోజుని త్యాగము వర్ణింపంబడియె. వల్లవ=గొల్లఁడా! ఇది నారదకృతసంబోధనము. సురర్షి=నారదా? ఇద గొల్లఁడుచేసిన సంబోధనము. ఏమి? నారదముని వచనము. ఎల్లెడ,, గొల్లనివచనము. పొల్ల,, నారదునివచనము.

శ్లో. † భోజనం దేహి రాజేంద్ర । ‡ ఘృతసూపసమన్వితం,,

క. * శరదిందుచంద్రరుచిసుం । దరధవళము మాహిషంబు దధియును ద్రీతిన్.

అని చెప్పెను. అదియుం గొని వారలు రాజభవనంబునకునుం జని దౌవారికుల తో మేము కవనము చేసికొనివచ్చియున్నారము రాజుకడకుంగొనిపొమ్ము అని యడుగ నా దౌవారికులు చని రాజునకుం బ్రణమించి యి ట్లనిరి.

గీ. రాజమాషనిభంబు లైరశము గాని । పండ్లతోఁ గటివివ్య స్తపాణు లగుచు,
ఛాందసులు శ్లోకశత్రువుల్ కొందఱిపుడు । ద్వారదేశమునం దున్నవారు। దేవ.

అనిన రాజు వారలం బ్రవేశపెట్టుం డనిన నట్లు చేసిరి. వారు రాజసంపదం గాం చుచు నందఱు నొక్క మొగి పఠించిరి. రాజు విని యుత్తరార్ధంబు కాళిదాసుండు రచిం చిన దని యెఱింగి విప్రులతో నిందుఁ బూర్వార్ధంబు చేసినవానిమోమునుండి యెప్పటికిని కవిత్వము వెలువడినది గాదు. ఉత్తరార్ధంబున కించుక యొసంగెద నని చెప్పి ప్రత్యక్షర లక్ష యొసంగె. వారలు దక్షిణలు గైకొని చనుఁడు కాళిదాసునిం గాంచి రాజు ఓకవీ యుత్తరార్ధము నీచెప్పినదిగాదా! యనం గవి యిట్లు వల్కె.

క. అనుభవరసికుఁడె యెఱుఁగును । నునుమోవినిమధురగుణము నూల్కొనుబటువుం
జనుగుబ్బలకాఠిన్యము । కనుఁగవతీక్ష్ణతయుఁ గవితఁ గలపాకంబున్.

అది విని రా జి ట్లనియె. సుకవీ సత్యంబు వల్కెదవు.

క. భారతికావ్యామృతఫల । సార మపూర్వంబు సర్వసామాన్యముగా,
వారక చర్విత మయినన్। సారముఁ గైకొనెడువాఁడు సత్కవి యొకఁడే.

గీ. మహిని జింతింపఁ జింతింప మనసుఁజెందె। నిక్షుసారంబులును సత్కవీంద్రుబుద్ధి,
ముగుదపాయంపుబడతులనగవుదేరు । బెళ్కువాలారుఁజూపులగుల్కుఁదనము.

అని చెప్పెను. అంత నొకప్పుడు ద్వారపాలకుఁడు నమస్కరించి భోజునితో రాజా ద్రవిడదేశమునుండి లక్ష్మీధరుం డనుకవి యొకరుండు వచ్చి వాకిట నున్నాఁ డని రాజు తోడ్కొనిరమ్మనఁగా నాతనిం బ్రవేశపెట్టెను. అట్లు ప్రవేశించినవాని సూర్యుని తెలుంగునం దోఁచుచుండువానిఁ దడవయ్యు నృత్తాంతం బెఱుకపడనివానిం జూచి రాజు విచారించుచు ని ట్లనియె.

గీ. కాంచి యాకారమాత్రానఁ గవులసన్మ । నోరథంబులు దీర్చెదుసారమతులు,
ధన్యు లగుదురు యాచకతతులదీన । వచనములు వారిచెవిసోకవచ్చు టరుదు.

అనిచెప్పెను. అంత నాకవి సనుదెంచి రాజునకు స్వస్తి చెప్పి యాతనియాజ్ఞ చేఁ గూరుచుండి రాజా! యీనీసభ పండితమండితంబై యున్నది; నీవు సాక్షాద్విష్ణుండవు; కాన నాపాండిత్యం బేపాటి దగు; అయిన నొకించుక వల్కుదు.

---

శ్లో. * మాహిషంచ శరచ్చంద్రచంద్రికాధవళం దధి,,

గీ. భోజ నీప్రతాపపుంజంబు సేయుచో । బడినశకలసమితిఁ బారవేయ,
ఘోరికరంబునందు నశని యయ్యెను మింట । వేఁడివెలుఁగు నబ్ధి బాడబాగ్ని.

అని చెప్పఁగా సభ యబ్బురంపడియె. రా జతనికిం బ్రత్యక్షరలక్ష యొసఁగె. వెండియుఁ గవి రాజా నే నిందు వసింపఁగోరి కుటుంబంబుతోఁ జనుదెంచినాఁడ.

గీ. క్షమయు దాతృత్వమును గుణగ్రాహితయును। గల్గునేలిక పుణ్యసంగతులఁదొరకు,
శుచియు విద్వాంసుఁడును సుదక్షుండు నైన।కవిలభించుటయరుదుపోభువిఁదలంప.

అంత రాజు ముఖ్యామాత్యునితో నితనికి గృహం బిప్పింపు మనిచెప్పఁగా నతఁడు నగరం బంతయుఁ గలయ విలోకించి యొకసాలెవానియిల్లు గాంచి యోకువిందుఁడా నీ విల్లువెడలిపొమ్ము. నీయింటికి విద్వాంసుండు రాఁబోయెడిని. అని చెప్పఁగాఁ గువిందుండు రాజభవనంబునకుం జనుదెంచి రాజునకు నమస్కరించి దేవా నీయమాత్యుండు నన్ను మూర్ఖునిఁ గాఁ జేసి యిలువెడలనడుచుచున్నాఁడు. నేను పండితుఁడనో మూర్ఖుడనో తెలిసికొనుము. అని యి ట్లనియె.

ఉ. * చేయుదు నేను గావ్యమును జేయఁగఁ జాలను సొంపు లొల్కఁ గాఁ,
జేయుదు నేఁ బ్రయత్నమునఁ జేయుదుఁ జారుతరంబుగాఁ దగన్,
పాయక సాహసాంక నరపాలకమాళివిచుంబితాంఘ్రిస,
త్తోయజ చేసెద న్కృతులఁ దూకొని నేసెద బాసిదఁ న్మురిన్.

అది విని రాజు త్వంకారవాదంబుతోఁ జెప్పుకువిందునితో ఓరి నీపదపఙ్క్తి లలితంబ ; కవితయందుం గలమాధుర్యంబును బాగైనదియ. అయినను కవిత్వంబు విచారించి చెప్పం జను ననఁగా నాకువిందుండు కోపంబుతో ని ట్లనియె. దేవ యిం దంతరంబుగలదు. ఐనను వచింపక యున్నాఁడను. రాజధర్మంబుకంటె విద్వద్ధర్మంబు వేఱు; అనఁగా రాజు ఓరి కలదేనిఁ బ్రత్యుత్తరం బొసంగుము అని యనినఁ గువిందుండు దేవ కాళిదాసుని కంటె నితరునిం గవిఁగాఁ దలంపము ఆతనికంటెం గవితాతత్త్వవేది విద్వాంసుండు నీసభ నెవ్వఁ డున్నాఁడు ? అని యిట్లు చెప్పుచున్నాఁడు.

చ. గురుగరుణామృతోద్భవము గూడును వాగ్విభవంబు సత్కవిన్,
స్థిరత పఠంబునం జదివి తేరినవానికి రాదు సుమ్ము కా,
సరము కొలంకునందు దివసంబు వసింపఁ గలంచు నీరమున్,
సరసిజసౌరభంబుఁ గొనఁ జాలదు పొ మ్మటులే కవీతరుల్.

---

*శ్లో. కావ్యంకరోమి నహిచారుతరంకరోమి। యత్నాత్కరోమి యదిచారుతరంకరోమి। భూపాలమౌళిమణిరంజితపాదపీఠ । హేసాహసాంకకవయామివయామియామి.

మ. పదవైదగ్ధ్యవిభాసురం బయి స్ఫురద్బంధంబు నొమ్మన్మహా,
పదగుంభం బది యన్యునుల్లమున స్వర్థంబో; గృతార్థంబుగాc,
బొదలుం బోc గవిభావమందు; భువిలోc బూబోణివాల్పైకుచా,
పది నిస్సారము బాలునందు; యువకు న్హాళిం దగం జేయదే.

అని చెప్పcగా విద్వజ్జనవందిత యగుసీత యి ట్లనియె.

గి. †విపులహృదయాభియోగకవిప్రయోగ। మున జడుండొందు ఖేదంబుc దనయశక్తిఁ
దలcపcడతికుచ్ఛకుచనైనతలిరుcబోడి।కంచుకముదూఱుcబోప్రాయికంబుగాcగ.

అంతం గువిందుం డి ట్లనియె.

గీ. సుతులుబాల్యంబునందును సురతమందు।సతులుస్తుతులందుc గవులునుసమరమందు,
భటులు త్వంకారయుక్తితోc బలుకు టొప్పు । ననుచు నెఱుcగవొ మోహంబు
[నఱుముకొనెనో

అనిచెప్పcగా విని రాజు ఓకువింద నీవచించినది యొప్పు నని వానికిం బ్రత్యక్షర లక్షధన మిచ్చి యభయం బొసంగె.

ఇట్లు సారిదిని కాలంబు గడవcగా బాణుండు పండితుండు కరము రాజుచేత సమ్మానితుం డయ్యుc బూర్వకర్మవశంబున దారిద్ర్యం బనుభవించుచుండెను.

ఇ ట్లుండcగా రాజు తా నొకప్పుడు రాతిరి యొంటరిగc దిరుగుచుc బ్రచ్ఛన్న వేషంబున బాణకవియింటికిం జనుదెంచి యచట నుండెను. అప్పుడు నిశీథసమయంబున దారిద్ర్యంబుచే వ్యాకులపడుచుండువాcడు గాన దనకాంతతో ని ట్లనుకొనుచున్నాcడు. దేవి రాజు నామనోరథంబుల నెన్నెన్నో మాఱులు పూర్తిచేసెను. ఇప్పటికి నడిగిన నియ్యకపోcడు. అయినను సంతతము ప్రార్థనసేయుటచేత మాధునినాలుక సయితము జడత్వంబుం గాంచు. అని చెప్పి ముహూర్త మూరకుండి యి ట్లనుచున్నాcడు.

---

† శ్లో. విపులహృదయాభియోగే ఖిద్యతికావ్యేజడోనమూర్ఖస్స్వే.
నిందతికంచుకమేవ ప్రాయశ్శుష్కస్తనీనారీ.

అతిగంభీరమగు మనోభిప్రాయముగల కావ్యమునందు జడుండు తనకేమియుందెలి యక ఖేదపడుచుండుcగాని తనకుబుద్ధిబలము చాలనివిషయంబునందు దుఃఖింపcడు.శుష్క కుచయగు పడcతి దినదినమునకు పెచ్చైవచ్చుటవలన రవికెను దిట్టు. అదిరవికెదోషమా? అటె జడుcడును గభీరకావ్యముభావంబుcగనిపెట్టలేక కావ్యమును దూషించును. అది కావ్యదోషమగునా? ఇప్పటివారిలోc గొందఱు దమకుం దెలియునట్లు గ్రంథములు వ్రాయవలయునని తలంచుచు నట్లు చేసెడివారు. వార లీపద్యమునకు లక్ష్యభూతులు.

గీ. ఫల్గుయాచ్నావచనములపష్ఠతికిని | హాలహలమునకును గలయట్టితొర,
తమ్ము మెఱిఁగినదొక్కటే త్వద్రసజ్ఞ | త్రిపురహర హర సర్వజ్ఞ దేవదేవ.
ఓదేవి వినుము.

గీ. పరమ మగుమూర్తి యాచనాపత్థతికిని | యాచనయకానిద్రవిణప్రహానిగాదు.
హరుఁడు కాపీనవంతుఁ డైపరఁగుచున్న| రూఢిఁ జెన్నొందుఁబర మేశ్వరుండనంగ.

గీ. సేవ సుఖములు;వ్యసనంబు సిరులు;యాచ్న|గుణములను; దుష్టపతిప్రజాగణము;శిష్టు
శీలుఁ డౌపుత్రుఁడు కులంబు చెఱుచుటకును| మూలఘాతకుతారసమూహమరయ.

కాన దారిద్ర్యంబు గలిగియుండినను రాజునకుం జెప్ప నాకు శక్యంబు గాదు.

క. జలదంబు సర్వజనులకు | లలిఁ బోవుచుఁ జేయుఁ బ్రియ మిలన్ క్షణమున ని,
స్తులగతిఁ గరములఁ బఱపుచు | జలజాతహితుం డొనర్చు సంతాపంబున్.

దేవి వైశ్వదేవాసరమునఁ జనుదెంచినవారు క్షుధార్తులు నిరాశులైచనుటనాహృ
దయంబును బాధించెడిని.

క. దారిద్ర్యానలతాపము | చేరినసంతోషవారిచే శమియించెన్,
భూరితరయాచకాశా | భారవిఘాతోరుతాపభర మెట్లోర్తున్.

అని చెప్పఁగా రాజది యంతయు విని యిప్పు డేమియు నియ్యం దగదు ప్రా
తఃకాలంబున బాణుని మనోరథంబులు పూర్ణములు గావింతు నని యనుకొనుచు నాయిలు
వెడలి యి ట్లనుకొనియె.

క. వాగ్మిఁగాఁ జేయనట్టికావ్యంబు లేల | పదము గావంగలేనట్టిబలము లేల,
యాచకావళిఁ దనకుఁ దుల్యముగఁ జేయ |. నట్టిమితిలేనిధనములగుట్టలేల.

ఇట్లు పురంబునందుఁ పరిభ్రమించుచుండఁగా మార్గంబున నిరువురు దొంగలు స
నుచు మాటలాడుకొనుచుండిరి. అందు శకుంతుం డనువాఁ డి ట్లనియె. చెలికాఁడా !
అర్గలంపుంగటికిచీఁకటులు మెండుకొనియుండినను జగంబునం దంజన ముండుటంబట్టి ప
రమాణుప్రాయం బయినధనంబును సయితి మంతయు నెల్లయెడలఁ గనుగొందును. అయి
నను కోశగృహంబువలనిధనము నాకు సుఖావహము గా దని తలంతు. అనిన మరాళుం
డనురెండవాఁడు కోశగృహంబువలనం గొనితెచ్చినధనకనకజాతంబు సయితము నీకు సు
ఖావహంబు గాదని యేకారణమువలనఁ బల్కెద వని ప్రశ్న సేయ నందుకు శకుంతుం డి
ట్లనియె. అంతటను నగరరక్షకులు పరిభ్రమించుచున్నారు. వీరలభేరీపటహాదులశబ్దము
చేత నెల్లవారు మేలుకొనియున్నారు. కాన నాహృత మగుధనమును విభాగించి వానివా
నిపాలికి వచ్చినధనమును గైకొని వైళంబ చనవలయు. అనిన నందు మరాళుండు చెలి
కాఁడా కోటిద్వయపరిమిత మగుమణికనకజాతంబుం గొని నీ వేమి యొనర్చెదవు? అని

యడిగిన శకుంతుం డీధనంబు నొకవిప్రునికి వేదవేదాంగపారంగతుని కతం డన్యుని వేఁడవలసినట్లు లేకుండ దృప్తికరముగ నొసంగెదను. అని ప్రత్యుత్తర మిచ్చిన విని మరాళుం డిట్లనియె. చెలికాఁడా! మంచిది!

గీ. దాన మొసఁగుచునుండ యుద్ధంబు సేయఁ। బఠన మొనరించుచుండంగఁబరులకొగిని,
తనకుఁ బులకలువొడముముదమ్ము సేయు। నదియదానంబుపౌరుషంబదియశ్రుతము.

ఓరి యిట్టిదానంబుచేత నీకుం బుణ్యయం బెట్టు లగును; అని యడిగిన శకుంతుండు చౌర్యంబున ధనసంపాదనము సేయుట మాకుఁ బితృపితామహాదిపరంపరాప్రాప్త మగుధర్మము. అని చెప్పఁగా మరాళుండు శిరచ్ఛేదంబునకు సయిత మొడఁబడి సంపాదించిన ధనము నంతయు నిచ్చు మానసం బొప్పునే యనఁగా శకుంతుం డిట్లనియె.

† గీ. నరుఁడు మూర్ఖుండు దారిద్ర్యభరమునకును। మానసంబున శంకించి దాన మీఁడు.
ప్రాజ్ఞుఁ డగువాఁడు దారిద్ర్యభరము గల్గు। ననుచు శకించి యిచ్చును ధనము నాస.

గీ. వేదమయుపాత్ర మెంతేని గాదువరము। పాత్రముతపోమయంబు నాపగదిఁబొలుచు,
పాత్రములలోన నుత్తమపాత్ర మగును। శూద్రునన్నంబుఁ గుడువనిశుద్ధయశుఁడు.

అని చెప్పి రోరి నీ వీవిత్తంబుచే నేమి చేసెద వని యడిగిన మరాళుం డిటనియె. చెలికాఁడా వినుము; కాశీదేశవాసి యగునొకబ్రాహ్మణబ్రహ్మచారి యిచ్చటికిం జనుదెంచె, అతఁడు నాతండ్రియెదుట కాశీవాసఫలంబును వర్ణించెను. అంత నాతండ్రి బాల్యంబుందొట్టి చౌర్యం బాచరించుచున్నవాఁడు దైవవశంబునం దనపాపంబువలన నివర్తించుకొనికుటుంబంబుతోడఁ గాశీనగరంబునకుం జనం బోయెడిని. ఈధనసంచయం బందులకు; అనిచెప్పఁగా శకుంతుండు నీతండ్రి కరంబు భాగ్యంబు గలవాఁడు ఎట్లనిన? చెప్పెద వినుమని యిట్లనియె.

గీ. శ్రీయుతం బగువారాణసీపురమున। వాస మొనరించి తద్వ్యాసనాసమేత,
హృదయమై యొప్పుచుండెడివేపితోడ। సమతఁ గాంచునె యీపాకశాసనుండు.

గీ. ఆరయంగను కర్మసస్యంబులకును। క్షేత్ర మూషర మౌను కాశీపురంబు,
పండితులకును చండాలమండలమున। కేకరీతిని మోక్ష మదిందుఁ గల్గు-

గీ. అందు మరణంబు మంగళంబైయొసంగు। భూతియువిభూషణంబయి పొలుపుమీఱు,
మల్లకము శుద్ధకాశేయమహిమఁ గాంచుఁ। గాన నాకాశిబోల్ప నా దేనితోడ.

అని యి ట్లాయిరువురు సంవాదంబు సలుపుచుండుట విని రాజు మనంబున సంతసించుచుం గర్మంబులగతి సర్వవిధంబుల విచిత్రంబై యుండు. ఇరువురమతియు విశుద్ధంబయి యున్నది యని తలంచుకొనుచు వారల వెంబడించుటవలన నివర్తించి యొకయిం

టం బిడ్డపుత్రులం గాంచెను. అందుఁ దండ్రి కుమారుని కి ట్లనియె. రాజిప్పుడు శాస్త్రత త్వం బెఱింగినవాఁ డయ్యుఁ గృపణుం డగుటంజేసి యేమియు నీఁడు. మఱి

గీ. అర్థికవనము సేయఁ దా నట్లు సేయు| పఠన మొనరింపఁ దాను బఠన సేయు,
స్తుతులు సల్పిన స్తుతి సల్పు నతులబుద్ధిఁ|బోదునవమానిరైయెమూఁగపోల్కి నుండు.

రా జది విని యతనిసమీపమునకుంజనియింకనిట్లు చెప్పకుమనితనయొడలిసొమ్ముల వీడ్చి యొసంగి యంతం దనభవనంబు సేరి కాలాంతరంబున సభయందుం గూరుచుండి కాళిదాసునిం గాంచి యి ట్లనియె.

గీ. కవులమానసమును గొల్తుఁగడఁకఁ దాఁటు | నల్లసత్ప్రభిభాంబుపూరోపగతము,

అనిచెప్పఁగాఁగవియు.

దైనయతోప్రతమునఁబక్షులట్లుపదియు | నాల్గులోకంబులును ఖేలనంబుగాఁగ.

అని వచించెను. అంత రాజు ప్రత్యక్షరమునకు లక్షముక్తాఫలంబులునొసంగెను.

అంత ద్వారపాలకుండు సనుదెంచి రాజా కౌపీనావశిష్టుండు కవి యొకండు ద్వారంబున నున్నాఁ డని చెప్పి రాజుముదల గైకొని ప్రవేశపెట్టెను. కవియుం జనుదెంచి స్వస్తి యని పలికి చెప్పంబడకయ కూరుచుండి యి ట్లనియె.

ఉ. మేరుగిరీంద్ర మియ్యెడన మేకొనియున్నది యేడు సంద్రముల్,
భూరము డించి యియ్యెడన భాసిలుచున్నవి నిస్తులంబు గా,
భూరితరంబులై యొసఁగుభూతములం గలిగించి దాల్చు నీ,
ధారుణి యియ్య దియ్యెడయ స్థానముపో మనబోటివారికిఁ.

అనిన విని మహాకవీ నీనామం బెద్ది యని రా జడగఁగాఁ బండితులకుఁ బేరు చెప్పుట యుచితంబు గా దట్లయ్యును దెలిసికొనఁ గలవేని చెప్పెదు.

గీ. మతి స్తనంధయి యైనది మహితవచన | సరణిగంభీరతను గాంచఁ జాల దెపుడు,
జలధితలమును గన్గొనఁ గలదె యరయ | వైణవియష్టి యిలలోన వసుమతీశా.

అని చెప్పి యి ట్లనియె.

చ. † రతికలహంబున న్విఱిగి రాలినకంకణ మిందురేఖికఁ,
చ్యుత మగుదాని గుండ్ర నయి చొప్పడఁ జేసి హసించి దంతసం,
గతసితకాంతిఁ గూర్చి యలగౌరియు భర్తకుఁ జూపెఁ గేళికా,
సితకరుఁ డంచు నాగిరిజ సేయుతఁ గాంతుఁడు దాను సేమముల్.

శ్లో. † చ్యుతా మిందో ర్లేఖాం రతికలహభగ్నంచ వలయం సమం చక్రీకృత్య ప్రహసితముఖీ శైలతనయా | అవోచ ద్యం పశ్యేత్యవతు గిరిశ స్సాచ గిరిజా సచ క్రీడాచంద్రః దశనకిరణాపూరితతనుః ||

అనఁగాఁ కాళిదాసుండు చెలికాఁడా క్రీడాచంద్ర చిరకాలంబునకుం గనంబడితి వి. ప్రతిమండలంబునను రాజులు కడుధనవంతులు విరాజితు లగుచుండఁగా నీ కీవిధ మగుదశ యేమి ? అని యడిగినఁ గ్రీడాచంద్రుం డి ట్లనియె.

గీ. దానవిభవంబు లేనట్టిధనికు లెల్ల | కడుదరిద్రులలోఁ దొ_ల్తె గణన సేయఁ,
బడుదు రంబుధి తృష దీర్పఁ గడఁగకునికి|మరువు గాదె జలంబులుసురగకున్న.

గీ. భోగమునకు భయముఁ బొందుచు ధనముల| గడన సేయుచుండు వెడఁగునింటఁ,
గన్యకావతంసకమ్ము తెఱంగున | పరుల కొఱకె యర్థభార ముండు.

గీ. కనకమణిమయ కేయూరకలితదండ | రములఁ బెఱభూమిపతులు ధరం గడించు,
పదవి భోజుండు సారాంశ మెద నెఱుంగు|వాఁడుగావునఁగలచేత వసుధఁగాంచె.

గీ. భువి విదగ్ధులకూడిక బొసఁగునప్పు | డమృతమయములయట్ల కావ్యంబు లమృత,
మొగినిదొరఁగును వెలయాంధ్ర తెగలజవ్వ|నములతెఱఁగునని ర్వ్యాజనయములగుచు.

గీ. ఎప్పటికి గాని పేరేని నెఱుకపడదు | నరపరునికిని గవితవినాఁగ నిలను,
నరపతివినాగఁ గవికిని ధరణియందు | బరఁగఁ బోదు సుమీ కీ_ర్తి నిరతముగను.

అనిన విని మయూరుండు డి ట్లనియె.

గీ. కావ్యకల్పన చేసినభవ్యమతులు | కావ్యములఁ జెప్పఁబడినట్టిఘనులు మఱియు,
భువి మహాత్ములు వంద్యులు పూజ్యు లరయ | వారికీ_ర్తియ కను స్థైర్యవైభవంబు.

వరరుచి యి ట్లనియె.

చ. పదములవ్య_క్తిచే హృదయభావముఁ దెల్పుబుధేంద్రుబుద్ధియే,
సదమలబంధ మాకవులసాధుపథంబునఁ బోవ నేర్చుఁబో.
విదితరతిక్రియావ్యసనవిశ్రుతిఁ గాంచదెపోఁగులాంగనల్,
ముదమునఁ జూచుమాపు వెలముద్దియ కయ్యది యబ్బునే ధరన్.

రాజు క్రీడాచంద్రుని కిరువదియొకగజేంద్రంబులను ఐదుగ్రామంబులు నొసంగె. అంతఁ గవి రాజును స్తుతించుచున్నాఁడు.

క. కనుదోయిఁ గంగణంబును | పనుపడెఁ దిలకంబు హ_స్తపల్లవములలో,
ఘనభూషావైచిత్ర్యము | గన భోజ భవద్విరోధికాంతల కౌరా!

---

రతికలహంబునందు విఱిగి కంకణ మొకటి రాలఁగా నప్పుడు శిరమునుండి జాఱిన చంద్రరేఖను విఱిగినకడియమును రెంటినిగూర్చి గుండ్రనగాఁ జేసి కాంతిలేనిభాగము గా నుండువలయమునకుఁ దక్కినచంద్రభాగముతో సమానముగ గాంతి గలుగునట్టులు మందహాసంబున వెలివడుదంతకాంతులను వలయభాగమునకుం గూర్చి వీఁడు క్రీడాచంద్రుం డని చెప్పుచు సంతసించుచునుమాదేవియుహరుండును రక్షించుగాత. ఇదితాత్పర్యము.

అని స్తుతించుటకు సంతసించి రాజు ప్రత్యక్షరలక్ష నొసంగె.

అంతం జరాజీర్ణసర్వాంగసంధి పండితుండు రామేశ్వరుం డనువాఁడు సభకుం జనుదెంచి యి ట్లనియె.

క. పంచాననసుకవుల కిల । నంచితగజమాంసముల నరాధిపుసిరులన్,
సంచితమై తగుఁ బారణ । కొంచక యుపవాస మెప్డు గొనువారలకున్.

క. వారువములఁ బండితులను । జేరుచుకొనఁగలరు పరులు శ్రీగలవారల్,
వారణవరములఁ గవులను । గూర్చి పోషించువాఁడు కుతలాధిపుఁడే.

ఇది యివ్విధంబ యగు.

క. వెలయాంధ్రకుఁ గనకాంబర । ములఁ గాంచనభూషణముల మొనసెడుశోభల్,
కలితపరాక్రమధుర్యత । నలఘుత్యాగమునఁ బెలుచ నగు రాజులకున్.

అని చెప్పఁగా విని రామేశ్వరపండితునికి నాభరణంబు లెల్ల వీడ్చి యిచ్చి రెండు లక్షలధన మొసంగెను. అంతం గవి యి ట్లనియె.

గీ. భోజ నీకీర్తికాంతకు రాజమాన । ఫాలభాగస్థితం బయి పరఁగునట్టి,
రమ్యమృగమదతిలకంబురహిని నభము । గానిపించుచునున్నది ఘనము గాఁగ.

గీ. బుధుని యెదుటను గుణములఁ బొగడఁ జనదు । వాఁడు సర్వంబు నెఱిఁగినవాఁడు సూవె.
మూర్ఖు నెదుటను జెప్పంగ మొనయఁ జనదు । చెప్పిన నెఱుంగలేఁడు సుమ్మెప్పటికిని.

అని చెప్పఁగా నెల్లవారు నబ్బురంపడిరి. రామేశ్వరకవి మఱియు ని ట్లనియె.

గీ. కావ్యకల్పనమాత్రంబ కవి యొనర్చు । ఖ్యాతిఁ గల్పించు సుజనాగ్రగణ్యుఁ డరయఁ,
గమలమును బెంచు సలిలంబు కాంతియుతము । సేయఁగలవాఁడు రవియుపో చెలిమితోడ.

అంత సంతసించి రాజు ప్రత్యక్షరమునకు లక్షధనం బొసంగెను. కవి రాజేంద్రునిం గాంచి యి ట్లనియె.

క. కీర్తిని గోరక కృపణుఁడు । వర్తించుచుఁ గవిత వినఁడు వామాక్షిఁ బురో,
వర్తిని శ్రీసుందరిసమ । మూర్తిని గొని షేడి యేమి మొనయును సేయున్.

అంత సీత యనునది యి ట్లనియె.

గీ. కవులు దైవనిహతిఁ గాంచినవారలు । గజము లవి వరాకగతులు దలఁప,
మండలేంద్రవర్యమందిరముల వినా । గా మఱొండుచోటఁ గలవె వెలయ.

అంతం గాళిదాసుం డి ట్లనియె.

గీ. దానహీనుఁ డైనమానవుహృదయంబుఁ । గవులవచన మెపుడు లవము సొరదు.
కరము వృద్ధుఁ డైననరునికి జవ్వని । సేయుచిన్నె లార్తిఁ జేయుఁ గాదె.

రాజు ప్రతిపండితునకు లక్షధనం బొసంగెను.

అంత నొకనాఁడు భోజరాజు సభకుం జనుదెంచుచుండువానిం గాళిదాసునిం గాంచి యెల్లకవులకు నధికుండైనయితఁడు వేశ్యాలోలుండై యున్నాఁడే యని మనంబున నించుక ఖేదపడియెను. అప్పుడు విద్వద్బృందవందిత యగుసీత యేనియభిప్రాయం బెఱింగి యి ట్లనియె. దేవా!

క. గుణవంతునందుఁ గలదు । ర్గుణముం గని భిన్నబుద్ధిఁ గొన రొకనాఁడున్,
గుణరాగులు ప్రేమంబున । గణియింత్రు కళంకి మిందుగతముం బోలెన్.

అని చెప్పిన రాజు సంతసించి సీతకు లక్షధనం బొసంగె. ఆ ట్లయ్యును గాళిదాసునిఁ దొల్లిటిచందంబున సన్మానము సేయకుండఁగాఁ గవి యేనియభిప్రాయం బెఱింగి తులావ్యాజంబున ని ట్లనియె.

గీ. తుల ప్రమాణపదవి గలిగినదానవు । గర్వకలన నీకుఁ గాదు కొనఁగ,
కడు గరిష్ఠు నొకని నడుగున కంపెదు । తదితరుని మహోచ్చతరునిఁ జేతు.

అని చెప్పి మఱియు ని ట్లనియె.

గీ. ఎల్లచోటుల నెవనికిఁ జెల్లుబడియు । గలవొ వాఁడు స్వదేశరాగంబుచేత,
నేల ఖేదంబుఁ జెందఁగా? నెవఁడు గ్రోలు । జనకుకూపం బనుచు క్షారజలము లవని.

అని పల్కు రాజు త న్నొప్పరికించుట యెఱింగి దుర్మనాయమానసుండై తనయింటికిం జనియె.

క. ప్రేమ మవజ్ఞాస్ఫుటితం । బైనహి వెండియును జక్క నగుట యరుదు పో,
మ్మామ ముత్తియమ్ము పగిలిన । నేమాడ్కిని గూడు లక్క నెనయిఁకఁ గనినన్.

అంత రాజును ఖిన్నుండై యుండె. లీలావతి యది గాంచి విషాదంబునకుం గారణ మే మని యడిగిన రాజు సర్వంబును వృత్తాంతంబు నాదేవికిం దెల్పినఁ గాళిదాసు నవమానము సేయుటకు ఖేదపడి యి ట్లనియె. ప్రాణనాథ నీవు సర్వజ్ఞుఁడవు.

చ. చెలిమి యొనర్పకుండుటయ చింతిలఁగా వరమై యొసంగు నా,
చెలిమి యొనర్చి భేదమును జెందుట యన్నది లగ్గు గాదు పో,
యిల వృతనేత్రుఁ డౌమనుజుఁ డెంతయు ఖేదము నొందుఁ గాని లో,
పల జనుపాంథుఁ డొందునె యభంగురఖేదము నొక్కనాటికిన్.

అదియునుఁగాక కాళిదాసుండు భారతీదేవిపురుషావతారం బొకటి గాన నాతని విద్వాంసులకంటె నధికముగ నెల్లవిధంబుల గారవింపుము. చూడుము.

గీ. కూర్మి దోషాకరుండయ్యుఁ గుటిలుఁడయ్యు । నోలిమిత్రావసానకృతోచ్ఛ్రయుండు,
నై కళంకియు నగుశశి హరుఁడు గూర్చు । నాశ్రితుఁ డగుట గుణదోష మరయఁ జనదు.

అది విని రాజు ప్రియురాలా యడి యంతయు సత్యమే. ఎల్లి కాళిదాసుని ప్రాతః కాలంబునన సంతోషపెట్టెదను. అని చెప్పి మఱునాఁడు దంతధావనాదులు దీర్చుకొని నిత్యకృత్యంబులు నిర్వర్తించి సభకుం జనుదెంచెను. పండితులును కవులును గాయకులును మఱియుం గొందఱు ప్రకృతులును సభకుం జనుదెంచిరి. కాళిదాసుం డొక్కరుండు రాకయుండం గాంచి తనసేవకుని నొక్కని కవిం బిలువ నంపఁగా వాఁడు వేశ్యాగృహంబునకుం జని కాళిదాసునిం గని ప్రణమించి యోకవీంద్రా ! భోజనరేంద్రుండు నిన్నుం బిలుచుకొని రమ్మనె ననఁగాఁ గవి విని తనమనంబున నిట్లు చింతించె. గడిచినదినంబునందు రాజు నన్నవమానితుం గావించె. ఇప్పు డింత లేఁబ్రొద్దునన పిలుచుటకుం గారణ మేమి ?

క. నరనాథుఁడు సభలో నొరు | వరునెన్నఁడుఁ గారవించు నర్మిలి మీఱన్,
దిరముగ నాతని దఱుమన్ | గరము ప్రయత్నించు రధిపగౌరవకలితుల్.

మఱియు నేను ప్రత్యహము రాజుచే బహుమానింపంబడుచుండ మాయావులు మచ్చరంబుం గొని వైరంబు బోధించెదరు. అని విచారించుచు సభకుం జనుదెంచె. అట్లు సనుదెంచుచుండువానిం దవ్వులన కాంచి యానందంబుతో నాసనంబు విడిచి లేచి ఓసుకవీ నామిత్రమా యిప్పు డేల జాగొనర్చెదవు అని పల్కుచు రాజు నైదా అడుగు లెదురునడిచెను. అంత సభ యంతయు నాసనంబులనుండి లేచెను. సభాసదు లెల్లవారు నాశ్చర్యపడిరి. ఇతని వైరులమోములు వెలవెలబోయె. అప్పుడు తనకరంబునఁ గవివరునికరంబుం బట్టుకొని తనసింహాసనముకుఱంగటికిం దోడ్తెచ్చి యాతని నా సింహాసనంబునం గూరుచుండం బెట్టి యతనియానతి వడసి యంద తానును గూరుచుండె. కాళిదాసుండు రాజసింహాసనంబెక్కుడు బాణకవి దక్షిణబాహు వెత్తి యిట్లనియె.

గీ. కాళిదాసునిఁ గడుర క్తి గారవించు | కతన భోజుండు రుద్రుఁడే కళ లెఱుంగు,
వాఁడు దోషాకరుండైనవాని రాజు | విబుధులందును గలిపెఁగా వేఱ్కతోడ.

అని చెప్పఁగా నాటంగోలె కాళిదాసునిపైఁ గవులకెల్ల వైరానలంబు వెలుంగం దొడంగిన నాపండితులు కాళిదాసుండు లీలావతితోఁ బోవుచున్నాఁ డని కపటోపాయంబున రాజునకుం దెల్ప భోజుఁడు.

గీ. వాసవునిగర్జితంబు నశ్వప్లుతంబు| భామలమనంబు పురుషులభాగ్య మధికవర్షణం, బును సట్టు లవర్షణంబు | దేవుఁ డెఱుఁగఁడు మనుజుఁ డదేమి యెఱుఁగు.

అని తలంచి నమ్మి కవిని దనదేశమ్ము వెడలిపొ మ్మనఁగాఁ గాళిదాసుండు తన యందుఁ గవులు చేసినకపటం బని యెఱింగి,

గీ. అల్పసారము లవియుఁ బెక్కైయ్యె నేని । వానిసమవాయమది ద్రోయవశము గాదు
తృణచయంబులు రజ్జువై దృఢతఁ గాంచు । గిరులయూథంబు దానిచేఁ గట్టఁబడును.

అని తలంచుచుండఁ గాళిదాసుని వేశ్య,

గీ. కనుఁగొనంగను సుఖము దుఃఖంబు రెండు । దర్పణమునఁ బ్రతిచ్ఛాయ దవిలినట్లు,
లెవనియందును దవులునో భువిని వాఁడె । పరమమిత్రం బనం జను ప్రాణనాథ.

అని చెప్పినను గాళిదాసుం డూరు వెడలి పోయెను. అంత స్వభవనంబుం జేరిన రాజుం గాంచి లీలావతిదేవి.

క. కొననుండి యిక్షువున కొగి । ఘనమయి పెంపొందు రసము గణుపుగణుపునం,
దనఘుల మైత్రియు నట్లే । చను విపరీతము లసాధుజనములచెలుముల్.

గీ. శోకవైరిపరిత్రాణశోభనంబు । ప్రీతివిస్రంభభాజనఖ్యాత మిదియు,
రత్న మగు మిత్ర మనునక్షరద్వయంబు । సృష్టిచేసిన దెవ్వఁడో విష్టపమున.

అని నుడువఁగా భోజుఁడు తనకు దేవియందుం గలసంశయంబుఁ దెల్పి యగ్ని విశుద్ధయయినయా దేవినిం గైకొని యతిదుష్కరప్రయత్నంబున వెండియుం గాళిదాసునిం బడసె. కాళిదాసుండు లేనికాలంబునఁ దక్కినకవులు సెప్పినపద్యములు.

క. సామాన్యవిప్రవైరము । భూమిని కులమునకు హాని బొందించును పో,
శ్రీమహితు నమాతుల్యునిఁ । దామె ద్వేషించి కవులతండము సెడియెన్.

క. రణముల భటులకుఁ గవికుల । మణులకుఁ దలఁపంగఁ గవులకొండలములలో,
గుణదీప్తి దీప్తిహానియు । క్షణమాత్రములోనఁ గలుగుఁ జయ్యనఁ జూడన్.

క. ఒకరాజహంస ముండినఁ । బ్రకటితమగు శోభ గలుగు భాతి సరసికిన్,
బకము లవి వేనవేలై । నికటస్థలి నిండి యున్న నెఱియునె చెప్పుమా.

ఇట్లు సెప్పుకొనుచుఁ గవులు భోజరాజు సెప్పినసమస్యను బూర్తిసేయలేక పట్టణంబుం బాసి పోవుచుండఁ గాళిదాసుండు తనమనంబున.

గీ. ఏమి పౌరుష మార్తుల నేలఁడేని । యేమి ధన మది యర్థుల కియ్యఁడేని,
ఏమి క్రియ యది హితయుక్తి నెనయదేని । ఏమి బ్రతు కది సద్వైర మెంచె నేని?

అని చారణవేషంబున వారలం గాంచె. మఱియు రాజుతో వైరము సంభవించి యున్నప్పుడు విలాసవతి కాళిదాసునికిం జెప్పినపద్యంబులు గలవు.

గీ. విప్లవంబు పురుషవిసరంబునకుఁ గల్గఁ । బరిమితంబు సకలభావ మగును,
మారుతంబు వీవ మలకను తూలసం । తతికి భేద మొగిని దనరు భువిని.

గీ. స్వజనబంధుమిత్రసంతతిఘనబుద్ధి | బలయులందు సారకలన నెఱుఁగు,
బహుళదుఃఖనికషపాషాణ మైనట్టి | మానవుండు భూమిమండలమున.

క. ఇడుములు ప్రార్థనలేకయ | యొడఁగూడెడురీతి సుఖము లొడగూడును పో,
తడయక మానవునికి నిలఁ | గడుకొను దైన్యంబు వెలుచఁ గన్పడుచుండున్.

కాళిదాసుం డెడఁబాయక యుండుటం బట్టి భోజుఁ డొకపతి విలాసవతి నిట్లు పొగడెను.

† గీ. ఈవిలాసవతియె యెంచఁగా ధన్య రా | లెపుడు కాళిదాసుఁ డెనఁగుచీని,
గుణనిబద్ధుఁ డగుచుఁ గూర్మిఁ బంజరబద్ధ | శుకమురీతి నుంపుఁజూవె యింగు.

అంతం గొంతకాలంబు జరఁగఁగా నొకప్పుడు రాజు సంధ్యాకాలంబుం గాంచి యి ట్లనియె.

క. జలనిధిఁబడియెఁ బతంగుఁడు,,
అని చెప్పఁగా బాణకవి యి ట్లనియె.
జలజంబులయుదరమందు సారంగింబుల్,,
అంత మహేశ్వరుం డనుకవి యి ట్లనియె.
పులుఁగులు తరుకోటరములు,,
అంతం గాళిదాసుం డి ట్లనియె.
ఎలజవ్వనులందు మదనుఁ డించుంచుకగాన్.

అది విని రాజు ఒక్కొక్కనికిని లక్షలక్షఘన మిచ్చి నాల్గవచరణమునకు రెండు లక్ష లొసంగెను.

ఒకప్పుడు రాజు బహిరుద్యానమార్గంబున నెరురేగుదెంచుచుండువాని నొకవి ప్రునిం గాంచి వానిచేతం జర్మమయం బైనకమండలువుం జూచి వాని నతిదరిద్రునిం గా నెఱింగి ముఖశ్రీచేత వెలుంగుచుండుటయుం బరికించి వారుపంబును వానియెదుట నిలుపుకొని యో బ్రాహ్మణుఁడా చర్మమయ మగుపాత్రం బేల దాల్చెద వని యడుగఁగా నావిప్రుండు ముఖశ్రీవలనను మృణ్మాత్రవలనను భోజుం డని యారసి యి ట్లనియె. దేవ వదాన్యశిరోమణి భోజుఁడు పృథివిని బాలింప లోహంబును తామ్రంబును లేకపోయె

---

† ఈగ్రంథము యొక్క 91 వ పేజిలోనుండు  ఈగుర్తు మొదలుకొని యింతకులోపల నణఁగియుండు కథ నేనురచియించిన వినోదకథాకల్పవల్లియందు నాట కచ్ఛాయలో విశేష రసావహముగ ననేకకథలతోఁజేర్చి విస్తరింపఁబడియున్నది. అందుం జూచుకొనవచ్చును. చర్వితచర్వణంబున రసంబుండదని యియ్యెడసంగ్రహించితి.

ననఁగా రాజు భోజుఁడు శాసింపఁగా లోహతామ్రాభావంబునకుం గారణం బేమని య డిగెను. అందుకుం గవి యిట్లనియె.

క. ధరణిని భోజుం డేలఁగ । నరవితతికి దుర్లభంబు నాఁ బరఁగెను రెం, డరిశృంఖలముల నినుమును । పరశాసనపఙ్క్తిఁ దామ్రవర్గము భువిలోన్.

అది విని సంతసించి రాజు ఆవిప్రునికిం బ్రత్యక్షరలక్ష యొసంగె.

ఒకప్పుడు ద్వారపాలుండు ఓధారాధినాథ! దూరదేశంబునుండి వచ్చి యొకవి ద్వాంసుండు వాకిట నున్నవాఁడు. ఆతనిపత్నియు సపత్నీకుం డగుపుత్రుండును వచ్చి యున్నవారు. ఆయతిపవిత్ర మగువిద్వత్కుటుంబము వాకిట నున్నది యనఁగా రాజు తనమనంబున శారదానుగ్రహపత్తి కరము పెంపువడసినది యిది యబ్బురం బనుకొనుచుం డఁగా నాయవసరంబునందు గజేంద్రపాలకుండు చనుదెంచి రాజునకుం బ్రణమించి ఓ భో జరాజ సింహళదేశాధీశ్వరుండు నూటయఱువదిగజేంద్రంబులను పదునాఱు మహామణు లను వంపె ననఁగా బాణకవి యిట్లనియె.

గీ. కవికులేంద్రుల కును మత్తగజములకును। నెలవు నృపగేహమొండె స్వనిలయమొండె, ప్రతిగృహంబునఁ గుక్కలపగిది వీరు । భూపతి విభూషితాంగులై పొల్తురేమి.

అంత రాజు గజేంద్రంబులం గాంచుటకు వెలికిం జనియె. అప్పు డావిద్వత్కుటుం బంబుం గాంచి చోళపండితుండు తాను రాజునకుం బ్రియుం డనియు తాను రాజభవనం బునడుమ సంచరింతు ననియు విద్వత్కుటుంబంబు ద్వారపాలకోపితం బయ్యె వెలుప లన యున్న దనియు గిర్వాంబుం జెందఁగా నది యెఱింగి చోళపండితుని సౌధాంగణము నుండి వెడలనడిచెను.

అంత నొకవిద్వాంసుండు సనుదెంచి యిట్లనియె.

గీ. తపమునఁ బన సంపదలు గల్గు నందురు । భోజ కల్పవృక్షరాజ మైన, నీవు మాకుఁ బ్రీతి నేత్రగోచరతను । గాంచునట్టితపము గానఁ బడదు.

అనిచెప్పఁగా వానికిం బదియేనుఁగుల నొసంగె;

అంత నొకబ్రాహ్మణుండు భుంభారవంబుఁ గావించుచుం జనుదెంచెను. ఎల్ల వార లది గాంచి సంభ్రమపడిరి. రాజునెదుటికిం గొనిపోఁబడి యేల భుంభారవంబుం గావించెద వని ప్రశ్నచేయంబడినవాఁ డగుచు ని ట్లనియె.

గీ. ధరణిలోఁ ద్వదీయదానపయోరాశి । మునుఁగుచుండు పేదతనమునకును, కరము నూఁత యిచ్చి గాచువానిని గాన । నే నొకండ యభయ మిచ్చువాఁడ.

అది విని సంతసించి రాజతనికి ముప్పదిగజేంద్రంబుల నొసంగె,

అంతఁ బత్నీసహితుండు విలోచనుం డనువిద్వాంసుం డొక్కరుండు సనుదెంచి రాజునకు స్వస్తియని చెప్పి యి ట్లనియె.

క. నిజగజేంద్రపఙ్క్తి నెమ్మితో నిచ్చెదు । భోజుఁ గాంచి గిరిజపుత్రుఁ డైన,
యాగజేంద్రవదను నరుపదంబును భీతిఁ । గొనుచు నాసఁ గాముకొనఁగఁ దివురు.

అది విని రా జతనికి నేడుగజేంద్రంబుల నొసంగె. తనయెదుట నల్లె యుండినవిద్వత్కుటుంబముం గాంచి యందు బ్రాహ్మణుని కి ట్లనియె.

సమస్య. *చ,, ఘనులపనుల్ సుసత్త్వమునఁ గాని ఫలింపవు సాధనంబులన్,,
ఈకైపదము పూర్తిచేయు మనఁగా బ్రాహ్మణుఁడి ట్లనియె.

చ. † జననము ప్రవ్వయందుఁ; బరిచారకపఙ్క్తి మృగాళి; వాసమో,
వనమున; భూర్జమే వలువ; వావిరి యన్నము కందమూలముల్,
తనర నగస్త్యుఁ డాజలధిఁ దాఁ గొనియెఁ జులకంబునందుఁ బో,
ఘనులపనుల్ సుసత్త్వమునఁ గాని ఫలింపవు సాధనంబుల్

అంత రాజు బహుమూల్యంబు లగుపదునాలుమణులను ఆవృద్ధద్విజుని కొసంగి యా తనిపత్నిం గాంచి యోయంబా నీవును పఠింపు మన బ్రాహ్మణి యి ట్లనియె.

చ. ‡ తన రథచక్ర మొక్కటియు; చక్రములు బూన్చిన యేడుగుఱ్ఱముల్,
తనపద మూనఁ గూటనిపథం బది; సారథి పాదహీనుఁ డౌ,
దినమణి యభ్రమార్గము తుదిం గనుచుండు నపార మయ్యుఁ దా,
ఘనులపనుల్ సుసత్త్వమునఁ గాని ఫలింపవు సాధనంబులన్.

రాజు సంతసించి పదునేడుగజేంద్రంబుల నేడురథంబుల నాపాలుర కొసంగె.
బ్రాహ్మణపుత్రునితో నీవును పఠింపు మనఁగా ద్విజపుత్రుం డి ట్లనియె.

చ. § వనుపడలంక జేయ మది; పస్తరణీయము వార్ధి; రావణుం,
డనుపమశక్తి వైరియు; సహాయులు యుద్ధమునందు వానరుల్,
మనుజుఁడు దాఁబ దాతి; క్షణమాత్రన రాక్షసపఙ్క్తిఁ గూలిచెన్,
ఘనులపనుల్ సుసత్త్వమునఁ గాని ఫలింపవు సాధనంబులన్.

---

సమస్య. * క్రియాసిద్ధిస్సత్త్వే భవతి మహతాం నోపకరణైః॥

† శ్లో. ఘటో జన్మస్థానం మృగపరిజనో భూర్జవసనః వనేవాసః కందాదికమశనమేవం విధగుణః । అగస్త్యః పాథోధిం యదకృత కరాంభోజకుహరే ॥ క్రియా ............

‡ శ్లో॥ రథస్యైకం చక్రం భుజగయమితాస్సప్త తురగాః । నిరాలంబో మార్గశ్చరణవికలస్సారథిరపి । అగస్త్యః పాథోధిం యదకృతక రాంభోజకుహరే ॥ క్రియా............

§ శ్లో॥ విజేతవ్యా లంకా చరణతరణీయో జలనిధిః । ర్విపక్షః పౌలస్త్యో రణభువి సహాయాశ్చ కపయః । పదాతిర్మర్త్యో సౌ సకలమవధీద్రాక్షసకులం ॥ క్రియా.............

రాజును సంతసించి విప్రకుమారునికిం బదునెనిమిదిగజేంద్రంబుల నొసంగి యంత సుకుమారమనోజ్ఞంబు లగునిజానయనములయలంకారంబుతో శృంగారరసంబునకుం బొడమినమూర్తియుం బోలె చంపకలతయుంబోలె లావణ్యంబు గలగాత్రయష్టిగలిగి యొప్పారువిప్రస్నుషం గాంచి నిక్క మిది భారతీలీలావతారం బని తలంచి మానసంబున నమస్కరించి తల్లీ నీవు నొకయాశీర్వాదంబు పల్కు మని యడుగ నావిప్రకామిని దేవా విను మని యి ట్లనియె.

* చ. ధనువది పువ్వు; తుమ్మెదలదాఁటులు మౌర్వియు; చంచలాక్షిలో,
చనతతికోణముల్ శరము ; సంగడికాఁడు జడాత్మ చంద్రుఁ; డా,
తనుపరిహీనుఁ డంగజుఁడు ; తా జగమంతయు వే గలంచు పో,
ఘనులపనుల్ సుసత్త్వమునఁ గాని ఫలింపవు సాధనంబులన్.

అంత రాజు దాని చమత్కారంబునకు మెచ్చి లీలావతీదేవిభూషణంబులెల్ల వీడిచి యిచ్చి యనర్ఘంబు లగుసువర్ణమౌక్తికవైడూర్యప్రవాళంబుల నొసంగె.
అంత నొకప్పుడు సీమంతకవి యి ట్లనియె.

చ. దినమణి హూనుకొమ్ముఖరతేజము; మార్గము పాయు దీర్ఘతన్,
ఘనుఁ డగువింధ్యుఁడా కరుణఁ గాంచుము డగ్గఱ కేలుదమ్మి గ్రి,
క్కున; నని దవ్వు బాటి శ్రమ గుందెడికాంతలఁజూచి పల్కుచున్,
పనరుచు నుండ్రు భోజనృపవైరిధరేశులు మూర్ఛబోవుచున్.

అప్పుడు సువర్ణకారుం డొకరుండు ప్రాంతంబులం బద్మరాగమణులు పొదివిన బంగరుకుండను దెచ్చి రాజునెదుట నునిచెను. అంత రాజు సీమంతకవింగాంచి నీ వీసువర్ణభాజనంబును వర్ణింపుము ఇది యొకశ్రీలీలాసంఘం జూపుచున్నది యనఁ గాఁ గవి యి ట్లనియె.

క. ధారేశ నీప్రతాపో । దారప్రభ కోడి వేగ తరణి సరగునన్,
భూరిఘటవ్యాజంబున । నేరిమితో నీకు సేవ నెఱపెడిఁ గంటే
అంత రాజు పరితుష్టుండై యాపాత్రము నే ముక్తాఫలంబులనించి యతనికొసంగె

ఒకప్పుడు రాజు మృగయాసక్తుండై ముందుఁ బరువిడుచుండునవరాహంబుం గాంచి తా నొంటరియై కడువవ్వులకు వనాంతరంబునకుంజనియె. అయ్యెడ నొకబ్రాహ్మణునిం గాంచి యోబ్రాహ్మణుఁడా యెచ్చటకేగెద వని యడుగఁగా నతఁడు ధారానగరబునకుం

---

* శ్లో॥ ధనుఃపౌష్పంమౌర్వీమధుకరమయీచంచలదృశాం దృశాంకోణోబాణస్సుహృదపిజడాత్మాహిమకరః । స్వయంచైకోనంగస్సకలభువనంవ్యాకులయతి ॥ క్రియా....

భోయొదవని బదులు సెప్ప భూభుజుండొందు కయ్యెడ కేగెదవని యడుగ విప్రుండు భోజు నిం గనుఁగొని ద్రవిణంబు సంపాదించుకొనుట కని పల్కఁగా రాజును భోజుండు పండితునికింగాని యియ్యం డన నాద్విజుండు నేను మూర్ఖు నడుగ నని ప్రత్యుత్తరం బొసంగ రాజు నీవు కవివో విద్వాంసుండవో యనియడుగ బ్రాహ్మణుండు నేను కవి ననఁగా రా జట్లయిన నేదేని పఠింపు మని యడుగ ద్విజుండు భోజుండుగాక నాపదసరణి నెవ్వం డెఱుంగఁ డనఁగా రాజు నాకును గీర్వాణవాణీపరిజ్ఞానంబును గలదు రాజును నాయందుం గూర్చు; నీగుణంబుల నతనికి వినిపించెదను; నీకళా కౌశల మించుక గాన్పింపుము; అని యడిగిన విప్రుండు ఏమి పఠింతు ననఁగా భోజుఁడు విప్రుఁడా యీకలమంబులను వర్ణింపుము. అని చెప్పిన విప్రుం డిట్లనెను.

గీ. కలమములు పాకనమ్రతఁ గాంచి మూల | తలములను రక్తకువలయతతులతావి,
గ్రోలి మారుతకంపితరుచిరశీర్ష | తతి సువాసన శ్లాఘించుగతిఁ దనర్చె.

అది విని రాజు తనయాభరణంబుల నెల్లను వీడిచి యతని కొసఁగెను.

అంత నొకనాఁ డొకకుంభకారకామిని రాజకులంబునకుం జనుదెంచి ద్వారపాలు నితో రాజుం గాంచ నేతెంచితి నన ద్వారపాలకుండు నీ కేమి రాజుతో పని యని య డుగ నాకుమ్మరపడఁతి నేను నీకుం దెల్పను రాజుతోడన గాని వచింప ననిన ద్వారపా లుండు రాజుకడకుం జని దేవ ! యొకతె కుంభకారపత్ని రాజుదర్శనంబుం గోరుచుఁ దన కార్యంబు నాయెదుటం జెప్ప నని వచించుచున్న దని విన్నవించి రాజునానతిఁ గొని దానిం బ్రవేశపెట్టెను. అదియు రాజుం గాంచి నమస్కరించి దేవా మట్టిత్రవ్వుచుండఁ గా నామగఁడు నిధానంబుం గనుగొని యతఁడు దానిం గాంచుచు నయ్యెడన యున్న వాఁడు. నేను దేవరకుం దెల్పంజనుదెంచినదానననఁగా రా జాశ్చర్యపడి యానిధికలశంబుఁ దెప్పించి దానిమోము దెఱచి చూడఁగా దానిలోపల నుండు ద్రవ్యంబును మణిప్రభామం డలంబులు వఱవుదానిం గాంచి కుంభకారపత్ని సంతసించుచు రాజుతో ని ట్లనియె.

క. నరపతి భూతలగతుఁ డౌ | పరిపూర్ణునిఁ జంద్రమసుని భావించి నినుఁ,
వరరత్నరాజిరూపున | ధరణికిఁ జనుదెంచె ఋక్షతతి యన నొప్పుఁ.

రాజు కుంభకారకాంత నుడివినలోకోత్తర మగుపద్యంబును విని సంతసించి దాని కి సర్వంబు నొసంగెను.

అంత నొకప్పుడు రాజు రాత్రియం దేకాకిగా నంతట నగరవృత్తాంతం బారయుచుఁ బౌరులపలుకులు వినుచు సంచరించుచుండెను. అప్పు డొకకోమటియింట నావైశ్యుఁడు తనప్రియురాలితో ని ట్లనియె. ఓకామినీమణీ రాజు స్వల్పదానరతుండయ్యు నుజ్జ యినీపతి యగువిక్రమార్కునిదానప్రతిష్ఠం గోరెడిని. అది భోజునికి లభించునే ? కొంత

ఱు స్తోత్రపరాయణులగు మయూరాదికవులచేత భోజుఁడు సంప్రాప్తమాహాత్మ్యుండయ్యె. అయ్యును భోజుఁడు భోజుఁడే. హృదయహారిణీ వినుము.

చ. హరువుగఁ గృత్తిమంపుసట లంసమునందును గట్టి శ్వానముల్,
నిరుపమ మాదృగేంద్రుపదనిష్ఠితమై యొసఁగంగఁ జేసినన్,
పరమదకుంభికుంభతటపాటనలంపట మైనసింహముల్,
భోరిఁబోరిఁ బొబ్బరించుగతిఁ బూనిక శ్వానము బొబ్బరించునే.

అని చెప్పఁగా విని రాజు తనమనంబున వీఁడు సత్యమే పల్కుచున్నాఁ డని విచారించుచు వెండియు వినుచుండ వాఁ డిట్లనియె.

క. ద్విజపుత్రుఁడు యాచింపఁగ । నిజగా † మళతాష్టకంబు నెమ్మి నొసఁగి తౌ,
విజయఘన విక్రమార్కుఁడ । నిజముగ నీకీర్తి భోజునికి నెట్టులగున్.

గీ. విక్రమార్కునిమాహాత్మ్యవిస్తరంబు । భోజభూపతి ప్రాపింపఁ బోసఁగునేని,
కుంభకారుండు సయితము గోరి కాంచు । కమలసంభవుమాహాత్మ్యకలన నింక.

అది విని భోజుఁడు తనడెందంబున నెల్లజనులను తమగృహంబులందు జంకులేక మాటలాడుకొందురు; నిజంబును బల్కుదురు; వాకొండెనితరులకొండె విక్రమార్కుని ప్రతిష్ఠంబడయుటకు శక్యంబు గా దనుకొనుచు నింటికిం జనియె.

అంతనొకనాఁ డొకకవి రాజద్వారంబునకుం జనుదెంచి రాజుం గనుంగొనవలయు నని చెప్పి ప్రవేశితుండై రాజునకు స్వస్తియనిపల్కి యతనియానతిచే నుపవిష్టుండై పఠించెను

క. కవులందు వాదులందును । ద్రవిణాఢ్యులయందు భోగతత్పరులందున్,
భువినిం బరోపకార । ప్రవణాత్ములయందు లేఁడు ప్రతి భోజునికిన్.

రా జతనికి లక్షధనం బొసంగెను. అంత భోజుం డొకప్పుడు క్రీడోద్యానమునకుం జనఁ బయనమై మార్గమధ్యమునందు మునికిగలవలువ దాల్చుకొని వేఁడిమి మిగులుసూర్యనికిరణములచేఁ గరము తపింపంబడుమోముదామరతో నొప్పుచుండుసులోచన; నొక దానిం గన్నులం గాంచి యి ట్లడిగెను.

ఉ. రాజు. * ఎవ్వతెవీవుపుత్రిక!,, అనఁగా నది. నరేంద్ర కిరాతకుమారి,, నవఁగా రాజు. హస్తమందెవ్వియో,, యనఁగా నది. మాంసముల్,, అనఁగా రాజు. కృశము లేటికి నయ్యెవి యయ్యె'' నని యడిగినంతట నది. విన్మనీ,,

---

† విషక్రిమిన్యాయేన జీవామహే,, యని ప్రయోగము గలదుగాన సంయుక్తోత్తరకంబునకు గురుత్వము కవివిపక్షావళ మని యెఱుంగఁ జనును.

ఉ. * ఎవ్వతె వీవు పుత్రిక? నరేంద్ర! కిరాతకుమారి హస్తమం,
దెవ్వియొ మాంసముల్ కృశము లేటికి నయ్యెవి యయ్యె విన్మ నీ,
విశ్వసుధ న్భవద్రిపుమహీశవధూనయనాశ్రువహింసల్,

విష్వసుధం భవద్రిపుమహీశవధూనయనాశ్రువాహినుల్,
దవ్వులఁ బర్వఁదత్తటిముదంబున సిద్ధవధూకదంబముల్,
మవ్వము మీఱఁబాడవినిమానె మృగంబులు మేఁతమేయుటల్.

అని యుత్తరంబొసంగ రాజును పద్యప్రబంధానుబంధంబున నొప్పునాకిరాతకామినీసల్లాపంబునకు మెచ్చుచుం బ్రత్యక్షరలక్షధనంబొసంగి యాభరణంబుల నెల్ల వీడిచి యిచ్చి యాతురంగంబును దాని కొసంగెను. అంత గృహంబునకుం జనుదెంచి గవాక్షంబునం గూరుచుండఁగా రాజుం గాంచి రాజమార్గంబున నుండి యొకకవియిట్లనియె.

చ. జలనిధిసేతుతీరములు సంస్ఫుటితంబు లవయ్యె నీటిచే,
చలిమలయుం బ్రభూతహిమసంతతిపంక మలంఘ్య మయ్యె ని,
చ్చలు తురగేభసంతతికి సమ్మతి హారతు లెత్తె నీరిపుల్,
వెలువడి పోవు కెట్లొ పదవీతతి గానఁగరాదు నా కిలన్.

అది విని తుష్టుండై రాజు వానికి మార్గమునందుండఁగానే జాత్యంబులగునైదుగజంబులిచ్చెను.

ఒకప్పుడు రాజు మృగయారససక్తచిత్తుండై హయాధిరూఢుం డగుచుం బయనమయి యొకచో నదిని దాఁటిచనుదెంచువానిని శిరంబునం గట్టెలమోఁపు మోయుచుండు వాని నొక్కనిం గని ముఖకాంతిచే విప్రుం డని యెఱింగి యాతని నడిగెను.

రాజు. గీ. జలము లేటఁ గియన్మానములు ద్విజేంద్ర,, యని యడుగఁగా నాతఁడు. గీ. జానుదఘ్నంబులై ధరాజాని యొప్పు,, నని యుత్తరం బొసంగఁగా రాజు ఇట్టిదురవస్థ నీకేల యుట్టిపడియె " నని ప్రశ్న సేయఁగా వాడు. అంద ఱెన్న భవాదృశు లగుదురయ్య " అని నుడువఁగా భూపతి కుతూహలంబున నోవిద్వాంసుఁడా కోశాధికారి నడుగుము; నేను చెప్పితిననఁగా లక్షధనం బొసంగు ననిన నాబ్రాహ్మణుఁడు తలనుండుకట్టెలమోఁపు దించి యిలపయిం బెట్టి కోశాధికారికడకుం జని నన్ను మహారాజంపినవాఁడు; నాకు లక్షధనం బొసంగుము, అని పల్కిన నాకోశాధికారియోవిప్ర నీవు లక్షధనంబుఁ గొనం దగవు అని వచింపఁగా బ్రాహ్మణుఁడు విషాదంబు నొందుచు రా

---

దవ్వులఁ బర్వఁ దత్తటి ముదంబున సిద్ధవధూకదంబముల్,
మవ్వముగాఁగఁ బాడఁ గని మానె మృగంబులు మేఁత మేయుటల్.

*. గీ. జలము లేటఁ గియన్మానములు ద్విజేంద్ర। జానుదఘ్నంబులై ధరాజాని యొప్పు?
నిట్టిదురవస్థ నీకేల యుట్టిపడియె। నంద ఱెన్న భవాదృశు లగుదురయ్య.

శ్లో. కియన్మానం జలం విప్ర। జానుదఘ్నం నరాధిప॥ ఈదృశీ కి మవస్థా తే
నహి సర్వే భవాదృశాః.

జుపాలికిం బోయి యాకోశాధికారి నన్నుంగాంచి నవ్వఁగానియేమియు నియ్యఁడు అని వాక్రుచ్చిన ధారాధీశుండు వెండియుం గుతూహలంబున నోవిప్రవర్యా, రెండులక్షల ధనం బడుగు మతఁ డొసంగు ననఁగా బ్రాహ్మణుఁడు వెండియుం జనికోశాధికారినిం గాంచి రాజునాకు రెండులక్షలధనం బిమ్మనెఁననగా నాకోశాధికారి మరల నవ్వెను. ద్విజుండును భోజునిపాలికిం బోయి యాపాపిష్ఠుండునన్నుంగాంచి నవ్వుచున్నాఁడుగాని ధనం బియ్యండని చెప్పుకొనఁగా మహేంద్రాంశుండును లీలానిధియు నగునాభోజుఁడుకౌతూహలంబున నోబ్రాహ్మణోత్తమా నీవు మూఁడులక్ష లడుగుము. అవశ్యముగ నొసంగు ననఁగా నాద్విజుఁడు చని మరలి వచ్చి యోరాజా కోశాధికారికడకుం జని రాజు లక్షత్రయం బిప్పించుకొమ్మనె నని యడుగఁగా నవ్వుచుండెనుగాని వాఁడు నాకొసంగఁడు అని నుడివి క్రుద్ధుండై యిట్లనియె.

క. కురియంగాఁ బర్జన్యుఁడు । తరుసంతతి పల్లవించె ధాత్రీస్థలి సాం,
పర నర్కము లగుమా కిపు। డగమరికయ పూర్వదళములందు జనించెన్.

క-(౧) ఒకనికి నుద్యమ ముత్తమ మొకనికి నిస్త్రపత మీఱి యుండును ధరలో,
ప్రకటముగ రవియుఁ దరుమును । వికటగతిం దమము పారు వెసఁ బ్రతిదినమున్.

అనఁగా రాజు నోవిప్ర కోపపడకుము. నామాటగఁ జెప్పి ; కోశాధికారివలన మూఁడులక్షలధనఁబును పదిగజేంద్రంబులను గైకొనుము పొమ్మని పక్కి తనయంగరక్షకు నిం దోడ నంపెను. † అంత కోశాధకారి ధర్మపత్రంబునందు భోజుఁడు జానుదఘ్నప్రభాషణంబునకు సంతసించి లక్షయు లక్షయు వెండియు లక్షయుఁ పదిమదగజంబులును ఒసంగెను. అనివ్రాసెను.

### ॥ శుకదేవకవి భోజునికడకు వచ్చుట ॥

అంతనొకనాఁడు భోజుండు సింహాసనం బలంకరింప ద్వారపాలుండు సనుదెంచి రాజా శుకదేవుం డనుకవి యొకఁడు దారిద్ర్యవిడంబితుం డగుచు ద్వారంబున నున్నవా డనఁగా రాజు బాణకవింగాంచి యోపండితుఁడా సుకవీశుకదేవు నెఱుంగుదువా యని యడుగఁగా బాణుండు శుకదేవునిసామర్థ్యం బెఱింగినవాఁడు కాళిదాసుం డొకరుండయ న భోజుండు చెలికాఁడా కాళిదాస శుకదేవకవి నెఱుంగుదువే యని యడుగనాకవియు ;

---

(౧) ఒకఁడు సమర్థుఁడై యుత్తమప్రయత్నంబు సేయు మఱియొకఁడు లజ్జ లేక తద్వశగతుండై తిరుగు. సూర్యుఁ డుత్తమప్రయత్నంబునఁ జీఁకటులం బారందోలు. చీఁకటులు సిగ్గులేక పరుగెత్తుచుండు సూర్యుఁడు వోలె భోజుఁడును చీఁకటివోలె బ్రాహ్మణుఁడనిలోఁ చెడిని. ఇతఁడు పనిపెట్టఁగా ద్విజుఁడుసిగ్గుమాలి తిరుగుచున్నాఁడని భావము.

శ్లో. † లక్షం లక్షం పున ర్లక్షం మత్తాశ్చదశదంతినః । దత్తా భోజేనతుష్టేన జానుదఘ్న ప్రభాషణాత్ ॥

క. ఇరువుర సుకవుల నెఱుఁగుదు । ధర నంతట ఖ్యాతిచేతఁ దనరెడివారిన్,
పరముల శుకభవభూతుల । నరయఁగ వాల్మీకి త్రితయుఁ డగు వీరలకున్.
అని వచింప విద్వద్బృందనందిత యగుసీత యి ట్లనియె.

క. కాకంబులు క్రోంకారము । వీఁక మిగుల నెల్లచోట్ల వేఁ జేయవె పో,
ప్రాకటముగ నృపలాలిత । మై కాంతము గాఁగఁ బల్కునది శుక మొకటే.
అనఁగా నంత మయూరుం డి ట్లనియె.

క. నరపతిసభ నడుగకయే । నరుఁ డెవ్వఁడు పూనుఁ బల్క నర్మిలి మీఱన్,
పొరయు నసన్మానముఁ గా । కరయ విడంబనను సైత మాత్మఁ గలంగన్.
భోజభూపతీ ! అట్లనను పల్కెదను.

క. ఇది సభయే ఇది జ్ఞానమె । యిది రసికసమాజ మగునె యిది కవితతియే,
ఇదియు నొకదానమగునే । మది శుకకవి మెచ్చకున్న మనుజాధీశా.

అప్పటికి భవనద్వారంబునకుం జనుదెంచినశుకదేవునిం దోడ్కొని రాఁజను నని రాజు తనమనంబున శుకదేవునిసామర్థ్యంబు విని మహాకవిం గనుంగొనం గలిగితిమే యని హర్షంబును సత్కవికోటిమకుటమణి యగునీతని కే మియ్యం దగిన దున్నది? యని విషాదంబును జెందుచుఁ జింతించుచు ద్వారపాలకునిం గాంచి కానిమ్ము ప్రవేశపెట్టు మని వచ్చుచున్న శుకదేవునిం గాంచి ధారాధీశుండు సింహాసనము నుండి లేవఁగా బండితులెల్ల వారును లేచిరి. పండితులు రాజును శుకదేవునికిం బ్రణామములు గావించిరి. రాజత నిని సింహాసనంబున గూరుచుండంబెట్టి యాశుకదేవునియాజ్ఞచేఁ దానును గూరుచుండెను. అప్పుడుశుకదేవుండు దేవధారానాథ శ్రీవిక్రమనరేంద్రునిదానలక్ష్మినిన్నే సేవించెడిని ; దేవ మాళవేంద్రుండ వగునీవ ధన్యుండవు; నీపాలం గాళిదాసాదిమహాకవులు సూత్రబద్ధంబు లగుపులుఁగులచందంబున నుండెదరు. అనిచెప్పియిట్లనియె.

గీ. † భోజునిప్రతాపమున కతిభీతుఁ డగుచు। దపనుఁ డొందెను మిత్రతఁ ; దాల్చె నౌర్వ,
దహనుఁడునుబాడబతఁ ; గాంచెఁ దత్తటిత్కు లంబా క్షణికత భీతిబలంబుపేర్మి.

---

శ్లో. † ప్రతాపభీత్యా భోజస్య తపనో మిత్రతా మగాత్ । ఔర్వో బాడబతాం ధత్తే తటి త్క్షణికతాం గతా ॥ భోజునిప్రతాపమునకు భయంపడి సూర్యుడు మిత్రుఁడయ్యెను ; ఔర్వాగ్ని యాఁడుగుఱ్ఱం బయ్యె ; మెఱుము క్షణిక మయ్యె ననియర్థము. మిత్రతయుబాడబతయుక్షణికతయు వానికిం గలవు. ఇవియిట్లుత్ప్రేక్షింపబడియె.

శ్లో. † సువర్ణకలశం ప్రాదాత్ దివ్యమాణిక్యసంభృతం । భోజ శ్శుకాయ సంతుష్టః దంతినశ్చ చతుశ్శతం,,

అనగా విని భోజుండో సుకవీ నిలుపుము మెండియు నొక శ్లోకంబుం బఠింపకుమని దివ్యమాణిక్యములు నించిన సువర్ణకలశం బొకటియును నాలుగునూర్లయేనుంగులను సంతసంబున నా శుకదేవకవి కొసంగు మనినం గోశాధికారి యట్లొనరిచి శుకదేవుని నంపించెను. అతని కిచ్చినది పుణ్యపత్రంబున వ్రాసెను. రాజు శుకదేవకవి స్వదేశంబుఁ జేరె నని విని సంతసించెను. విద్వత్పరీక్షను ముదంబందె.

మఱియు నొకప్పుడు వర్షాకాలంబున వాసుదేవుం డనుకవి సను దెంచి రాజుం గాంచిన నతఁడు పర్జన్యునిం గుఱించి పల్కుమనఁగాఁ గవియు ;

మ. అలచింతామణిచేతఁ గల్పకముచే నాకామధేన్వాదులన్,
† బలభిన్ముఖ్యపరోపకారనిరతప్రాయాళిచేఁ గాదు పో,
జలదంబు ల్జలధారలం దడుపఁగా సర్వోర్వరాభాగమున్,
లలి ధారేయత నీవు దాల్ప బ్రతుకు న్వాళిం జగం బంతయున్.

అని పఠింపఁగా విని యాతనికి లక్షధనం బొసంగెను.

ఇట్లు రాజు నిరంతరంబుగ నిచ్చుచుండం గాంచి ముఖ్యామాత్యుండు తానెదుటం జెప్పలేక కేళిపడకటింటిగోడపైన సువ్యక్తంబు లగునక్షరంబులు వ్రాసెను. అందుశయనంబునుండి లేచి రాజు " గీ. ధనము రక్షింపఁ దగు నాపదలకు గాను " అనివ్రాసియుండుటఁ గాంచి తాను రెండవగీటు " మహిని నాపదలేవి శ్రీమంతులకును " అని వ్రాసి చనియెను. మఱునాఁడు అమాత్యుండు ద్వితీయచరణంబుం జదివి చూచుకొని" అట్టిసంపద దొలఁగిన నపుడె పెలుచ,, నని వ్రాసి పోఁగా రాజు నది గాంచి" సంచితార్థంబు సయితముసమసిపోవు" నని వ్రాసినం జూచి ముఖ్యామాత్యుండు రాజుచరణంబులపయింబడి దేవా మదీయాపరాధంబు క్షమింపు మని వేఁడుకొనెను.

ఒకప్పుడు ధారానగరంబున రాజుపరిసౌధభూమియందుం బరుండి యుండఁగానొకద్విజచోరుండుకన్నము పెట్టి భూపతిబొక్కసగృహంబునఁజొచ్చి వైడూర్యాదు లగుపె

---

† ఇంద్రుఁడు మొదలగుపరోపకారనిరతప్రాయులసమూహంబుచేత నని యర్థము. కాదుపోజగద్రక్షణము గాదు సుమా ?

శ్లో, ‡ ఆపదర్థం ధనం రక్షేత్ శ్రీమతా మాపదః కుతః । సాచే దపగతా లక్ష్మీః స్సంచితార్థోపి నశ్యతి.

గీ. ధనము రక్షింపఁ దగు నాపదలకు గాను । మహిని నాపద లేవి శ్రీమంతులకును,
అట్టిసంపద దొలఁగిన నపుడె పెలుచ । సంచితార్థంబు సయితము సమసిపోవు.

క్కరత్నంబు లపహరించికొని యవియెల్లఁ బరలోకఋణంబు లని తలంచి యయ్యెడన వైరాగ్యంబుం జెంది యి ట్లుచింతించె.

క. అంగవిహీనులు కుష్ఠులు। పంగువులు దరిద్రు లగుట ప్రాక్తనజన్మో
త్తుంగతరపాపఫల మది। సంగతముగఁ గాంచుచుండ్రు సర్వశరీరుల్.

అప్పుడు రాజునిదుర చాలించి దివ్యశయనంబున నున్నవాఁడై వివిధమణికంకణాలంకృతంబై యతిదర్శనీయంబై యొప్పుదయిలలసమూహంబుం గాంచి గజతురగరథపదాతిసామగ్రులం దలంచుచు రాజ్యసుఖసంతుష్టుండై ప్రమోదభరంబున ని ట్లనియె.

ఉ. అన్నులు మానసంబునకు హర్షముఁ గూర్చెడువారు; బంధుగుల్,
మున్నగువార లుత్తములు; మోదము గల్గఁగఁ బల్కు భృత్యులున్,
చెన్నగునశ్వముల్ కరులు చెప్పఁగఁ జొప్పడనట్టిసంపదల్,

అనునీమూఁడుగీటులు రాజునోట వెడలి రాఁగానే చోరుండు విని యిట్లనియె.

కన్నులు మూసికొన్న నవి గన్పడఁబోవు నిజంబ దారయన్.

అని చెప్ప గ్రంథంబు సంగ్రథితం బగుటంగాంచి భోజుఁడు చోరునిం జూచి వీరవలయంబు బహుమానం బొసంగిన నాతస్కరుండు బ్రాహ్మణగృహంబునకుం జని పరుండియుండునాబ్రాహ్మణుని లేపి యతని కిచ్చి యి ట్లనియె. ఓవిప్రుఁడా యిది భోజరాజుహస్తవలయము,-బహుమూల్యము. అల్పమూల్యమునకువిక్రయింపంబోకు మని చెప్పి చనియె. అంత బ్రాహ్మణుండు పణ్యవీథకయుం దది యమ్మి దివ్యభూషణంబులను పట్టుపుట్టంబులును గైకొనఁగా రాజభటులు గొందఱు వానిం జోరుం డని తలంచి రాజునకుం దెలిపి యాతనియానతిచేత రాజుపాలికిం దోడ్కొనిపోయిరి. రాజు ఓబ్రాహ్మణా నీకుఁ గట్టుకొనఁ బుట్టంబుసయితము లేదే అట్లుండ నింతవేకువన దివ్యకుండలాభరణపట్టదుకూలంబులు నీ కెట్లు దొరికె? అని యడుగఁగా నాబ్రాహ్మణుండును;

ఉ. చచ్చినరీతిఁ గప్ప లిల సందులలోనఁ బరుండెఁ గూర్మము,
ల్జొచ్చెను భూతలాంతరములోఁ బొరలాడఁ దొడంగె మత్స్యముల్,
వెచ్చనిపంకమం దటులు వేసవి నిస్కమహాహ్రదంబునన్,
నిచ్చలు వన్యదంతితతి నీట మునుంగుచు ఫూత్కరించుచున్,
గ్రచ్చఱ సంతసింపఁగ నకాల పయోద మొనర్చె నివ్విధిన్.

అని చెప్పఁగా రాజు సంతుష్టుడై యతనికి వీరవలయంబుం జోరుం డిచ్చినట్టులు నిశ్చయించి తానును లక్షధనం బొసంగెను.

మఱియొకప్పుడు విష్ణుం డనుకవిశేఖరుండు రాజద్వారంబునకుం జనుదెంచి ద్వారపాలకులచేతఁ బ్రవేశపెట్టఁబడి రాజుం గాంచి స్వస్తిపూర్వకంబుగ ని ట్లనియె.

శా. ‡ ధారాధీశధరామహేంద్రగణనాతాత్పర్య మొప్పం దివిన్,
తోరం బౌఘటిక ప్రచించె విధి యస్తోకైకరేఖం దదా,
కారంబుం ద్రిదశాప గందురు హిమగ్రావంబు త్వత్తుల్యభూ,
దారోత్తంసుఁడు లేమిఁ దృక్త మగుతత్ఖండంబపో భూమిపై.

రాజు నాలోకోత్తరమగుపద్యంబు వినియితని కేమి యియ్యనగునని చింతించుచుండెను.

ఆక్షణంబున నప్రతివ్వంద్వంబై యొప్పువిష్ణుకవిపద్యంబు విని సోమనాథకవి విచ్ఛాయవదనుండై దౌష్ట్యంబు మెఱయ రాజుతో నోదేవ! యితఁడు సుకవియే! వీఁడు రాజసభ యిట్టిదని యెఱింగినవాఁడు గాఁడు. దారిద్ర్యవారిధి. వీనికిం జింపిగోచి యైన లేదు. అని చెప్పఁగా రాజు,

క. నిరవద్యంబులు పద్యము | లరుదై కనుపట్టఁ జేద యైన నదేమీ ?
ధర భిక్షుకకుకలితము | నుర వగునిక్షువది పాల్చునో నీరసతన్.

అని పల్కి యెల్లవారికిని దాంబూలంబు లొసంగి సభనుండి లేచెను. అంత నం దఱు నొండొరులతో సోమనాథుండు విష్ణుకవికవిత్వంబు విని బాగుగ దౌష్ట్యం బొనరించె నని చెప్పుకొనుచుండఁగా విష్ణుకవి యొకపద్యంబు వ్రాసి సోమనాథకవిచేతి కిచ్చి నమస్కరించి యీసభయందు నీవ సుచిరకాలము సంతసించుచుండు మని చెప్పి పోవం గడంగెను. అంత సోమనాథకవి యాపద్యంబు చదువుకొనెను.

చ. తరుణమరుద్విధూత బహుదారణ దావశిఖాగృహీత మై,
తరునిచయంబు వాఁడె జలదంబ నితాంతము నీవు గ్రక్కునన్,
సురుచిరవారిసత్కణము సూటిగఁ జిందకపోతివేనిఁ బో,
మ్మురుతరవజ్రపాతముల నోలిఁ గలంపకు నిర్దయాత్మతన్.

అని యాపద్యంబు సదివికొని సోమనాథుండు కళత్రవస్త్రంబులు దక్క తక్కినవి యగుసకలపట్టుదుకూలవిత్తహిరణ్యమణితురంగమాదిసంపదను విష్ణుకవి కొసంగెను. అంత రాజు మృగయారసప్రసృత్తుండగుచుం బోవుచు నావిష్ణుకవిం గాంచి తనమనంబున నే నీతనికి భోజనంబునకుసయితం మిచ్చినవాఁడఁ గాను; నన్ను నొప్పరికించి యితఁడు సంపత్తిసంపూర్ణుండై తనదేశంబునకుం జనంబోయెడిని; వీని నడుగుదును అని చింతించి విష్ణుకవిం బిలిచి నీకు సంపద లెట్లు గలిగె నని యడుఁగఁగా నావిష్ణుకవి యి ట్లనియె.

‡. బ్రహ్మ రాజులను గణనసేయం గడంగి యొకబలపంబున భోజుఁ డొక్కరుండని దివియం దొకగీత గీచి యతనివంటివాఁడు లేమిచే నాబలపపుతునకను భూమియందు బారవైచె. ఆగీఁచినగీతయే యాకాశగంగగాను ఆబలంపపుఁదునుకయు భూమిలోపలిమలగా నయ్యె నని తాత్పర్యము.

గీ. సోమనాథసుకవి సుభగుండు త్వద్గృహ। భిక్షుకుండు కరుణ బెరసి యిపుడు,
కల్పపాదపంబుకరణి నిచ్చెను నాకు । భూమిఁ గాచునట్టిభోజనృపతీ.

అని చెప్పఁగా రాజు తొలుత సభలోఁ దాను విన్నపద్యంబున కక్షరలక్ష ధనం బొసంగి సోమనాథుం డెంత విష్ణుకవి కిచ్చెనో యంతసంపత్తి సోమనాథునికి వెండియు నొసంగె. అంత సోమనాథుఁ డి ట్లనియె.

గీ. బంధురకృపాకులాత్మతఁ బరఁగుచుండు । జలద మంభఃప్రపూరముల్ జార్చదేని,
వన్యతరువులకును లతావర్గమునకు । ఘనఫలంబులు సుమము లెక్కడివి భువిని.

అంత విష్ణుకవి సోమనాథుం డొసంగినదానిచేతను రాజొసంగినదానిచేతనుసంతుష్టుం డయ్యె. అపుడుసీమంతకవి యొకరుం డి ట్లనియె.

మ. ధరియించు న్భువనంబుల న్ఫణముల న్దర్వీకరేంద్రుండు; నొ,
క్కరుఁడే పూనెడిఁ గూర్మరా జతని వీఁకం బృష్ఠభాగంబునన్,
భరియించుం దనగ్రోడమంద యతని న్బాగొప్పఁగా సంద్ర; మా,
పురుషోత్తంసులచర్య లద్భుతములై పొల్పొందుచుండు న్భువిన్.

ఒకప్పుడు సౌధతలంబున రా జుండఁగా నతనిపాలికిం జని భృత్యుండు దేవ! అఖిలంబు లగుకోశజాతంబులందుం గలవిత్తజాతం బంతయునీవు కవులకొసంగితివి. కోశములందు ధనలేశంబైనను లేదు. ప్రతిదిన మెవ్వఁడో యొకకవి వాకిటం గాచి యుండెడిని. ఇంక కవినొండె విద్వాంసునొండె నెవ్వనినేని రాజునకుఁ దెలుపఁ జనదు. అని ముఖ్యామాత్యుండు రాజసన్నిధియందు విన్నవింపుకొన నన్నుంబంచెనని చెప్పఁగాఁ గోశస్థం బగుధనంబంతయుదత్తంబయ్యెననియెఱింగియు నిప్పుడు వాకిట నుండుకవిం బ్రవేశపెట్టు మనఁగా విద్వాంసుండు సనుదెంచి స్వస్తియని చెప్పుచు నిట్లనియె.

చ. త్వదభిముఖంబుగాఁగ ముదితస్థితిఁ జంచువు మీఁది కొడ్డుచున్,
చదలఁ గతావలంబమునఁ జాతక మెంతయుఁగాచియుండె నీ,
రద జలసారముల్ కరము గ్రక్కున నొల్కకయున్న నుండని,
మ్మది; భవదీయమంజురవ మైన వినంబడలేద దానికిన్.

అన విని రాజు విద్వాంసులును కవులును వాకిటికిం జనుదెంచి దుఃఖించుచుండె దరు గాన నాజీవితంబును చీయనవలయు నని తలంచుచు నాబ్రాహ్మణునికిఁ దాఁ దాల్చుకొనియుండునాభరణంబుల నెల్ల వీడిచి యొసంగెను. కోశాధికారినిం బిలిపించి యోరీ భాండారిక ముంజరాజుకోశంబులందు నట్టినాపూర్వులకోశంబులందును గలరత్నపూర్ణంబు లగుకలశంబులం గైకొని రమ్మని రా జాజ్ఞ సేయఁ గాశ్మీరదేశమునుండి ముచుకుందుం డనుకవి సనుదెంచి స్వస్తి యని చెప్పి;

* క. భవదీయయశోజలధిం । దివి మునుఁగుదు నను మ భయము దివురఁగ మదిలో,
రవిచంద్రబింబమిషమున । నవకుంభయుగంబుఁ దాల్చె నాఁ జనుఁ జూడన్.
అనునీపద్యంబు సెప్పిన విని రాజతనికి నక్షరలక్షధనం బొసంగ వెండియుఁ గవి;

క. చాతకచక్షుర్యగళం। జాతాశ్రుకణంబు లెన్నొ జలదము బిందు,
వ్రాతంబుల నొలికింపవు । చేతోగతి నన్నియైనఁ జెలిమి మిగులఁగన్.

అని పల్కఁగా రాజు వానికి నూఱుగుఱ్ఱంబులు నొసంగెను. అంత భాండారికుండు † ముచుకుండకవికి భోజుఁడు లక్షలకొలఁది ధనం బొసంగియు వెండియు నాతఁడు యాచింప జాత్యశ్వంబుల నూఱింటి నొసంగె. అని ధర్మపత్రంబున వ్రాసె. అంత రాజు సభలోనివారల నెల్లర నిండ్లకనిపి ఏనింటికిం జనుచుండఁ జామరగ్రాహిణి రాజుం గాంచి;

ఉ. ‡ ముంజకులప్రదీప నృపముఖ్య నిశాసమయాంతరంబులన్,
మంజునవాతపత్రమున మాటికి సంచరణంబు నీకు మే,
లంజక యుండుఁగాక శశి యందపునీనగుమోముఁ గాంచి తా,
మంజులశీలసంపదల మాన కరుంధతి యుండుగా కొగన్.

అని చెప్పఁగా రాజు దానికిం బ్రత్యక్షరలక్ష బహుమాన మిప్పించెను.

కొండొకసమయంబునఁ గుండిననగరంబునుండి వచ్చినగోపాలుం డనుకవి రాజునకు స్వస్తియని చెప్పి,

---

* నీట మునింగిపోవుదు నని భయంపడువాఁడు కుంభప్లవంబు నుంమకొనియుండుట ప్రసిద్ధము. దివి భోజునియశం బనుమహాసముద్రమునఁ దాను మునుంగిపోవుదు నను భయము గలిగి యానీట మునింగిపోకుండుటకు సూర్యుఁడు చంద్రుఁడు ననుకడవలు పట్టుకొనియున్న దని తాత్పర్యము.

శ్లో. †. ముచుకుందాయ కవయేజాత్యానశ్వాన్ శతం దదౌ । భోజః ప్రదత్తలక్షోపి తేనాస్తౌ యాచితః పునః.

‡. శ్లో. రాజన్ ముంజకులప్రదీప సకలక్ష్మాపాలచూడామణే । యుక్తంసంచరణం తవాద్భుతమణిఛత్రేణ రాత్రా వపి । మాభూ త్త్వద్వదనావలోకనవశా ద్వ్రీడావనమ్రశ్శశీ । మాభూ చ్చేద మరుంధతీ భగవతీ దుశ్శీలతాభాజనం.

భోజుఁడా నీవు రాత్రివేళ రతనంపుగొడుగు లేక సంచిరించితివేని నీమొగంబుం గాంచి చందురుండు సిగ్గుపడును. నీసౌందర్యంబుం గాంచినచో నరుంధతికిఁ బాతివ్రత్యభంగంబు గలుగు నని భావము.

క. $ ధారాపతి నీచిత్తము। చీరికిఁ గొనకున్న రెండు తృణకణములుగా,
దోరును రుష రిపుసైన్యము । లారఁ బ్రసాదంబునందు హాటకగిరియుౝ.

అని యొకపద్యంబు సెప్ప రాజు విని సంతుష్టుం డయ్యు నేమియు నొసంగక రాజపురుషులతో సంభాషించుచు నుండం గవి రాజు వినలే దని చింతించి యాక్షణంబున సమున్నతత్వంబుం గాంచు మేఘంబుం జూచి రాజుతో;

చ. కరము మహోన్నతం బగుచుఁ గ్రమ్మితి వెంతయు నెల్లదిక్కులౝ,
గురియకపోవ వెంతయును గూరిమి క్షీరసమాన మారసం,
బురుతరఘర్మతాపభర మోర్వఁగఁ జాలక మీనకూర్మముల్,
శరణము చెందె నీరదమ స్వల్పమునే నొలికింపు నీరముౝ.

అని వచింపఁగా నృపతియుఁ గవిహృదయం బెఱింగి గోపాలకవీ! దారిద్ర్యాగ్ని చేత నితాంతము దగ్ధుండవైతి వని చెప్పుచు ననర్ఘంబు లగుపదునాలుమణులను పదునాలుదంతీంద్రంబుల నొసంగె.

ఒకకాలమున రాజు ధారానగరంబున సంచరించుచు నొకయెడ శివాలయంబునందు నిదురించు చుండునిరువురుపురుషులం జూచెను. వారిలో నొక్కరుఁడు నిద్రమేల్కొని చెప్పుచున్నాఁడు. ఓరి నీవు నాపడకకు సమీపంబున నున్నాఁడవు! నీ వెవడవు? నిద్రించెదవు. మేలుకొనవా? అనఁగా మఱియొకరుండు ఓవిప్రా; నమస్కరించెదను. నేనును బ్రాహ్మణపుత్రుండనే! ప్రథమరాత్రియందు నీ వియ్యెడఁ బరుండియుండం గాంచి దీపంబులు వెలుంగుచుండుటవలనఁ గమండలూపవీతాదులచేత బ్రాహ్మణుండ వనియెఱింగి నీపానుపుదాపునన నేను బరుంటిని. నిదురించుచు నిప్పుడు నీపల్కులు విని మేలు కొంటిని. అనఁగా మొదటివాఁడు ఓరి వత్స ప్రణామంబుసల్పెదవేని దీర్ఘాయు వగుము; ఎయ్యెడనుండి చనుదెంచెదవు? నీపేరేమి? ఇయ్యెడ నీకుం బని యేమి? అని యడుగఁగా రెండవవాఁడు ఓవిప్ర! నాపేరు భాస్కరుఁడు; పశ్చిమసముద్రతీరంబునందుఁ బ్రభాసతీర్థంబుననుండు వాఁడను. అయ్యెడ భోజునివితరణము పెక్కండ్రచేత వర్ణింపంబడియె. కాన యాచింపం జనుదెంచినాఁడను. నీవువృద్ధుఁడ వగుటవలన నాకుఁ బితృతుల్యుండవు. నీవును వచింపుము. అన మొదటివాఁడు వత్సా! నాకు శాకల్యుం డనిపేరు; ఏకశిలానగరంబునుండి చనుదెంతు. భోజునికడ ధనాశచేత వచ్చితి. ఓవత్స! నీవు వచింపకపోయినను నీవుదుఃఖపడుచున్నా వని తెలసికొంటిని. అదుఃఖ

---

$. భోజుఁడా నీవు మనంబున లక్ష్యపెట్టక యుండు రెండును కసవుపోచ లగుచున్నవి. ఎవ్వియన! క్రోధము కలిగినప్పుడు రిపుసైన్యంబులును ప్రసాదము కలిగినప్పుడు సువర్ణపర్వతంబు నట్లగును. ప్రతాపదానములు చెప్పంబడియె.

మెట్టిదోవచింపుము. అని యడగఁగా భాస్కరుండు ; అయ్య నాదుఃఖం బేమని చెప్పు కొందును.

† చ. శవములభంగి బాలకులు క్షామతఁ గాంచిరి క్షుత్తుచేత; బాం,
ధవులు నిరాశు లైరి యది తద్దయు దుఃఖము గూర్పలేదు నా,
యువతి చినింగినట్టిపట జెయ్యనఁ గుట్టికొనంగ సూదికై,
భవనము లన్నియుం దిరిగి పల్మరు కాకువిహాసమొప్పఁగా,
భువి జనలోకపత్నివలెఁబూనికి యాచనసేయఁబోవుటల్,
నవనవదుఃఖసంతతుల నాకు జనింపఁగఁజేసె నక్కటా.

అని చెప్పఁగా రాజువిని సర్వంబు లగుతనయాభరణంబుల వీడిచి యాతని కొసఁగి యోభాస్కరా! నీబాలకులు మెందుఁగ దుఃఖింపమందురు; వైళంబ దేశంబునకుం బొమ్ము. అనిచెప్పఁగా శాకల్యుం డిట్లనియె.

‡ చ. ధరను సముద్ధరించె బలిదర్పితులక్ష్మిని నిండుకొఁగిటం,
దిరముగఁ జొన్పె వైరివితతి న్సమయించె సుమీ కుమారుఁ డీ,
వర మగునొక్కజన్మమున వాంఛఁ బురాణుఁడు పూరుషుండు దు,
ర్ధరగతి మూఁడుజన్మముల దానిన తారచియించె మించుమడ్.

అది విని రాజు శాకల్యునికి మూడులక్షలధనం బొసంగె.

మఱియొకప్పుడు మృగయయందుం దిరుగుచు భోజుఁడు ఎదుటికి వచ్చినయాఁడు జింకను బాణంబున నేయఁగా విత్తాశచే నొకకవి.

ఉ. భోజుఁడు వేటలోఁ దిరుగఁ బోడిమిఁ జాపము నెక్కుపెట్టినన్,
తేజము మీఱఁగాఁ దిగిచి తీవ్రశరంబును మేనఁ జొన్పినన్,
శ్రీజనితుండు కాంతు ననుఁ జేర్పఁగ వచ్చె నటంచు నెంచి సం,

---

† శ్లో॥ కుత్క్షామా శ్శిశవ శ్శవాఇవ భృశం దీనాశయా బాంధవా । లిప్తాజర్ఝరఘర్ఘరీజతురసై ర్నోమాం తథా భాధతె ꞉ గేహిన్యా త్రుటితాంశుకంఘటయితుంకృత్వా స కాకుస్మితం కుప్యంతీ ప్రతివేశ్మ లోకగృహిణీసూచీం యథాయాచితా.

‡ మునిమి మీఱిన యాహరి భూమి నుద్ధరింపను బలియను దర్పితుని లక్ష్మిని హరింపను శత్రువుల సంహరింపను వరాహవామన రామావతారంబులు మూఁడొనరించెను; ఈ మూఁడుపనులును కుమారుఁ డగుభోజుఁడొకయీజన్మంబునం గావించెఁ గాన నాపురాణపూరుషునికన్న నీకుమారుఁడు సమర్థుం డని తాత్పర్యము. వరాహుఁడు భూమిని సముద్ధరించుట పైకెత్తుట. భోజుఁడు సముద్ధరించుట కాపాడుట. వామనుఁడు బలి యనెడుదర్పితుని లక్ష్మినపహరించె. భోజుఁడు బలవంతు లగుగర్విష్టులలక్ష్మిని హరించె. రాముఁడు రావణాదివైరులం జంపె. భోజుఁడు వైరులం జంపె.

జాతముద్దంబునఁ బొదిలి వేఁబరుగెత్తగు వాయ దయ్యెడఁన్.

అని చెప్పఁగా రాజు మూఁడులక్షలధనం బాతని కొసంగె.

ఒకకాలంబున భోజుండు సింహాసనమున నుండఁగా ద్వారపాలకుండు సనుదెం చి దేవరా జాహ్నవీతీరంబున నుండునొక వృద్ధబ్రాహ్మణి ద్వారంబున నున్నది యనఁ గా రాజు ప్రవేశపెట్టు మని యేగుదెంచుచున్నయామెకుఁ బ్రణామంబు సేసిన నావిదుషి యు చిరంజీవ యని పల్కె.

గీ. భోజ నీదుప్రతాపాగ్ని వోలుమఁజిత్ర| మై ధరాపతికటకాళులందుఁ జేర్మి,
నదిచోరంబడరిపుపార్థివాళియింట్లఁ | గసవు మొలుచునుగిదవయ్య క్రమము గాఁగ,

అని చెప్పఁగా రాజు సంతసించి యావృద్ధకు రత్నపూరితం బగుకలశం బొకటి యొసంగె. అంత భాండారికుండు! భోజుఁడు తనప్రతాపము స్తుతించినందులకుం బరితో షంబుం జెంది రాజసభయందు వృద్ధకు సువర్ణమణిసంభృత మగుకలశంబొసంగె నని ధర్మప త్రంబున వ్రాసెను.

ఒకప్పుడు దూరదేశమునుండి చనుదెంచియొకచారుండు రాజుంగాంచి దేవరాసిం హళదేశమునందు చాముండాలయంబున నొకరాజకన్యకం గాంచితి. అది నన్నుం గనుంగొ ని మాళవదేశపుంబ్రభు వగువానిమహిమ వెలుచ వినంబడియె; నీవును వచింపుము అని యడుగఁగా నేను భవద్గుణంబులు వర్ణించి చెప్పితి. అది కరము సంతసించి నిరుప మం బగుచందనతరుగర్భఖండంబు నొసంగి యథాస్థానంబును జెందె. దేవరగుణములవర్ణనం బుచే సంప్రాప్తం బయినదీనినిఁ గైకొమ్ము; దీని పరిమళంబు వ్యాపించె నేనిభృంగంబులును భుజంగంబులును గ్రమ్ముకొనును; అని పల్కి శ్రీచందనఖండం బొసంగిన నది గైకొని రా జు వానికిలక్షధనం బొసంగె. అప్పుడు దామోదరకవి తద్వ్యాజంబున రాజును స్తుతిం చుచున్నాఁడు.

ఉ. చందనవృక్షమా యడవిశాఖులు పెక్కు ల వుండు; వానికిం,
పొం దొనరించుసౌరభము పుష్పములందునఁ గానవచ్చు; నీ,
యందపునంగకంబులను నన్నిట ఖ్యాతిశుచిత్వయుక్త మా,
గందముఁ జూరలిచ్చెదవు గానఁదరం బగునే భవాదృశుఁన్.

రాజు అది విని తన్ను స్తుతించినందుకు వానికి లక్షధనంబొసంగెను.

అంత ద్వారపాలకుండు సనుదెంచి దేవరా యొకతె సూత్రధారి యగుస్త్రీ ద్వా రంబుననున్నది యనిన రాజు ప్రవేశపెట్టు మని పల్కఁగా నది ప్రవేశించి నమస్కరించి

క. బలిదైత్యుండు రసాతల| నిలయుఁ డధఃకృతుఁ డటౌట నృప యబ్రమె నీ,
వలనదివిష్ఠము కల్పక | మలఘు వధఃకృత మ దౌట యబ్రము చూడన్.

అని చెప్పఁగా రాజు దానికి ప్రత్యక్షరలక్ష యొసంగెను.

అంత నొకప్పుడు మృగయాపరిశ్రాంతుండై రా జొకయెడ సహకారతరువునడుగున నుండఁగా నయ్యెడకు మల్లినాథుం డనుకవి సనుదెంచి.

క. శాఖాశతవితతంబులు | శాఖులు గహనంబునం దసంఖ్యాతంబుల్,
శాఖులు విరళంబులు పో | శాఖాసుమగంధసక్తషట్పదకులముల్.

అని చెప్పఁగా నాతనికి రాజు హస్తవలయుం బొసంగె.

రా జయ్యెడన యుండఁగా నొకవిద్వాంసుండు సనుదెంచి స్వస్తి యని పల్కి యిట్లనియె. రాజా నేను దక్షిణదేశంబున నుండువాఁడను; తీర్థయాత్రకై కాశీదేశము మొదలుకొని సంచరించెదను అనఁగా రాజు మీవంటితీర్థవాసుల దర్శించుటవలన నేను ధన్యుండ నయ్యెద; నని వచింప నాయాత్రికుఁడు రాజా మేము మాంత్రికులము అని నుడువ రాజు విప్రులయం దన్నియుఁ బొసఁగు నని చెప్పి వెండియు నోబ్రాహ్మణుఁడా మంత్రవిద్యవలనఁ బరలోకంబునం దెట్లు ఫలసిద్ధి యగునట్టు లిహలోకంబునం గలుగునా ? యని యడుగ నవ్విప్రుండు వల్కె. రాజా సరస్వతీచరణారాధనంబున విద్య లభించుట లోకవిదితము. ధనావాప్తి యన్ననో భాగ్యాయత్తము.

క. గుణములు గుణములె తలఁపఁగ | గుణవితతులు సంపదలను గూర్చవు సంప,
ద్గుణములఁ గూర్చెడిభాగ్యము | గణుతింపఁగ నన్య మగుమఁ గానఁగవచ్చున్.

దేవరా విద్యాగుణంబులే లోకంబునందుఁ బ్రతిష్ఠాసంపాదకంబు లగునుగాని సంపదలుమాత్రమే కావు.

గీ. తనకు నాయత్తములు గాక దనరుచుండు | గుణములందును నిర్గుణోల్బణత దూఱు,
విధిసమాయత్త మగుధనవిసరమందు| పురుషులకు వాచ్యతే యి దేల బొడముభువిని.

రాజా! మంత్రారాధనంబున నప్రతిహతం బగుశక్తి గల్గు ; ఒకవేడుక జూడుము; నే నెవనిశిరంబునందుఁ గరం బుంచెదనో వానికి సరస్వతీప్రసాదంబున నస్ఖలితం బగువిద్యాప్రసారంబు గల్గు. అని చెప్పిన రాజు నోసుమతీ దేవతాశక్తి కడు గొప్పది యని చెప్పి యొకదాసికంబిలిపించి ద్విజవరా యీవేశ్యశిరంబునఁ గరం బుంచు మనఁగా నా బ్రాహ్మణుఁడు న ట్లొనర్చి దేవి ! రా జానతిచ్చినవియెల్లం బల్కు మనఁగా నాదాసి రాజుం గాంచి దేవా నా కిప్పుడు సమస్త మగువాఙ్మయజాతంబు హస్తామలకంబుభాతిం దోతెంచిడిని. భవత్ప్రముఖులశక్తిని వర్ణింపఁగలను. అని చెప్పఁగా రా జెదుటనుండు ఖడ్గంబుం గాంచి యోసి నాఖడంబు వర్ణింపు మనఁగా నాదాసిక.

గీ. ‡ రాణ నీకత్తి ధారాధరంబు గాఁగ। వైరివనితలకన్నులు వాన గురియుఁ,
గలనఁ గోశంబుతోడఁ దాఁగలయు దెపుడు। శత్రులకు లేమియొసఁగు విచిత్రమిదియ.

అని చెప్పఁగా రాజు దానికి రత్నకలశంబు లనర్ఘంబులు పదునైదు బహుమతి చేసెను.

ఆక్షణంబున నెయ్యెడనుండియొ నైదుగురు కవులు సనుదెంచి తమ్మం గాంచి యించుక విచ్ఛాయవదనుం డైనరాజుం గాంచుచుండ వారలలో మహేశ్వరకవి వృక్ష వ్యాజంబున ని ట్లనియె.

సీ. ఒనరఁ జతుష్పథంబునను బుట్టితివి పో ఘనతరసుచ్ఛాయఁ గాంచినాఁడ,
గాంచి ధన్యుండవై కనుపట్టెదవు మఱి ఫలితుండవై ఫలభరముచేతఁ,
బూర్ణుండవై వంగిపోతివి పో యిప్పు డుత్తమపాదప యోర్చుకొనుము,
జనులు నీపైఁబడి సకలదుశ్చేష్టలు సల్పుచుఁ జేసెడిసంకటముల.

గీ. ఘనసుశాఖాశిఖావళీకర్షణంబు। భంజనంబును క్షోభనోత్పాటనములు,
మఱియు మఱియు ననేకవిమాననములు।జరుగుచుండును చూవె వృక్షంబ నీకు.

అని చెప్పినపద్యంబు విని రా జతనికి లక్షుగనం బొసంగె. అంత నాద్విజవరులు వెవ్వేఱ నాశీర్వాదంబు లొసంగి యథాక్రమంబుగ రాజాజ్ఞచేతఁ గంబళంబునంగూరుచుండి మంగళంబుఁ జదివిరి. అంత నొకఁడు.

శా. పాతాళంబున గంగనీట మెలఁగు న్బల్మారు కూర్మంబు సం,
జాతప్రీతిఁ దదీయకూలభవము స్తల్ గైకొనుం బోత్రి ది,
క్స్మాతంగంబులు మెక్కుఁ దూంట్ల ఫణి యాత్మశ్రీఫణాభోగముల్,
ప్రీతి న్వే విదిలించు భోజనృప ధాత్రి న్నీ విఁకిం దాల్పగ౯.

అని చెప్పఁగా విని రాజు చమత్కృతుండై యతనికి నూఱుగుఱ్ఱంబుల నొసంగె ను. అంత భాండారికుండు † రాజు క్రీడోద్యానంబునందు సహకారతరువునడుగునం గామదేవుని కతిజవంబు లగునశ్వంబులు నూఱిటి నొసఁగె నని వ్రాయుచున్నాఁడు.

---

‡ధారాధరము=మేఘము. కత్తిధారాధరంబు గాన వదిగదా కురియవలసియున్నది. అట్లు గాక శత్రుకాంతలకన్నులు వర్షించుచున్నవి. ఇది చిత్రము. ధారాధరము అనఁగా కత్తి వాదరగలిగియున్నది యని శ్లేషార్థము. కోశంబుతోఁ దా నొకప్పుడును గలయు దు. అట్టిదానికే కదా దారిద్ర్య ముండవలయు; అట్లు గాక శత్రువులు కాదారిద్ర్యం బిచ్చుచున్నది=కోశమనుపదమునకు భాండాగార మొకయర్థము. కత్తి గవుసెన మఱి యొకయర్థము. శ్లేషాలంకారముచేతఁ జమత్కారము.

శ్లో. †క్రీడోద్యానే నరేంద్రేణ శతమశ్వా మనోజవాః। ప్రదత్తాః కామదేవాయ సహకారతరోరధః.

అంత భోజుండు తనకు సమానుం డగువదాన్యుండు లేఁడనుకొని గర్వంబుం దాలిచెను. అది యెఱింగి ముఖ్యామాత్యుండు విక్రమార్కునిపుణ్యపత్రమును భోజునికిం గాన్పించెను. భోజుండు తా నాపత్రికయం దొకించుక ప్రస్తావంబుం జూచెను. అ దెట్లనిన ? విక్రమార్కుండు పిపాసచేఁ జెప్పుచున్నాఁడు.

శ్లో. $ స్వచ్ఛం సజ్జనచిత్తవ ల్లఘుతరం దీనార్తివ చ్ఛీతలం,
పుత్రాలింగనవ త్తథైవ మధురం తద్బాల్యసంజల్పవత్,
ఏలోశీరలవంగచందనలసత్కర్పూరకస్తూరికా,
జాజీపాటలికేతకై స్సురభితం పానీయ మానీయతాం.
అని చెప్పఁగా మాగధుండు ''

శ్లో. ‡ వక్త్రాంభోజం సరస్వ త్యధివసతి సదా శోణ ఏ వాధర స్తే,
బాహుః కాకుత్స్థవీర్యస్మృతికరణపటుః దక్షిణ స్తే సముద్రః,
వాహిన్యః పార్శ్వ మేతాః కథ మపి భవతో నైవముంచ త్యభీక్ష్ణం,
స్వచ్ఛే చిత్తే కుతో భూ త్కథయ నరపతే తేం బుపానాభిలాషః.
అనివచించిన నాలకించి విక్రమార్కుండు,

---

$ సాధువుల చిత్తంబువలెనిర్మలంబైదీనుఁడగునర్థివలెఁగరము తేలికయై పుత్రాలింగనంబువలెఁ జల్లనయి ఆపుత్రునిబాల్యజల్పితంబులువోలె మధురమై యొప్పుచు నేలకికాయలు వట్టివేరు కరాపువులు చందనము మంచిపచ్చకర్పూరము కస్తూరి జాజిపూలు పాటలీకుసుమములు మొగలిఱేకులు వీనిచే వాసనకట్టంబడినపానీయంబుం దీసికొనిరా!

టీ. ‡ నరపతే=రాజా, తే=నీకు, వక్త్రాంభోజం=మోముదామరను, సరస్వతి=సరస్వతియనునది, అధివసతి=అధిష్టించియున్నది. సరస్వతిశబ్దమునకు నదీపరమైనది మొదటియర్థము. వాణియనునది రెండవయర్థము. శ్లేష. అధరః=మోవి, సదా=ఎల్లప్పుడును, శోణఏవ=శోణమనునదమేయయియున్నది. ఎఱ్ఱనిదని రెండవయర్థము. తేదక్షిణఃబాహుః=నీకుడిబాహువు, కాకు...పటుః=కాకుత్స్థునివీర్యమును స్మరింపంజేయుటయందుఁ జాలియుండునది, సముద్రః=సముద్రమే. సంజ్ఞాక్షరములు చెక్కినయుంగరము మొదలగువానితో నుండునది యని రెండవయర్థము. పార్శ్వం=ప్రక్కలను, ఏతాఃవాహిన్యః= ఇవిగోనదులు ' కథమపి=ఎట్టకేలకు, అభీక్ష్ణం=నలుగడల నముంచతి=ఎడబాయవు, వాహినులు=సైన్యము లని రెండవ యర్థము. ఇట్లు నీవు నదనదీసముద్రమయుండవై యుండఁగా స్వచ్ఛేచిత్తే=హృదయము స్వచ్ఛమైయుండఁగా,తే=నీకు, అంబుపానాభిలాషః= నీరుత్రాగవలయుననునాస, కుతోభూత్=ఏలకలిగెను ? రాగద్వేషాదిశూన్య మగుటంజేసి స్వచ్ఛమయి యుండునీహృదయంబున నంబుపానాభిలాష యనురాగం బెట్లు కలిగినది అని భావము,

శ్లో. ‡ అష్టౌ హాటకకోటయ స్త్రినవతి ర్ముక్తాఫలానాం శతం,
పంచాశన్మధుగంధమత్తమధుపాః క్రోధోద్ధతా స్సింధురాః,
అశ్వానా మయుతం ప్రపంచచతురం వారాంగనానాం శతం,
దత్తం పాండ్యనృపేణ యౌతక మిదం వైతాళికా యార్ప్యతాం.

అని పల్కెను. ఇది చదివి చూచి భోజుండు తొలుతన కడునబ్బురం బగువిక్రమార్కునిచరిత్రంబు విని తన కుదయించినగర్వంబుం బరిత్యజించెను.

ఒకప్పుడు రాజు ధారానగరంబున రాత్రియందు సంచరించుచు నొకచోట దేవాలయంబున శీతబాధపడుచు బ్రాహ్మణుం డిట్లు పఠింపఁగా వినుచుండెను.

చ. చలి నెలనీరువోలెఁ దెలుచ న్వ్యసనాబ్ధి మునుంగ శీతముల్,
బలమునఁ గప్పు దగ్గమను పల్వలువ న్వణఁ కుప్పతిల్ల నా,
కలిఁ గడు పక్కళించుకొన గాడ్పుమున న్నిడబాసి నిద్ర కో,
మలి యవమాన మొందినక్రమంబున జేరఁగరాదు రాత్రియుల్,
లలితసుపాత్రదత్త మగులక్ష్మియుఁబోలె విన్నృద్ధిఁ జెందెడిన్.

అది విని రాజు మఱునాఁ డుదయమున వానిని రప్పించి యో బ్రాహ్మణుఁడా గడిచిన రేయి కడుదారుణంపుశీతబాధ యెట్లు సహించితి వనియడుగఁగా నాతఁడు,

క. జానువుల రాత్రులందుఁ గృ । శానునిచే సంజలందు సరిగాఁ బగటన్,
భానునిచేఁ జలి వాపుదు । జానువుచే భానుచేఁ గృశానునిచేతన్.

అని చెప్పిన విని భోజుం డతనికి సువర్ణకలశత్రయం బొసంగె. అంతఁ గవి రాజును స్తుతించుచున్నాఁడు.

గీ. తమయశోగుప్తవేశ్మసంతతులవలనఁ । గర్ణశిబిముఖు లగుదానఘనులు నాత్మ,
ధారణను బొంది యిప్పు డుండఁబును వేగ । ముగ విమోచితులై రిసమ్మోదమొదవ.

అది విని రాజు వానికి లక్షధనం బొసంగె.

ఒకప్పుడు క్రీడోద్యానపాలకుండు సనుదెంచి యొకయిక్షుదండంబును రాజునెదుటం బడవేయ నది భోజుండు గైకొనియె. మయూరకవి నితాంతపరిచయమువలన రాజు తనయందుఁ గావించియుండునవజ్ఞను మనంబునఁ దలంచుకొని చెఱకుగడనెపంబున నిట్లనియె.

---

‡ ఎనిమిదికోట్లబంగారమును మున్నూటతొంబదిమూఁడు ముక్తాఫలంబులును మధువువంటిమదగంధముచేత మదించినమధుపములుగలసింధురములు క్రోధోద్ధతంబులు ఏబదియు పదివేలగుఱ్ఱములునువిస్తారచమత్కారముగలనూర్వుఱవారాంగినలను; ఈపదార్థంబులను; పాండ్యరాజరణముగాఁబంపినవానిని వైతాళికున కొసంగం జనును.

చ. అరయఁగఁ గాంతమై మధురమై రసవంతమువై నితాంతముఙ్,
మరునికి నద్వితీయసుకుమారధనుర్వరమై తనర్చునీ,
కురుతరసద్గుణం బొకటి యూనము గాఁ గనుపట్టుచుండుఁ బో,
నిరతము సేవితం బగుచు నీరస మయ్యెద విక్షుకాండమా.

అనఁగా రాజు కవియుల్లం బెఱింగి మయూరుని సన్మానించెను.

అంత నొకనాఁడు సౌధోపరిదేశంబునం గ్రీడించుచు భోజుండు శశాంకునిం గాంచి యిట్లనియె.

చ. జలదలవప్రభం బొలుచుచందురునందలిలాంఛనంబు లో,
కులు శశ మంచుఁ బల్కుదురు కోరిక నే నటు లెంచ,

అని చెప్పఁగా నంతట నధోభూమియందుఁ బ్రవేశించియుండునొకచోరుండు.

చ. ద్వద్రిపు | త్పలదళనేత్ర లెల్లను నితాంతవియోగదవాగ్నికీలికీ,
లలు గలచూపుఁదూపులఁ గలంచు వ్రణంబులె యీకిణాంకముల్.

అని పల్కఁగా విని యోమహాభాగుఁడా నీ వెవ్వఁడ వర్ధరాత్రసమయంబునందుఁ గోశగృహంబున నుండెదవేల? అని రా జడిగిన నాచోరుండు తన కభయం బొసంగుమని వేడుకొనుడు రా జట్లుసేయ నాచోరుండు ప్రణామంబుఁ గావించి స్వవృత్తాంతంబుఁ దెల్పెను. రాజుతుష్టుండై యెనిమిదికోటుల సువర్ణంబులును మదించినయెనిమిదేనుంగులను బహుమతియొసంగెను.

అనంతర మొకనాఁడు ద్వారపాలకుండు సనుదెంచి దేవా కౌపీనావశిష్టుం డగుకవి ద్వారంబున నున్నవాఁ డన రాజు ప్రవేశపెట్టు మనఁగాఁ బ్రవేశితుం డగుకవి భోజునిం గాంచి యిప్పుడు తనకు దారిద్ర్యనాశం బగు నని తలంచి సంతసించి హర్షాశ్రువుల దొరంగింపఁగా రాజతనిం జూచి ఓకవీ యేల యేడిచెద వనఁగా నాతండును.

ఉ. మార్గమునందు లాజ లనుమాట వినంబడ బాలకశ్రవో,
వర్గము మూసి కామిని వివర్ణనిజానన యాచుఁ జింతతో,
దుర్గతి రిక్తహస్తములఁ దోఁచిన నగ్గనె బాష్పదృష్టి నం,
తర్గతశల్య మయ్యె నది తప్పక పాపగదయ్య భూపతీ.

అని వచించిన విని రాజు శివశివ! కృష్ణ కృష్ణ యని పల్కుచుఁ బ్రత్యక్షరలక్షధన మొసంగి ఓసుకవీ వైశంబ యింటికిం జనుము. నీగృహిణి ఖేదంబుఁ బ్రాపింపకయుండుఁగాత అని చెప్పెను.

అంత నొకనాఁడు మృగయాపరిశ్రాంతుండై రాజు నొకమహావృక్షచ్ఛాయయందుఁ గూరుచుండెను. అయ్యెడకు శాంభవదేవుం డనునొకకవి సనుదెంచి వృక్షవ్యాజంబున రాజునకుం జెప్పుచున్నాఁడు.

ఉ. మారుతము న్సువాసనల; మంచిచివుళ్ల మృగంబుల; న్విరా,
బారుల నారల, న్విరుల బంభరపజ్తులఁ; బండ్లఁ బుల్గులన్,
చేరినఘర్మతప్తులను చెన్నగునీడల; స్కంధసంతతిన్,
వారణపంక్తిఁ; గాతువు భవత్పరిరక్ష్యము లన్యవృక్షముల్.

అనఁగా విని రాజు ప్రత్యక్షరలక్షధన మొసంగెను.

ఒకప్పుడు శ్రీభోజభూపతి శ్రీమంతుని మహేశ్వరుని నమస్కరింప శివాలయంబున కరిగెను. శివసన్నిధియం దప్పుడొకఁడు బ్రాహ్మణుఁడు వచియించె.

ఉ. దానవవైరి యర్ధమును దక్కినయర్ధము గౌరి గైకొనన్,
సూనశరారిలేమి యటు చొప్పడ లోకమునందు నెల్లెడన్,
జానుగ గంగ సాగరముఁ; జందరులేఖ నభంబు; శేషుఁడున్,
క్ష్మానిలయం; బధీశతయు సర్వసమజ్ఞత నిన్నుఁజేరఁగా;
పూనినభిక్షుకత్వమది పోణిమితో ననుఁ జెందె భూపతీ.

అది విని రాజు వాని కక్షరలక్షధనంబు బహుమతి యొసంగె.

అంత నొకకాలంబున ద్వారపాలకుండు సనుదెంచి దేవా యొకవిద్వాంసుండు వాకిట నున్నాఁ డని యతనియాజ్ఞ వడసి ప్రవేశపెట్టఁగా విద్వాంసుండు.

గీ. క్షణ మనుగ్రహించు క్ష్మాపతి నీదృష్టి। పూరితానురాగభార మెవని,
నతని నీర్ష్యచేత నన్నట్లు దారిద్ర్య। వితతి వాసి తొలఁగు వేగ మెసఁగ.

అని వచింపఁగా రాజు లక్షధనం బొసంగిన వెండియు నావిద్వాంసుండు.

ఉ. కొందఱు మూలసక్తు లిలఁ గొందఱు స్కంధవిసక్తు లాదటన్,
కొందఱు నీడ నుండుదురు కొందఱు పువ్వులు గోసికొండ్రు పో,
కొందఱు పల్లవంబులను గోమలగంధము మాత్ర మాసతో,
† గొందురు వాగ్లతన్ ఫలము గోరరు మూఢులు గాంచనేనియున్.

అని వచింపఁగా బాణుం డి ట్లనియె.

చ. అమృతమున స్వాదంబున పయఃకులమందున క్షౌద్రమందు స్వా,
దము కడు కొంచె మధ్యవహృతం బయి నీరసభావ మొందుఁ బో,
ప్రమదలయోష్ఠబింబమున బంధురసత్కవివాక్యవైఖరిన్,
రమణ రసంబు నిస్తులము రాజిలుచుండును క్రొత్తక్రొత్తఁగన్.

అంత రాజు లక్షధనంబు నిచ్చెను.

ఇది శ్రీమదాంధ్రభోజచరిత్రంబున భోజరాజకవిరాజచరితంబునందుఁ

ప్రథమాశ్వాసము సంపూర్ణము.

---

† మూఢులుఫలమునుగనుంగొననైననిష్టపడరని యర్థము.



శ్రీరస్తు.

శ్రీరాధాకృష్ణపరబ్రహ్మణేనమః.



# శ్రీమదాంధ్రభోజచరిత్రము.

అందు

## భోజరాజకవిరాజచరితము.

## ద్వితీయాశ్వాసము.



### —: కాళిదాసభవభూతులతారతమ్యపరీక్ష :—

అంత నొకప్పుడు శ్రీభోజభూపతి సింహాసనాసీనుండై యుండ ద్వారపాలకుండు చనుదెంచి రాజా వారాణసీదేశమునుండి భవభూతి యనుకవి వచ్చి ద్వారంబున నున్నాఁడని చెప్పఁగా భూపతి ప్రవేశపెట్టు మన ద్వారపాలకుం డట్లు రచించెను. ఇట్లు ప్రవేశించి భవభూతి తన్నుఁగని సభాసదులు సంతసింప రాజు సింహాసనంబుఁ బాసి లేచి ప్రణమించినం దీవించి యాతనియాజ్ఞచేత నుపవిష్టుండై యి ట్లనియె.

చ. దివిపునఁ బారిజాతకుసుమంబులు చేర్పునె తేంట్లఁ; బూర్ణిమా,
విధుఁడు చకోరసంతతుల వేఁడునె చంద్రికయందుఁ గూర్పఁగా;
బుధతతి మద్వచస్సరణిఁ బూరితమాధురి ముందుఁ గన్పడన్,
విధియుతిఁ గ్రోలి రంజిలదె వింతగఁ బ్రార్థనలేల వమ్ముగాన్.

ఉ. మా కొకయందలంబు మణిమండనముల్ జవతుంగ మశ్వముల్,
శ్రీకర మైనచేలములు చెంతల పర్విడివచ్చుబంట్లు లే,
రీకుశలస్థపండితుల కెల్లరకు న్హృదయప్రమోదముల్,
ప్రాకటరీతిఁ జేయఁగలభాసురవిద్య యొకండె యుండెడిన్.

అని చెప్పఁగా విని బాణుండు పండితపుత్రుం డి ట్లనియె.

క. ఊపిరి గ్గొనను వెడలదు । వే పరికింపంగ బాణవిద్యాత్మునికిన్,
రూపడుట యెట్లొ ప్రకటా । టోపపదనిబద్ధవాణి డుంకక నోటన్.

అంత భవభూతి యాపరాభవంబున కోర్వం జాలక వెండియు ని ట్లనియె.

చ. పదములఁ గొన్నిటిం దిగిచి వెండకవిత్వము సేయువాఁడు నె,
మ్మది చెడ వశ్యవాక్కు నను మాన్యు వివాదముసల్పఁ బిల్చినన్,

విదితముగా జగ త్త్రయము వేమలు సృష్టియొనర్చు ధాతకున్,
బొదలుకులాలపుత్రునికిఁ బుట్టును పో కలహంబు వెంబడిన్.

అని వచించి మఱియు నిట్లనియె.

క. కాళిదాసనామకవివాణి మద్వచ | స్సరణి వెంబడించు సమతఁ గోరి,
పదపదంబునకును భయసంభ్రమాకుల | స్వాంత మగుచు రసవిషక్త మగుట.

అంతఁ గాళిదాసుండు వెలికాఁడా భవభూతీ నీవు మహాకవివే? ఇందుఁ జెప్ప
వలసినదేమియు లేదు.

క. ధారాధీశునిసభ యిది | సారమహాపండితాళిసంస్తుత్యము గా,
రీరమణసముఁడు భూపతి | యారయ న్యూనాధికత్వ మస్మద్గతమున్.

అని చెప్పఁగా రాజు మీర లిరువురును రత్యంతంబును వర్ణింపుఁ డనఁగా నందు భవభూతి

ఉ. † ఇందునిబింబమందు జనియించెను ముత్యపుసొమ్ము ; లాకసం,
బందును దారకల్ చెదరె ; నంగజచాపము వాసె లోలతన్,
ముందుగఁ గల్వ తేకు లటుమూసికొనె ; న్గలకంఠరావముల్,
మందము లయ్యెఁ ; దెమ్మెరలు మానెను ; సంపఁగెతీఁగె వేగ ని,
ష్పందతఁ గాంచె ; నే నెఱుఁగఁ బైపయి వృత్త మ దేమియయ్యెనో.

అని వచించినఁ గాళిదాసుం డి ట్లనియె.

---

శ్లో. †. ముక్తాభూషణ మిందుబింబ మజని వ్యాకీర్ణతారం నభః,
స్మారం చాప మపేతచాపల మభూ దిందీవరే ముద్రితే,
వ్యాలీనం కలకంఠమందరణితం మందానిలై ర్మందితం,
నిష్పంద స్తబకాచ చంపకలతా సా భూ న్నజానే తతః.

టీ॥ ఇందుబింబం=చంద్రబింబము, ముక్తాభూషణం=ముత్యపు సొమ్ములుగలదిగా, అజని=అయ్యెను. నభః=ఆకాశము=వ్యాకీర్ణతారం=వెదచల్లిన నక్షత్రములుగలది అయ్యెను. స్మారంచాపం=మన్మథునిధనువు=అపేతచాపలం=చాంచల్యముఁదొలంగినదిగా, అభూత్=అయెను. ఇందీవరే=నల్లకలువలు=ముద్రితే=మూసికొనెను. కలకంఠమందర ణితం=పారావతములమందధ్వని, వ్యాలీనం=తగ్గిపోయెను. మందానిలైః=మందమారుతము లచే=మందితం=మందీభావముగైకొనంబడియె.సాచంపకలతా=అసంపఁగెతీఁగె, నిష్పంద స్తబకా=నిక్కబొడచుకొన్న గొత్తులుగలదిగా. అభూత్=అయెను. తతఃఅనంతరము= నజానే=రెఱుంగను.

చంద్రబింబము, ముక్తాభూషణములు, తారకలు, ఆకసము, మన్మథధనుస్సు, నల్ల కలువలు, కలకంఠకూజితము, మందానిలములు, సంపఁగెతీఁగె, తమము, విద్రుమము. ఇవి ముఖము, చెమటబిందువులు, భూషణములలోనిముత్యములుగ, నడుము, కనుబొమలు, క న్నులు, మణితము. నిశ్వాసములు, దేహము. కొప్పు, మోవి, ఈవస్తువులను బోధించు ను. విపయనిగరణముచేసి చెప్పబడియున్నది.

చ. ‡ కలువలఱేనిబింబమునఁ గ్రమ్మెను లేఁజెమటల్ తమంతటన్ ;
జలనము మానెఁ గమ్మలకుఁ ; జయ్యన స్రగ్వినిబద్ధ మౌతమం,
బలవడఁ జాఱెఁ ; గైతకశిఖాయిత మయ్యెనుసుస్మితంబు ; క,
ల్వలును దిరోనిమీలనపువైఖరిఁ గాంచెను ; విద్రుమంబునన్,
దొలఁగెను సీత్కృతంబు ; మదిఁ దోఁచకపోయెను మీఁదివృత్తముల్.

అని చెప్పఁగా విని రాజు కాళిదాసునిం గాంచి యోసుకవీ భవభూతితోడ నీకు సామ్యంబు సెప్పం జనదు. అనఁగా భవభూతి రాజా యేల నివారించెదవు అనిన రాజు భవభూతితో నోయయ్య సర్వవిధంబులఁ గవివే। యనఁగా బాణుఁడు రాజా భవభూతియే కవి యగునేనిఁ గాళిదాసునిం జెప్పవలసిన దేమున్నది? యనఁగా రాజు బాణకవీ కాళిదాసుఁడు కవిగాఁడు ! మఱి భూమియందు నొకపార్వతీదేవిపురుషావతారము. అని నుడువఁగా భవభూతి రాజా యిందుఁ బ్రాశస్త్యం బేమి తోఁచెడిని యని యడుగఁగా భోజుఁడు ఓభవభూతీ ! ప్రాశస్త్యము చెప్పవలెనా ? కాళిదాసునిశ్లోకమునందుఁ గైతకశిఖాలీలాయితం సుస్మితం అని చెప్పఁబడుట ప్రాశస్త్యముగాదే ! అనఁగా భవభూతి నీవు పక్షపాతంబునం బల్కెద వని రాజు ననఁగాఁ గాళిదాసుఁడు మహారాజ యీయపఖ్యాతి యేల ? భువనేశ్వరీదేవాలయంబునకుం జని యచ్చో నాదేవిసన్నిధానమునందుఁ దత్పురస్కారపూర్వకంబుగ ధటయందు నీవు పరిశోధించుము అని చెప్పిన నంత భోజుండు సర్వకవిబృందంబులు గొలువ భువనేశ్వరీదేవాలయంబునకుం జనియం దాదేవిసన్నిధియందు భవభూతిహస్తంబునఁ గ్రాసు నిచ్చి రెండుశ్లోకములను తుల్యము లయినరెండుపత్రములందు వ్రాసి తులయందుఁ బడవైచిన భవభూతిపద్య ముండుభాగంబునందు లాఘవంబు వలనం గలిగినకించిదున్నతిం దెలిసికొని భక్తపరాపధీను రాలైన

శ్లో. † స్విన్నం మండల మైందవం విలులితం స్రగ్బారనద్ధం తమః ।
ప్రాగేవ ప్రథమానకైతశిఖాలీలాయితం సుస్మితం ।
శాంతం కుండలతాండవం కువలయద్వంద్వం తిరోమీలితం ।
పీతం విద్రుమసీత్కృతం నహి తతో జానే కి మాసీదితి.

టీ ॥ ఐందవం మండలం=చంద్రమండలము, స్విన్నం=చెమర్చెను. స్రగ్బారనద్ధం తమః=పూలసరులచేగట్టంబడియుండునంధకారము, విలులితం=జాఱెను. ప్రాగేవ=తొలుతనే=సుస్మితం=మంచిలేనగవు, ప్రథమానకైతకశిఖాలీలాయితం=పైకింబొడుచుకొనివచ్చుమొగలిరేకుకొనలీల వహించెను. కుండలతాఁడం=కమ్మలుకదలుట, శాంతం=శమించెను. కువలయద్వంద్వం=కలువలదోయి, తిరోమీలితం=అర్ధనిమీలితమయి యడ్డముగా మొగిడె. విద్రుమసీత్కృతం=పవడపుఁదీవెయందలిసీత్కారము. పీతం=పోయెను. తతః=అనంతరము, కిమాసదితి=ఏమయినదియు, నజానే=ఎఱుంగను.

యాదేవి సదస్సున నతనికిఁ బరిభవంబు గలుగకుండు గాక యని యెంచి తనకుం జెవిని పూగమ్మగా నిడియుండుచెందొవలోనిమకరందబిందువును వామకరనఖరాగ్రంబునం గైకొని భవభూతిపత్రంబున విదిలించెను. అప్పుడు కాళిదాసుం డిట్లనియె.

చ. * సానుపడె భాగ్య మేమొ ? భవభూతికవిత్వము నాకవిత్వముల్,
గనఁ దుల నుంపఁ ; దత్కవితఁ గన్పడె లాఘవ ; మంత భారతీ,
ఘనకుచ పూర్తికై శ్రవణకల్పిత మైతగునట్టి చెందొవన్,
దనరుమకరందబిందువును దా నిడుచున్నది గౌర ప్రేమతోన్.

అనఁగా భవభూతి కాళిదాసునిపాదంబులపయిం బడెను. భోజునిని విశేషజ్ఞునిగ భావించెను. అంత రాజు భవభూతికవికి నూఱుమత్తగజంబుల నొసంగెను.

---

మఱి యొకప్పుడు రాజు ధారానగరంబున నొంటరిగ రాత్రి సంచరించుచుండి యొకస్వైరిణి సంకేతస్థలంబునకుం బోవుచుండఁగాఁ గాంచి దేవీ నీ వెవ్వతెవు ? మధ్య రాత్రియం దొంటరివై యెయ్యెడ కరిగెదవు; అని యడుగఁగా నాచతురురాలగు స్వైరిణి యతనిని రాత్రిసంచరించుభోజుఁడని యెఱింగి.

గీ. భోజ నీకంటె విషముండు పుండరీక | సాయకుం డని చెప్పుటే సంగతంబు,
హరియుహరుఁడును బ్రహ్మయునతనిశాస| నంబుఁ దలఁ దాల్చి దాసజనంబుపగిది.

అని చెప్పఁగా రాజు సంతసించి దోర్దండంబువలన నంగదంబును వలయంబును వీడిచి దానికిచ్చెను. అదియుఁ దన వోటికిం జనియె.

అంత రాజు మార్గంబున సంచరించుచు నొకయెడ నొకయింట నొంటరిగ నేడ్చుచుండు స్త్రీనిం గనుంగొని విచారించి రాఁ దన యంగరక్షకు ననిపిన వాఁడు మరలఁ జనుదెంచి యోమహారాజా ఆస్త్రీనిఁ గాంచితిని. నీ వేడుచుటకుం గారణ మే మని యడిగితిని. ఆమె యిట్లు చెప్పె. అది వినుము.

చ. పతి యిదె వృద్ధు మంచకముఁ బాయఁడు; గేహము స్థూణశేష ; మా,
తతజలదంబు కాలము ; సుతప్రియవార్తయు లేదు ; కష్టసం,
చితలఘుతైలబిందుఘటి చెందె విభగ్నత; నంచు నత్తగా,
రతితరగర్భభారపరమాలసఁ గోడలిఁ గాంచి యేడ్చెడిన్.

అది విని రాజు కృపావారిధి గాన నాకాంతకు లక్షధనం బొసంగెను.

---

శ్లో. † అహో మే సౌభాగ్యం మమచ భవభూతేశ్చ భణితిం ధటాయా మారోప్య ప్రతిఫలతి తస్యాం లఘిమని ! గిరాం దేవీ కించిచ్ఛ్రుతికలితకల్హారకళికామధూళీమాధుర్యం క్షిపతి పరిపూర్త్యై భగవతీ.

ఒకకాలంబునం గోంకణదేశవాసి బ్రాహ్మణుఁడు రాజునకుస్వస్తిచెప్పియిట్లనియె.

గీ. భోజ నీయశోబ్ధి భువియును దివియును | శుక్తిపుటము లగుచు శోభిలంగ,
మొగిని దానఁ బొడముముక్తాఫలం బని మదిఁ దలంతుఁ జంద్రమండలమును.

అని చెప్పఁగా దానికి లక్షధనంబు రా జొసంగెను.

మఱియొకప్పుడు కాశ్మీరదేశమునుండి చనుదెంచినకాపీనావశిష్టుం డైనయొకకవి రాజుకడనుండుకవులను కనకమాణిక్యపట్టుకూలాలంకృతులను గాంచి రాజుతో.

చ. కరములు కంకణక్వణనక్రమతఁ గాంచవు కుండలప్రభో,
త్తరములు గావు కర్ణము లుదారపయోదధిదుగ్ధముగ్ధ మం,
బరమును లేదు చూపరులఁ బల్కిగిలింపఁగఁ జేయుపల్లకీ,
ల్దొరకవు మాకు రాజసభలోఁ బలుకం దగుశక్తి యొక్కటే.

అనఁగా రాజు వానికి లక్షధనం బొసంగెను.

ఒకప్పుడు రాజు రాత్రియందుఁ జంద్రమండలంబుం గాంచి దానిలో నుండుకళం కంబు ని ట్లని వర్ణించె.

ఉ. అంకముఁ గొంద ఱందురు శశాభిధ మందురు కొంద ఱంబుధిం,
బంక మటంద్రు కొంద ఱది భద్రకురంగ మటంద్రు కొంద ఱీ,

ఇ ట్లని పూర్వార్ధంబు వ్రాసి రాజు కాళిదాసునిచేతి కిచ్చిన నతండు.

పంకజవైరియందుఁ గల్రప్రాకృతినీలసదృక్షనీలిమం,
బింక నిశీథపీతతమ మిట్టులు గన్పడు నంచుఁ బల్కెదన్.

అనియుత్తరార్ధంబు సెప్పఁగా రాజు కనికిఁ బ్రత్యక్షరలక్షధనం బిచ్చెను. వెండి యుం గాళిదాసునికవితాపద్ధతిం గాంచి చమత్కృతుండై భోజుండు చెలికాఁడా అకళంకు నిం జందరుని వర్ణింపు మనఁగాఁ గవియు:

చ. సిరికిని కేళికాసరసిచెన్ను దనర్చెడి వెల్లయిల్లు; ది,
క్కరుణులకు న్సదర్పణము ; గ్రాలునిశాలతికాసుమంబు ; శ్రీ,
హరుస్మితపిండ ముజ్జ్వరునాతపవారణ మంబరాపగం,
బరగెడువెల్లదమ్మి శశి పార్చెడిఁ గౌముదివాపిక న్భువిన్.

అని చెప్పఁగా రాజు వెండియు నక్షరలక్షధనం బొసంగెను.

ఒకప్పుడు దూరదేశమునుండి వచ్చినవీణాకవి యి ట్లనియె.

ఉ. ఆరయలేదు తర్కమును వ్యాకరణంబుఁ బఠింపలేదు నే,
పారసుకావ్యనిర్మితివిశారదభావముఁ గాన నబ్ర మా,

సారసగర్భురాణి కరసారసవల్లకిరావసంగతో,
దారము గాఁగ నెద్దియొ ముదంబునఁ బల్కును మన్ముఖస్థయై.

అది విని రా జతనికి లక్షగనం బొసంగెను. బాణుఁడు వానిసులలిత మగుప్రబంధంబుం గాంచి.

చ. ధ్వనివిదు లంటఁబోరు లలితం బగుమాధురి మాలెతన్వలెన్,
గనరు రసాకులుల్ సుకులకన్యకఁబోలెను శాస్త్రనైపుణిన్,
చనుఘనసారరంకుమదసంక్రమసౌరభమట్టు లీద్వయం,
బనుగత మై కనంబడుట యందఱవీనుల కింపు నింపదే.

అని పల్కెను. ఒకప్పుడు రాజు సీతం గాంచి దేవి ప్రభాతంబును వర్ణింపు మనఁగా నది.

చ. కలిలోసజ్జనులట్లు తారకలు వేగ న్మాయఁ గాఁ జొచ్చె ; ని,
ర్మల మయ్యె న్నభ మెల్లచో మునిమనోరాజీవతుల్యంబు గాఁ;
దొలఁగె ధ్వాంతము సాధుచిత్తతతికి న్దూరస్థమై నట్లు ; వే,
గలఁగె న్రాత్రి నిరుద్యమప్రజలలోక శ్రీవలె న్మెల్లఁగన్.

రాజు దానికి లక్షగనం బొసంగి చెలికాఁడా సుకవీ నీవును ప్రభాతంబును వర్ణింపు మన నప్పుడు కాళిదాసుండు.

చ. రసపతిభాతి ప్రాచియును ప్రాప్తసువర్ణతఁ బింగ యయ్యె దా,
వెస గతకాంతి యయ్యె శశి వేమఱు గ్రామ్యసభ న్బుధేంద్రున,
ట్లెసకముమానె నుద్యమవిహీనుల కార్యములట్లు తారకల్,
పసచెడె దీపముల్ వినయభక్తివిహీనుగుణాళిచాడ్పునన్.

అని చెప్పఁగా రా జతనికిఁ బ్రత్యక్షరలక్షగనంబొసంగెను.

ఒకప్పుడు ద్వారపాలకుండు సనుదెంచి మహారాజా యొకతె మాలాకారునిపత్ని వాకిట నున్నదని రాజాజ్ఞచేఁ బ్రవేశపెట్టెను. అది ప్రవేశితయై నమస్కరించి పఠించుచున్నది.

ఉ. ‡ ఉన్నతపీనకుంభకుచయుగ్మసముజ్జ్వలతుంబికాఫలా,
పన్నవిపంచికాముఖరపాణిపయోజలు దేవతాంగనల్,
పన్నగధారిమౌళివిధుపాండురరోచిరుదీర్ణ మైననీ,
సన్నుతకీర్తిఁ బాడెదరు స్ఫారవినోదరసాకులాత్మలై.

---

శ్లో. ‡ సమున్నతఘన స్తన స్తబక చుంబితుంబీఫలక్వణన్మధురవీణయా విబుధలోకలోలభ్రువా। త్వదీయ ముపగీయతే హరికిరీటకోటిస్ఫురత్తుషారకరకందళీకిరణపూరగౌరం యశః.

ఇట్లు పల్కఁగా విని యారాజు యీపదపద్ధతి కడు గొప్పది యని దానికిం బ్రత్యక్షరలక్ష యొసంగెను. ఒకకాలంబున రాజు ధారానగరంబున సంచరించునొకనియింట తోఁకటితోఁ దంచుచున్నదాని నిండుజవ్వని సంపూర్ణపూర్ణిమాచంద్రబింబానన నతిసుకుమారావయవవిన్యాసం గనుంగొని దానిచేత నుండుముసలంబును సంబోధించి యిట్లనియె.

శ్లోకపదము. చ. ముసలమ నీకుఁ బల్లవసమూహములప్పుడ గల్గనందునన్.

అని చెప్పి మరునాఁడు సభయందుఁ బ్రాతఃకాలంబునం జనుదెంచినకాళిదాసునికిఁ దాఁ జెప్పినపద్యపాదంబును వచించి తక్కినమూఁడుపాదంబులు పల్కు మనఁగా నాకవిచంద్రుండు.

చ. * పస చెడినట్టికాష్ఠ మయి పాటిలుటల్ విజితం బదయ్యె నీ,
రస మగుకాననంబున నిరంతరవృద్ధిని గాంచు టొప్పు నా,
యసదృశనీలనీరజనిభాక్షికరగ్రహణోత్సవంబునన్,
ముసలమ నీకుఁ బల్లవసమూహము లప్పుడ గల్గనందునన్.

అని చెప్పినఁ గవికి రాజు మూఁడుగీటులకుం బ్రత్యక్షరలక్ష యొసంగె.

ఒకసమయంబున రాజు కడుఁదడవు జలక్రీడ సల్పి పరిశ్రాంతుండై కొలనిగట్టున నుండునొకవటవృక్షమునీడయందుఁ గూరుచుండఁగా నచ్చోటికి నొకరుఁడు సనుదెంచి.

మ. ధారాధీశభవచ్చమూభరరజోద్దామంబు నాకాశవి,
స్ఫారాభోగముఁ గాంచి దక్షిణమహీపాలుండు భీతి న్వడిన్,
సారంగాక్షులఁ బాసి శంకఁ జెడి లజ్జాశూన్యుఁడై వస్తుసం,
భారంబు ల్విడనాడి తా వెడలె నిర్బంధుప్రజాపత్యుఁడై.

ఉ. ఉరుసేనాభరభూరజఃపటలనీలోదారరుక్శ్యామలాం,
తరదిక్చక్రముఁ గాంచి సారసము లుత్సాహం బకాండోత్థితం,
బు రహిన్ గాంచ శిఖండివారములు సంభూతస్పృహ న్నర్తనా,
దరతం జెందుచు నుండు భోజనరనాథా నీమహాధాటులన్.

అని చెప్పినరాజకవికి లక్షద్వయం బొసంగెను. అప్పుడక్కడిచెట్టుకొమ్మ పైఁగూరుచున్న కాకిని మఱియొకకొమ్మయందుఁగూరుచుకోకిలంబునుగాంచి దేవజయుండనుకవి.

చ. చరణంబుల్ రుచిరంబులై వెలయ వా చంచూపుటం బన్న సుం,
దరమై యొప్పదు పల్కువాచ్యము గతుల్ తట్టాడు పక్షంబు పాం,

---

శ్లో. * జగతి విదిత మేత త్కాష్ఠ మేవాసి నూనం|తదపి చకిల సత్యంకాననేవర్ధితోసి|
నవకువలయనేత్రాపాణిసంగోత్సవేస్మిన్| ముసల కిసలయం తేతత్క్షణాద్యన్న జాతం.

డురమై యెప్పుడు క్రేంక్రుతుల్ ఖరగతిం దోఁతెంచు నిర్లజ్జ ని,
ర్భరవాచాటతఁ జూపె దిందు కరటా పాండిత్యముఁ జూపుచున్.

అని నుడువఁగా దేవజయకవి తన్నుం గాకవ్యాజంబున గర్హించినవాఁ డని తలంచి స్పర్థ పైకొన హరిశర్మ యనుసుకవి కోపంబు దీపింప నీర్ష్యాపూర్వకంబుగ నిట్లనియె.

గీ. తుల్యవర్ణచ్ఛదంబు లస్తోకగతుల । నొప్పుకోకిలములతోడ నోలిఁ గలసి,
యుండుకాకమ నిన్ను నెవ్వం డెఱుంగు । నీకు నీవ వెసం బల్కు నెఱపవేని.

అని చెప్పఁగా నాహరిశర్మదేవజయులకుఁ బరస్పరవైరం బుదిత మని యెఱింగి రాజు వారల నొండొరుల నాలింగనాదులు చేసికొనం జేసి వస్త్రాలంకారాదు లొసంగి మైత్రిం గావించె.

అంత నొకప్పు డుత్తరదేశమునుండి యొకఁడు సనుదెంచి రాజునకు స్వస్తివాచనికంబు వల్కి రాజు నీ వెయ్యెడనుండువాఁడ వని ప్రశ్న సేయఁగా నతఁడు.

గీ. ఎందు నంబువు లమృతంబు నిందసేయు। నంత్యజాతులు సయిత మాయమరపతులు,
తలఁపుమానికములు శిలాతలము లరయ। నందు మే ముందుమయ్య భోజాధిపేంద్ర.

అని చెప్పఁగా రా జతనికి లక్షధనం బొసంగి కాశీదేశంబునందు విశేషవార్త యేమి యని యడిగిన నాకవి రాజా దేవతలు దుఃఖంబున దీనులయి యున్నారు అనియిప్పు డత్యద్భుతవార్తయొకటి బుట్టెను. లోకులవలన వినంబడుచున్నది. అనఁగా రాజు నోవిద్వాంసుఁడా దేవతలకు దుఃఖం బేల యని యడిగిన నావిద్వాంసుం డిట్లనియె.

క. మన కిం కెందు నివాసము । కనకాచల మొసఁగె భోజకాశ్యపిపతి యం,
చని సురలు వ్యగ్రబుద్ధిం । దన రెద రని క్రొత్తవార్త ధారుణి బుట్టెన్.

అది విని రాజు కుతూహలంబున వెండియు లక్షధనం బాతని కొసంగెను.

అంత ద్వారపాలకుండు మహారాజా శ్రీశైలమునుండి చనుదెంచినయొకవిద్వాంసుండు బ్రహ్మచర్యనిష్ఠుండు ద్వారంబున నున్నాఁ డనఁగా రా జాజ్ఞ సేయఁ బ్రవేశితుండై బ్రహ్మచారి చిరంజీవ! యని పల్కిన భోజుఁడు ఓబ్రాహ్మణా బాల్యంబునందుఁ గలికాలాననురూపం బగునీవ్రతం బేమి? ప్రతిదిన ముపవాసంబులచేతఁ జిక్కిపోతివి. ఒకబ్రాహ్మణునికన్యను నీ కిప్పించెదను. నీవు గృహస్థనియమ మంగీకరించెదవా! యని యడుగ నాబ్రహ్మచారి ఓరాజా నీ వీశ్వరుఁడవు నీ కసాధ్య మే మున్నది.

ఉ. సారంగంబులు నెయ్యు రిండ్లు గవు లీశానర్షు లౌమాకు స,
త్సారంగాక్షియెశాంతి వన్యఫలవిస్తారంబుచే వృత్తియున్,
చీరంబుల్ వసనంబు నిర్వృతి మహాచిత్తాపహారంబు నొ,
ప్పారన్ మోక్షమునందు సైత మతిమోహం బాత్మ లే దెప్పుడున్

అని చెప్పఁగా రాజు లేచి పాదంబులపయింబడి యో బ్రాహ్మణా నాచేయవలసిన పని యేమి యని యడిగిన నా బ్రహ్మచారి రాజా మేము కాశీనగరంబునకుం బోవం గడంగియున్నారము. నీ వొకటి సేయుము. నీసజ్జనబునం గలపండితవరుల నందఱను వారి వారిపత్నులతో నాతోఁగాశికిఁ బంపుము. అట్లయిన గోష్ఠీపూర్ణుండనై తృప్తిఁ జెంది కాశికిం జనియెదను. అని చెప్పఁగా రాజు నట్ల కానిం డని తనపాల నుండుపండితుల కాజ్ఞసేయ వార లెల్లవారును చనిరి. కాళిదాసుం డొక్కరుండు మాత్రము పోలేదు. రా జతనిం గాంచి యో సుకవీ యేల పోకపోతివి. అని యడుగఁగా కాళిదాసుండు రాజుం గాంచి యో దేవా నీవు సర్వజ్ఞుండవుగదా.

గీ. అలబుధుల్ పోదు రిలను దీర్ఘాళిఁ జేర । నెవరు పవ్వుల నుందురు భవుని కింక,
నెవనిచిత్తంబునందు గౌరీశు డుండు । నతఁడె తీర్థంబు పరమంబ యగును భోజ.

అంత విద్వాంసులు కాశికిం జనఁగా రా జొకనాఁడు సభయందుఁ గాళిదాసునిం గాంచి చెలికాఁడా యిప్పు డేదేని నీవు వింటివా ? అని యడుగఁగా నాకవి.

ఉ. మందరకందరంబుల హిమక్షితిభృత్తటి మేరువందు శ్రీ,
చందనపర్వతంబున విశాలమహేంద్రశిలోచ్ఛయంబునన్
క్రందుగ వెండికొండను ధరాపతి నీయశ మచ్చటచ్చటన్,
విందును చక్రవాళచరవిశ్రుతచారణపఙ్క్తి బాడఁగాన్.

అని చెప్పగా రాజు చమత్కృతుండై ప్రత్యక్షరలక్షధనం బొసంగెను. ఇట్లుండఁగా రాజు తనవిద్వద్బృందంబు కాశికిఁజనియుండుటయు కాళిదాసుం డనవరతవేశ్యాలంపటుండై యుండుటయుఁ దలంచి ఔరా బాణమయూరప్రముఖులు నాయానతిం జేసిరి ; వీఁడు వేశ్యారసలంపటుం డగుటంజేసి నాయాజ్ఞ నాదరింపక యుండెడిని. ఇందు కేమి సేయవచ్చు నని చింతించి కాళిదాసు నవజ్ఞమెయిం జూచినఁ గవియు తనవిషయంబునందు రా జవజ్ఞఁ గావించె నని యెంచి యల్లాళదేశంబునకుం జని యాదేశాధిపతిపాలికిం బోయి రాజా మాళవేంద్రుం డగుభోజుండు న న్నవమానపఱుచుటంజేసి యిద్యోడకుం జనుదెంచినాఁడను. కాళిదాసుం డనుకవిని. అని చెప్పఁగా రా జతని నాసనంబునం గూరుచుండంబెట్టి యో సుకవీ భోజసభనుండి యిద్యోడకుం జనుదెంచినపండితులు నీమహిమంబు నుడివిరి. నిన్ను సరస్వతి యందురు. ఏదేని వచింపుము. అనఁగాఁ గవియు.

సీ. అల్లాళభూమిపాలాగ్రణి భవదీయశత్రుపురంబుల సంచరింప,
బోరుమత యొకతె దాఁ బుడమిఁ గీర్ణంబు లైయుండురత్నంబుల నోలి నేరి,
కొని ఖాదిరాంగారకుల మని శంకించి శ్రీఖండఖండముల్ చేరఁ దాని,
మీఁదట నునిచి పేర్మిని నేత్రములు మూసి యూఁదఁ గడంగిన నూర్పుగముల,

గీ. పరిమళములకుఁజనుదెంచి భ్రమరకులము। గమ్ముకొనధూమపటలంబు ప్రమ్ముకొనిరొ
ననుచుఁ జింతించి చింతించి యట్ల మఱియు। జేయుచున్నవి సూవె యదేయశక్తి.

అని చెప్పిన విని రా జతనికిఁ బ్రత్యక్షరలక్షధనం బొసంగె. అంత నొకప్పు డల్లాళరాజు కాళిదాసునిం గాంచి యోసుకవీ యీయేకశిలానగరంబును వర్ణింపు మని యడిగినఁ గవియు.

గీ. ఏకశిలలోన వర్తించునిందుముఖుల। కులుకువాల్చూపులన యువకులము లెల్ల,
వీధివీధుల శృంఖలావిసరబద్ధు। లగుచుఁ బొల్తురు ప్రతిపదమందు నెపుడు.

అని నుడువఁగా నల్లాళాధీశుఁడు కవికిం బ్రత్యక్షరలక్ష యొసంగెను. కవి వెండియు నిట్లనియె.

గీ. దీర్ఘికల నంబునిధిజాలదీర్ఘములను। గూడుప్రమదలనిడుకనుఁగొనలపాట్ల,
యువజనావళి విహితమై యుండుఁ బుండ। రీకసాయకశరసారరేఖికలను.

అని చెప్పఁగా నాతనికి వెండియు ప్రత్యక్షరలక్షధనం బొసంగెను. ఇటు కాళిదాసుం డక్కడన యుండె.

## —: మాఘకవిచరిత్రము :—

అత్తటి ధారానగరంబునందు ద్వారపాలకుండు రాజుపాలికిం జని దేవా ఖూర్జర దేశంబునుండి మాఘుఁ డనుపేరం బరఁగుపండితవరుండు సనుదెంచి నగరంబువెలుపల నుండి తనపత్నిని రాజద్వారంబునకుం బంపె నని చెప్పఁగా రా జామెను ప్రవేశపెట్టు మనఁ బ్రవేశితయయి మాఘపత్ని రాజుచేతికిఁ జీటి యొకటి యిచ్చిన దాని రాజు చదివెను. అందు.

చ. కుముదవనంబు శ్రీఁ దొలఁగెఁ; గూడెను శ్రీ సరసీజపాళికిన్;
సమసె ముదం బులూకములసంతతి; కందెను చక్రవాకముల్;
ప్రమదము శీతరశ్మికిని; భానుని కస్తమయోదయంబులున్
క్రమముగ నయ్యె; దైవహతకప్రకరోరువిపాక మబ్రమా.

అని వ్రాసియుండఁ గా నాయద్భుత మగుప్రభాతవర్ణనంబు విని మూఁడులక్షల ధనం బొసంగి మాఘపత్నిం గాంచి యోతల్లీ యిది భోజనంబుకొఱ కియ్యంబడినది. ఎల్లి రేపకడ నేఁ జనుదెంచి మాఘపండితునికి నమస్కరించి యాతనిం బూర్ణమనోర థునిం గావించె దను. అని చెప్పఁగా నామె యాధనంబుం దీసికొని పోవుచు యాచ కులు తనభర్తృగుణంబులను శారదచంద్రకిరణగౌరంబు లగువాని నుగ్గడింప విని వారల కు భోజదత్త మగుధనం బంతయు నొసంగి తనభర్త యగుమాఘునిపాలికిం జని నాథ! నన్ను భోజరాజు సన్మానించెను. అతఁ డిచ్చినధనంబు నంతయు నీగుణంబు లుగ్గడించు

వారల కొసంగితి ననఁగా మాఘుండు దేవీ! నీవుచేసినది సరే! అయితే యీయాచకులు పనుదెంచుచున్నారు కనుము. వీరల కే మియ్యనా! అనఁగా నొకపండితుఁడు మాఘుని వస్త్రావిశేషితునిగా నెఱింగి యాయర్థి యి ట్లనియె.

చ. ఖరకిరణోష్ణతప్త మగుక్ష్మాధరమండలి సేదదేర్చి భీ,
కరదవదగ్ధకాననికాయము నూఱటఁ జెందఁ జేసి యుం,
ర్వర నదముల్ నదుల్ వఱఁదవాఱఁగ నించి నిఃశేషరిక్తతన్,
బరఁగెద వి ప్పుడియ్యదియ బంధురలక్ష్మి పయోద నీ కగున్.

అని చెప్పఁగా విని మాఘుండు తనపత్నితో దేవీ! వినుము.

ఉ. లేదు ధనంబు; పాయదు బలిష్ఠము డెందమున న్దురాశ; దా,
మోదము గాంచుచుండు మది మూర్ఖత దానమునందు; యాచ్ఞయో,
ఖేదము లాఘవంబుఁ గనిపించును; దోస మ దాత్మహత్య పో,
కా దిఁక యేడ్చుచుంట; చనఁగావలెఁ బ్రాణములార మీ కిఁకన్.

అని పల్కఁగా విని యాచకులు మాఘపండితునియవస్థం గాంచి యందఱును తమతమస్థానంబులకుం జనిరి. ఇట్లు యాచకులెల్ల యథాయథలై చనఁగా మాఘుం డి ట్లనియె.

గీ. పొండు పొండు ప్రాణపుంజంబులార మీ । రర్థిజనులచేత వ్యర్థభావ,
మందినారు వారి కనుగంతులై పదఁ । డిట్టితోడు దొరకు టెంతమేలో.

అని విలపించుచు మాఘుండు పరలోకగతుం డయ్యె. భర్తృమరణంబునకు వగచుచు నతనిపత్ని యి ట్లనియె.

గీ. ఎల్లకాలము సేవింతు రనని గృహము । భూమిపతు లందఱును దాసభూతు లగుచు,
మాఘపండితుఁ డిపుడు భామాసహాయు । డగుచునిదెఁబంచతంజెందెఁదగుల మెడలి.

అంత రాజు మాఘుఁడు మృతుం డయ్యె నని విని నూర్వురు బ్రాహ్మణులు బలసికొని రాఁగా నగరంబు వెడలి రాత్రి యయ్యెడకుం జని తన్నుం గాంచి మాఘపత్ని రాజా పండితోత్తముం డగుమాఘుఁడు నీదేశంబునకుం జనుదెంచి పరలోకగతుం డయ్యెఁ గాన నీతని జరపఁదగుకృత్యశేషంబుచే బాగుగ నారాధింపం జనును అనిచెప్పఁగా వల్లెయని మృతుండైనమాఘుని నర్మదాతీరంబునకుం గొనిచని యథోక్తవిధిని సంస్కారంబు సేయ మాఘపత్ని వహ్నిం జొచ్చె. పుత్రునిచందంబున వారల కెల్ల చరమకృత్యంబులు రాజు గావించె.



అంత మాఘకవిమరణంబుచేతను కాళిదాసవిరహంబుచేతను పండితులు దేశాంతరగతులగుటచేతను శోకసమాకులుండై రాజు బహుళపక్షచంద్రునిచందంబున దినదినమునకు క్షీణింపం దొడంగ నమాత్యు లందఱును గూడి యల్లాళదేశంబునఁ గాళిదాసుం డుండెడిని

ఆతనిం దోడ్కొని రాఁగా రాజు సుఖితుం డగు నని యాలోచించి యొకపత్రంబున నొకటి వ్రాసి యొకయమాత్యునిచేతి కిచ్చి పంపిరి. వాఁడు క్రమక్రమంబుగఁ గాళిదాసునికడకుం జని భోజునమాత్యులచేఁ బంపఁబడితి నని చెప్పి నమస్కరించి యాపత్రం బొసంగెను. దానినిఁ గాళిదాసుండు జదివెను. అంగు.

గీ. కలుగ దొకనాఁడు కోపంబు గలిగెనేని । తడవు నిల్వదు నిల్చిన దాని కొక్క,
ఫలము నాపట్టఁ బోదు దుష్పృథ్వీసఖ్య । మట్లు సుజనులకోపంబు నమరుచుండు.

గీ. బాలకోకిల సహకారపాదపమున । నిండువేడుక నుంటివి నెమ్మి మీఱ,
దాని నెడబాసి యన్యపాదపములందు । జేరి తిరిగెదు మదిలోనసిగ్గు లేదే.

గీ. కలకంఠ చూతమున నీ । పలుకులకును శోభ గలుగుపగిదిఁ గలుగునే,
యిలలో ఖదిరపలాశం । బులయం దారయుము నీవు పాలు పొందంగన్.

అని వ్రాసి యుండఁగాఁ గాంచి ప్రభాతంబున నాభూపాలుని వీడ్కొని మాళవదేశంబునకుం జనుదెంచి భూమిపతిక్రీడోద్యానంబున నుండెను. అంత రాజు కవివరుని రాక యెఱింగి గొప్పపరివారంబుతోఁ దాన చని యాతనిం దోడ్తెచ్చి సమ్మానించెను అంతం గ్రమంబుగ విద్వన్మండలంబును రాఁగా నాభోజపురిపత్తు తొల్లిటివిధంబునం బ్రకాశించెను.

అంత నొకనాఁడు భోజుఁడు సింహాసనమున నుండఁగా ద్వారపాలకుండు సనుదెంచి ప్రణతుండై నిలిచి మహారాజ జాలంధరదేశమునుంచి యొకకవి వచ్చియున్నాఁ డని చెప్పి రాజుముదలఁ గొని ప్రవేశపెట్టెను. ఆవిద్వాంసుఁడు సభయందుఁ బేరోలగం బుండు రాజును జగన్మాన్యులఁ గాళిదాసాదులను కవిపుంగవులను గనుంగొని బద్ధజిహ్వుండునుం బోలెనేమియుఁ బల్కక యూరకుండెను. అప్పుడు రాజు నోవిద్వాంసుఁడాయేదేనివచింపుమనఁగా వాఁడు.

గీ. కలి గళము గాలు నని యేమొ కమలగర్భ। వనిత నాముఖమును దాన వాసిపోయె,
కాన రిపుభూమిపాలకకమలవాసి నీ కచగ్రహణవ్యగ్రనిజకరేభి । శుంఠ నాకుఁ
గవిత్వంబు శూన్య మయ్యె.

అని చెప్పఁగా రాజు వానికి మహిషీశతం బొసంగెను.

మఱి యొకప్పుడు రాజు సీతం గాంచి కౌతుకంబున నోదేవి సురతంబును వర్ణింపుమనఁగా నది.

క. సురతంబునకును మ్రొక్కెద । ధర జగదానందహేతుతాసంస్తుతమై,
నరపతి మిముబోంట్లకు ఫల । మరయఁగ ననుపక్తి మగుచు నగుఁ దానఁ దగన్.

అని చెప్పిన రాజు సంతుష్టుండై దానికి హారం బొసంగెను.

అంత భోజుఁడు చామరగ్రాహిణి యయినవేశ్యం గాంచి కాళిదాసునితో నోమ హాకవీ యీవేశ్యను వర్ణింపు మనఁగా దానిం గనుంగొని కాళిదాసుం డి ట్లనియె.

గీ. † కుచభరంబు భయంపడుఁ గచభరమున| కలకచభరంబు కుచముల కలుకుఁజెందు, కచకుచభరంబునకు నుల్కు ఘనజఘనము| కంబుకంఠిరో యీచమత్కారమేమొ.

అని చెప్పఁగా భోజుఁడు సంతసించి తాను నిట్లు పఠించుచున్నాఁడు.

గీ. ‡ వదనమున కుల్కెడిని బిట్టు పదయుగంబు | వచనములకును మోవి, పల్వరుస యులుకు | కచభరంబున కులుకును గుచభరంబు, కన్నుదోయియు మధ్యంబుఁ గాంచి యులుకు.

మఱి యొకప్పుడు భోజుఁడు ధారానగరంబున నొంటిరిగా సంచరించుచు నొకవి ప్రవర్యునిగృహంబునకుం జని యయ్యెడ నొకపతివ్రతను దనతొడలపయిం బరుండినభ ర్తను దాలుచుచుండుదానిని గనుంగొనియె. అంత నామెకుమారుఁడు శిశువు నిదురనుండి

---

శ్లో. † కచభారా త్కుచభారః | కుచభారా ద్భీతిమేతి కచభారః | కచకుచభారాజ్జఘనం | కోయం చంద్రానసే చమత్కారః.

కచభరము అంధకారము గానను కుచభరంబు జక్కవలు గానను దానికి భయంపడును. రాత్రివేళ చక్రవాకంబులు జోడువీడి శ్రమపడును. కచభారము శైవాలమునకు సరి యయినది గానను కుచము లేనుఁగుకుంభములవంటివి గానను కుచంబులకుఁ గచభారము భయపడుచున్న దనిభావము. ఏనుఁగులు ప్రాఁచితీవియలం గాంచిన నుల్లాసంబునం బెఱికివేయుట వానికి స్వభావగుణము. జఘన మిసుకతిన్నియల కొప్పుయినది గనుకను కచభారకుచభారంబులు మేఘములకును బర్వతములకు నొప్పయినవి గనుకను కచకుచభారములకు జఘనము భయపడుచున్నది. మేఘములు వర్షింపఁ బర్వతములపైనుండి సెలయేళ్లు ప్రవహించి యిసుకదిన్నెలలను ముంచివేయుచుఁ బాయలుపాయలుగాఁ జీల్చివేయును.

శ్లో. ‡ వదనా త్పదయుగళీయం వచనా దధరశ్చ దంతపఙ్క్తిశ్చ | కచతః కుచయుగళీయం లోచనయుగళించ మధ్యత స్త్రసతి.

పదయుగళము తామరపువ్వులు గాన మోముం గాంచి చంద్రుఁ డని భయపడుచున్నవి. చంద్రకిరణములు సోకినఁ దామరలు మొగడును. వచనము చిల్కపల్కులవంటిది గాన దొండపంటివంటియధరమును దాడిమీబీజంబులవంటిదంతములును భయపడుచున్నవి. చిలుక బింబంబును దాడిమీబీజంబులను భక్షించును. కచభరంబు రాత్రివంటిది గానఁ జక్కవలవంటికుచములు దాని కులుకుచున్నవి. లోచనయుగళంబు హరిణంబులు గానను మధ్యము సింహము గానను నడుమునకుఁ గన్నుదోయి భయపడుచున్నది. అనిభావము.

లేచి యగ్నిజ్వాలకు సమీపంబునకుం జనియె. ఆబ్రాహ్మణకాంత పతిధర్మపరాయణ గానఁ దనపతిని నిదురలేపక యుండెను. ఇంతలోపల నాశిశువు వహ్నిలోఁ బడియె. వాని నెత్తలేదు. రా జీయాశ్చర్యంబుం గాంచుచు నిలుచుండెను. అంత నామె వైశ్వానరునిం బ్రార్థించె. ఓయజ్ఞేశ్వర! నీవు సర్వకర్మసాక్షివి. సర్వధర్మంబుల నెఱుంగుదువు. కాన నాశిశువు ననుగ్రహింపం జాలినవాఁడ వనుగ్రహింపుము దహింపకుము. అనుచు ధ్యానసమారూఢ యయి యుండెను. అంత శిశువు యజ్ఞేశ్వరునిం బ్రవేశించి యతనిని హస్తంబునం బట్టుకొని యరగడియదనుక నంద యుండెను. తదనంతర మకస్మాత్తుగ పతి నిదుర మేల్కాంచఁగా నామె గ్రక్కునం జని శిశువును గైకొనెను. ఆపరమధర్మంబుం గాంచి నృపతి విస్మయావిష్టుండై నాభాగ్యం బేమనవచ్చు; నిట్టిపుణ్యకాంతలు సయితము నానగరంబునం దున్నారు గదా? అని తలంచుకొనుచుంబోయి మఱునాఁడు ప్రాతఃకాలంబున సభకుం జని సింహాసనంబునం గూరుచుండి కాళిదాసునిం గాంచి యి ట్లనియె.

సమస్య. ఉ. చందనపంకశీతలతఁ జయ్యనఁ జెందె హుతాశనుం డొగిన్,

అని చెప్పఁగాఁ గాళిదాసుండు తక్కినయూఁదుగీటులనుగ్రక్కున నిట్లు పఠించుచున్నాఁడు.

ఉ. ముందట నగ్నిలోఁ బడెడుముద్దులపట్టిని గాంచుచుండియున్,
సుందరి యాత్మనాథు సుఖసుప్తుని నిద్దురలేపదయ్యె నా,
యిందుముఖీలలామహృదయస్థితభర్తృసుభక్తిపెంపునన్,
జందనపంకశీతలతఁ జయ్యనఁ జెందె హుతాశనుం డొగిన్.

అని చెప్పిన రాజు తనయభిప్రాయం బెఱింగి చెప్పినందులకు విస్మయంబుం జెంది కవీంద్రునిం గౌఁగిలించుకొని యతనియడుగులపయి వ్రాలెను.

మఱియు నొకప్పుడు గ్రీష్మకాలంబునందు రా జంతఃపురంబున సంచరించుచు ఘర్మతాపతప్తుండై యాలింగనాదులు సలుపకయ వారలతో సరససల్లాపాద్యుపచారములనుభవించి యర్ధ్యోడన నిదురఁగూరెను. ప్రాతఃకాలంబున లేచి రాజు సభం జొచ్చి కా తూహలంబున నిట్లు పఠించెను.

సమస్య. చ. ఐర మగుమారుతాగమునవార్త యదెట్టిదొ గానరాక ని,
ర్భరపరితాపభారపరిభావితమై సమయుంబు దోఁపఁగా,

అని చెప్పిన భవభూతి యి ట్లనియె.

చ. ఉరగియు నాకటం బడలుచుండెడికందువ కాననానిల,
స్ఫురితము లైన ఘూత్కృతులఁ జుమ్మలచుట్టలు వాపెఁ బ్రీతితోన్.

---

†. చుమ్మలచుట్టు=వేదనపడు=కృదంతముఉప్రత్యము. వేదనపడుటయనియర్థము.

అని చెప్పఁగా రాజు భవభూతీ! లోకోక్తి బాగు పచించితివి. అని శ్రీకంఠం గాంచఁ గాళిదాసుండు;

ధరణి విలాసు తౌజనులు తామరసాక్షులయందుఁ గ్రొత్తగా,
తరహిని గాంచి రాసఁ గనుదమ్ములచేతన గౌఁగిలింతలన్.

అని చెప్పిన తనయభిప్రాయం బెఱింగివచించినందులకుఁ గాళిదాసుని విశేషముగ సన్మానించె.

ఒకప్పుడు రాజు మృగయాపరవశుండై కడు బడలి యొకసరోవరతీరంబున నిబిడచ్ఛాయ గలజంబూవృక్షమునడుగునం గూరుచుండెను. అయ్యెడ రాజు పరుండునప్పుడు జంబూతరూపరిభాగంబునఁ బెక్కులు కోఁతులు నేరేడుపండ్లను దులిపెను. అవి శబ్దంబు గలుగునట్లు బ్రద్దలు చుండం గాంచుచు గడియసేపుమాత్ర ముండి శ్రమం బపనీతము కాఁగా లేచి తురగాధిరూఢుండై చని సభయందు రాజు పూర్వానుభూతకపిచలితఫలపతనశబ్దం బనుకరించుచుఁ గైపదం బొసంగెను. గుళుగుగ్గుళుగుగ్గుళు,, అనఁగాఁగాళిదాసుండు.

క. పండినజంబూఫలము ల | ఖండగతిని వానరాళికంపితశాఖా
షండములనుండి జలముల | మెండై గుళుగుగ్గు శనుచు మేకొని పడియెన్.

అని పల్కఁగా భోజుఁడు సుకవీ? యదృష్టం బయ్యును పరహృదయం బెట్లెఱుంగుదువు? సాక్షాత్కరించినశారదాదేవివే యగుదువు. అని యతనియడుగులపయిం బడియె.

ఒకప్పుడురాజు ధారానగరంబునం బ్రచ్ఛన్నవేషంబునం దిరుగుచు మధ్యాహ్నసమయంబున నొకవృద్ధబ్రాహ్మణునియింట నిలిచెను. అప్పు డావృద్ధవిప్రుండు వైశ్వదేవంబుఁ గావించి కాకబలిం గైకొని గృహంబు వెడలి జలశుద్ధ మయినభూమియం దునిచి కాకిని బిలిచెను. అప్పుడు చేతులు తట్టుటచేతను హాహా యని యఱచుటచేతను కాకములు వచ్చి చేరఁగా నం దొకటి క్రూరముగఁ గూసెను. అది విని యతనిపత్ని భయపడినదానిచందంబున చేయి ఱొమ్మున నిడుకొని యోయాయమ్మా యని కూఁత వేసెను అంత బ్రాహ్మణుఁడు ప్రియురాలా సాధుశీలురాలా! యేల భయంపడియెద వని యడుగఁగా నాయింతి యోనాథా మావంటిపతివ్రతాకాంతలకు క్రూరధ్వనిశ్రవణంబసహ్యంబు గాదె! యనఁగా నావిప్రుండు నోసాధుశీలా యది యట్లె! యని చెప్పెను. అంత రాజు సర్వంబు నావృత్తాంతంబుం గాంచి తనమనంబున నౌరా యీతరుణి దుశ్శీల యగుట నిక్కము. వ్యాజంబు లేక భయపడుచున్నది. తనపాతివ్రత్యంబుఁ దాన యుగ్గడించుచున్నది. నిక్కంబుగ నిది నిశ్చయంబుగ నతిదారుణకర్మంబు రాత్రియందు రచించు నని

తలంచి యయ్యేడన రా జంతర్హితుండై రాత్రియు నుండెను. అంత నిశీథంబునందు భర్త నిదురింపఁ గా నది మాంసపుఁబెట్టియను వేశ్యహస్తంబున మోపించుకొని నర్మదానదీ తీరంబునకుం జనియె. రాజును తన్నెఱింగింపక వెంబడిన చనియె. అంత నది నర్మదను జెంది యయ్యేడకు సమాగతంబులైన గ్రహంబులకు మాంసం బొసంగి నదిం దాఁటి యావలిగట్టున నుండుశూలాగ్రారోపితుం డైనతనమనోహరునితోఁ గ్రీడించెను. ఈచరిత్రము బుం గాంచి రాజు గృహంబున కరుగుదెంచి ప్రాతఃకాలంబున సభయందుఁ గాళిదాసునితో నోసుకవీ విను మని యి ట్లనియె.

గీ. పగలు కాకికూయ భయపడుఁబడఁతి దా,,

అనఁగాఁ గాళిదాసుండు,

గీ. దాటు రాత్రి నర్మదను వలంతి,,

అనఁగా రాజు సంతసించుచు మెండియు నిట్లనియె.

గీ. కలవు దానినీట గ్రాహసంఘాతముల్,,

అనఁగాఁ గాళిదాసుండును.

గీ. మర్మ మెఱుఁగునట్టిమగువ యదియు.

అని చెప్పఁగా రాజు కాళిదాసునిచరణంబుల కెరగెను.

ఒకప్పుడు ధారానగరంబునం దిరుగుచు వేశ్యవీధియందు రాజు కంతుకక్రీడాతత్పరయైయొకతె భ్రమణవేగంబునఁ బాదపతితం బగుశ్రవణావతంసకంబుతో నొప్పునొకసుందరిం గనుంగొనిపచ్చి సభయందుఁ గవులార కంతుకంబును వర్ణింపుఁ డని వచించెను. అని చెప్పఁగా భవభూతి యి ట్లనియె.

గీ. ఎఱుకపడ దేసూవె నీయుల్ల మెలమిఁ గంతు | కంబ ప్రమదాసుధాధరబింబలోభ,
మునన యెగిరెగు పలుమాఱుమోహనాంగి | కరసరోజాభిహతులనుగనుచుఁగనుచు.

అని వచింపఁగా వరరుచి యి ట్లనియె.

గీ. ఒకటి యయ్యును గందుక మువిదహస్త | రాగమున రక్తరక్తమైరమణియడుగు,
గోటిజిగి గౌరగౌర మై | కులుకుఁగనుల కాంతిచే నీలనీలంబు గాఁగఁ దోఁచె.

అంతఁ గాళిదాసుం డి ట్లనియె.

చ. కులుకుంగుబ్బలసొరుగైకొనుటకుం గోపంబు పెంపారఁగాఁ ?
గలకంఠీమణి చేతఁ బం దఁడఁచుటల్ గన్గొంచుఁ దా సారకు,
త్పలపత్రం బది నేత్రకాంతికిని భీతంబై వెసం ద్రెళ్లె నా,
కలికి స్వేదుకొనంగ దచ్చరణయుగ్మంబందు నే ర్పొప్పఁగన్.

అనఁగా విని రాజు సంతసించి ముప్పురకును బ్రత్యక్షరలక్షఘనం బొసంగె. అవతంసకుసుమంబు పడుట చూడకయ యెఱింగి పల్కిన కాళిదాసుని విశేషముగ సన్మానించె.

ఒకప్పుడు రాజు చిత్రకర్మావలోకనతత్పరుండై చిత్రలిఖితు మహాశేషునిం గాంచి బాగుగ వ్రాయంబడి యున్న దనియెను. అప్పుడు శివశర్మ యనుకవి శేషుని నెపంబున రాజును స్తుతించుచున్నాఁడు.

క. కప్పలు దినఁగోరదు నా | సప్పంబులు పెక్కు లుండు సర్వక్షితి జా,
నొప్ప భరింపఁగఁ జాలెడి | సప్పము శేషుం డొకండె సమ్మతిఁ జూడన్.
అది విని రాజతని యభిప్రాయం బెఱింగి వానికి లక్షఘనం బొసంగెను.

ఒకప్పుడు హేమంతకాలంబు సంప్రాప్తం బయిన జ్వలించుచుండుకుంపటిం గాచుకొనుచు రాజు కాళిదాసుం గాంచి సుకవీ యీకుంపటిని వర్ణింపు మనం గవి యిట్లనియె.

క. † బహుళోహా మగుచుఁ గవిమతి | రహిం; సుఘటితచక్రయై కరంబు ప్రభాతం,
బువారువున హరునికాయము | రహి నొప్పు హసంతి ధూమరహితానల యై.
అది వినిరాజతని కక్షరలక్ష యొసంగె.

ఒకప్పుడు భోజుఁడు ఐనింట భోగార్హలై తుల్యగుణంబులతో నొప్పుచుండునల్వురం దనయంగనలం దలంచి వారలలోఁ గుంతలేశ్వరునికూఁతురు పద్మావతి ఋతుస్నాతయయి యుండుటయు నంగరాజుకూఁతురు చంద్రముఖికిం గ్రమప్రాప్తియుఁ గమలాదేవి ద్యూతపణంబు గెల్చుటంజేసి ప్రాప్తకర్తృరా లగుటయు నగ్రమహిషి యగులీలాదేవి మాతిక నంపి పిలిపించుటయు నను నాల్గుగుణంబుల నారయుచు వానిలో న్యూనాధిక భావంబును చింతించుచు నంతట దాక్షిణ్యనిధి గాన రాజరాజగు శ్రీభోజభూపతి రెండు

---

టీ. † హసంతి=కుంపటి, కవిమతిరహిన్=కవియొక్క బుద్ధివలె. బహుళోహా= విశేషించినయూహలుగలది (యనికవిమతిపరము) బహుతరమగులోహముగలది (యనికుంపటిపరము) యగుచున్=అగుచు, ప్రభాతంబువారువున=ప్రభాతంబురీతిని, సుఘటితచక్ర =కూర్పంబడినజక్కవపులుగులుగలది (యనిప్రభాతిపరము) చక్రవాకంబులురాత్రియె డబాసియుండి ప్రొద్దుపొడవఁగాఁ జేరుకొనును. బాగుగనమర్పంబడినచక్రములుగలది (యనిహసంతిపరము) ఐ=ఆయి, హరునికాయమురహిన్=హరునిమూర్తివలె, ధూమరహితానలయై=పొగలులేని యగ్నిగలదియై,(ఈయర్థము రెండుపక్షములందుదుల్యము) ఒప్పును=వెలుంగును.

మూఁడుగడియలకాలముండి విశేషంబు నిర్ధారణ సేయలేమి నిదురఁ గూరెను. ప్రాతఃకాలంబున నాహ్నికకృత్యంబులు గావించుకొని సభకుంజనుదెంచి సింహాసనాసీనుండై సకలవిద్వత్కవిమండలమండనుం డైనకాళిదాసునిం గాంచి సుకవీ? యీసమస్యను వినుమని యిట్లు వల్కె.

సమస్య. నిశ్చయముఁ జెందకయుండెను గొన్నినాడికల్.

అనఁగాఁ గాళిదాసుండు.

ఉ. కుంతలరాజుకూఁతు రది కోమలి స్నానము చేసియున్న; దా,
కాంతకు వార మంగపతిగాదిలిచెల్లెలి; కింక రేయి యే,
కాంతమునందుఁ దాఁ గముల కామిని జూదమున న్జితాత్మయై,
యెంతయు సంతపించెడిని యింపు సహింపఁగ వేడుకోవలెన్,
పంతుగ ; నంచు నంతిపురి భామలలోపల తారతమ్యమున్,
చింతిలురాజు,, నిశ్చయముఁ జెందక యుండెను గొన్నినాడికల్.

అని చెప్పఁగాఁ దనహృదయంబు నెఱింగి పల్కినకాళిదాసునియడుగులపై వ్రాలెను. విద్వద్బృందంబును చమత్కారంబు నొందెను.

ఒకప్పుడు ధారానగరంబున సంచరించుచు రా జొకయెడఁ బూర్ణకుంభంబుఁ దాలిచి సనుదెంచునట్టిపూర్ణచంద్రానన నొక్కతెను విలోకించి యాకుంభజలంబునందు నొకశబ్దంబును విని నిక్క మిది దీనికంఠగ్రహంబున రతికూజితమువోలెఁ గూయుచున్నది యని యనుకొనుచు సభయందుఁ గాళిదాసునితో ని ట్లనియె.

కూజితంబు రతికూజితమే,,

అనఁగాఁ గాళిదాసుండు ;

క. $ ఓజ విదగ్ధత సుముఖత । భ్రాజత్కటిసీమ కుపరిభాగస్థితియున్,
రాజాస్యగళాశ్లిష్టత । రాజిల్లం గూజితంబు రతికూజితమే,,

---

$ ఈపద్యమునకు రతికార్యోద్యుక్తనిపర మొకయర్థము. ఘటపరముగా నొకయర్థము. మొదటియర్థంబునందుఁ జమత్కారము. ఓజ=కాంతి, విదగ్ధత=సామర్థ్యము, (మొదటియర్థము) మిగులఁగాల్పఁబడియుండుట. (రెండవయర్థము) సుముఖత=అభిలాప (మొ) మంచినోరుకలిగియుండుట (రెం) భ్రాజత్కటిసీమకున్=ప్రకాశించునట్టికటిదేశమునకు, ఉపరిభాగస్థియున్=పైభాగమున్ననునికియు, (రెండర్థములుసమానములు) రాజాస్యగళాశ్లిష్టత=చంద్రానన చేసియుండుకంఠగ్రహంబును, (రెండర్థములుసమానములు) రాజిల్లన్=ప్రకాశింపఁగా, కూజితంబు=శబ్దము, రతికూజితమే=రతికూజితమేయగును. వైదగ్ధ్యము సౌముఖ్యము. కటిసీమోపరిభాగస్థితి కాంతాకరకృతగళాశ్లేషము. ఇన్ని కలిగియుండంగాఁ గలిగినకూజితము రతికూజితము గాకపోవునా? యని భావము.

అని చెప్పఁగా రాజు కవికి అక్షరలక్షధనం బొసంగి సన్మానించెను.

ఒకప్పుడు నర్మదానదియందునొకమహాహ్రదంబున జాలరులకు నీషద్ధ్వంసితాక్షరం బగుశిలాఖండం బొక్కటి కనంబడియె. అది గాంచి వారు దీనియందేమియో వ్రాసియుం డునట్లు తోఁచుచున్న యది రాజుకడకుం గొనిపోఁజను నని యెంచి భోజునికడకుం దెచ్చిరి. అది గాంచి భోజుండు పూర్వము భగవంతుండు హనూమంతుండు శ్రీమద్రా మాయణంబు రచించె. అది నవీనులు ఈహ్రదంబునం బడవైచి రని విందు. దీనియం దేమి వ్రాయంబడియున్నదో అవశ్యంబుగఁ దెలిసికొనవలయు నని విచారించి లిపిజ్ఞుల రావించి జతుపరీక్షణంబునఁ దెలిసికొనవలయు నని విచారించి లిపిజ్ఞుల రావించి జతుపరీక్ష చేసి యక్షరంబులం గనిపెట్టి పఠించెను.

ఉ. ప్రాణులకుం బురాకృతవిపాకము హా విషమంబు చూడఁగాఁ,

అని చదివి దీనికిం బూర్వార్థము వచింపుం డన భవభూతి యిట్లనియె,

ఉ. ఏణవిలోచనాభిజన మెక్కడ నిష్కలుషంబు; భూమి నా,
రాణికి దైత్యసంగ మనురట్టడి గల్గుట యేడ యెల్లచోఁ ;

అని చెప్పఁగా నాభవభూతి వచించినదానియందు దైత్యసంగ మనుచోట ధ్వని దోషంబు గలదని తలంచి దాని రాజొండువిధంబుగఁ బఠించెను.

ఉ. రాణియు రామచంద్రునికి రాజితకీర్తివిదేహభూతు సైఁ,
రాణఁ దెలంగు టేడ ; ఖలరాక్షసమందిరవాస మేడకో,

అనిసవరించి కాళిదాసునిం గాంచి నీవు కవిహృదయంబు పల్కు మనఁగా నాతఁడు,

ఉ. స్థాణుశిరంబులోన నెవి తద్దయు వేల్గెనొ తొల్లి; గృధ్రపా,
శ్ఛేణులతోడ దొర్లెడిని చెంతల నయ్యవి మూర్థముల్ ధరన్.

అని చెప్పఁగా భోజుం డాశిలాఫలకంబు పూర్వపుటంబును జతుపరిశోధన చే యింప నందుఁ గాళిదాసుండు చెప్పినదే యుండెఁ నతనిసామర్థ్యంబునకుంగడుసంతసించె

☞ ఇయ్యెడ బ్రహ్మరాక్షసునివ్యాకరణసమస్యలు కవి పూర్ణములు గావించి నకథ గలదు ఇది కాళిదాసచరిత్రప్రకరణమునందు చక్కగా వివరింపఁబడినది గాననిందు విడువంబడియె.

ఒకప్పుడు భోజుండు సింహాసనంబున నుండ దౌవారికుఁడుసనుదెంచి దక్షిణ దేశ మునుండి కౌపీనావశేషుండు మల్లినాథకవినాథుండు ద్వారంబున నున్నాఁ డనిచెప్పి రాజాజ్ఞ వడసి యతనిం బ్రవేశపెట్టిన నాకవి రాజాజ్ఞచే నుపవిష్టుండై,

చ. † మదమున నాగ; మంబుధరమండలిచే గగనంబు రాత్రియుక్,
సదమలపూర్ణచంద్రరుచి; సారసలోచన శీలసంపదన్;
కదమునఁ దేజి; మందిరము గ్రాలు మహోత్సవరాజి; వ్యాకృతిన్,
సదమలవాణి; హంసములసంతతిచే నదులెల్ల; సత్సభా,
సదనము పండితాళిఁ; గడు సత్సుతుచేతఁ గులంబు వెల్గుఁ; భం,
పాదవెడి భూమి నీవలన; నొప్పెడి భానునిచేఁ ద్రిలోకముల్.

అది విని రాజు ఓవిద్వాంసుఁడా నీయుద్దిష్టం బేమి చెప్పుమన నతఁడు.

గీ. అంబ కోపపడెడి నదియు నాతోఁ గాదు | కనలు కోడ లల్లె గాదు మమ్మ,
ఏను కోపపడుదు నిర్వరపైఁ గాదు | దోష మెవ్వనిదిమొ చోఁచ దధిపా!
అనిచెప్పఁగా రాజుదారిద్ర్యదోషంబనియెంచికవినిసంపూర్ణమనోరథునింగావించె.

## —: క వి శే ఖ ర చ రి త ము :—

ఒకప్పుడు ద్వారపాలకుండు రాజుకడకుం జనుదెంచి దేవా కవిశేఖరుం డనువాఁడు ద్వారంబున నున్నాఁ డనఁగా రాజు ప్రవేశపెట్టు మనెను. అంతం గవి సనుదెంచి స్వస్తి యని పల్కి యిట్లనియె.

క. * వారణ మందితి నే దొ | వారికువలనన మదోరువారణ మాశ్మన్,
గోరితి నీవలనను పృథి| వీరమణ యొసంగు మదియు వేగమ నాకున్.

అది విని ప్రాఙ్ముఖుండై కూరుచుండినరాజు కడు సంతుష్టుండై యాప్రాగ్దేశం బంతయును కవి కియ్యంబడినది యని యెంచి దక్షిణాభిముఖుండు గాఁగాఁ గవి యది గాంచి యేమి యిది రాజు పెడమోము గావించుకొని యున్నాఁ డని చింతించి దక్షిణదేశమునకుం జని యెట్టయెదుట నిలువంబడి.

గీ. ‡ అధిప భవదీయచాపవిద్యానిరూఢి| కర మపూర్వం బదెక్కడఁ గఱచితివిభో,
మార్గణౌఘంబు సనుదెంచు మాటిమాటి | కిని గుణం బది పోవు దిగ్వితతిఁ బట్టి.

---

శ్లో. † నాగో భాతి మదేన ఖం జలధరైః పూర్ణేందునా శర్వరీ | శీలేన ప్రమదా జవేన తురగో నిత్యోత్సవై ర్మందిరం | వాణీ వ్యాకరణేన హంసమిథునై ర్నద్య స్సభా పండితైః | సత్పుత్రేణ కులం త్వయా వసుమతీ లోకత్రయం భానునా.

శ్లో. * రాజన్ దౌవారికాదేవ ప్రాప్తవా నస్మి వారణం | మదవారణ మిచ్ఛామి త్వత్తో హం జగతీపతే. వారణశబ్దమునకు ఏనుఁగు అని మొదటియర్థము. నివారణ మని రెండవయర్థము.

శ్లో. ‡ అపూర్వేయం ధనుర్విద్యా | భవతా శిక్షితా కథం | మార్గణౌఘ స్సమాయాతి గుణోయాతి దిగంతరం. మార్గణౌఘము=బాణములసమూహము, (రెండ)యాచకులగుంపు. గుణము=అల్లెత్రాఁడు (రెండ). సద్గుణము.

అని చెప్పఁగా రాజు విని యాదిశను సయితము కవి కొసంగితి నని తలంచి ప్రత్యఙ్ముఖుం డగుడు కవియయ్యెడకుం జని,,

క. * నిను సర్వజ్ఞుం డనుచుఁ | బనుపడి పల్కుట లబద్ధభాషలు గావే,
కని యర్థిని లే దనుపద | మును బల్కంగా నేర వంద్రు ముజ్జగములలోన్.

అని చెప్పఁగా రా జాదేశంబునుసయితము కవి కొసంగినట్లు తలంచి యుదఙ్ముఖుం డగుడు కవి యయ్యెడకుం జని.

క. † సర్వదుఁ డని విబుధులు నిను | సర్వత్ర నుతించుట లసత్యం బరులా,
నుర్వీశులు పృష్ఠముఁ బర | పర్వెందాననలురంబు ప్రాపింపరుగా.

అని చెప్పఁగా నంత రాజు సమస్తభూమిని కవి కొసంగితి నని గొంచిలేచెను. కవి యతనియభిప్రాయం బెఱుంగక వెండియు ని ట్లనియె.

క. ‡ కనకపుధారల నెల్లెడ | ఘనముగ వర్షింప నీవు కడకన్ బూనన్,
వినుదౌర్భాగ్యచ్ఛత్రము | నను ఛన్నుఁడనైనన న్ను నాడవు బోట్టెల్.

అప్పుడు రా జంతఃపురబునకుం జని లీలాదేవితో దేవి రాజ్యం బంతయుఁ గవి కొసంగితిని. నాతోడఁ దపోవనంబునకు రమ్మని చెప్పుచుండగా నాసమయంబున విద్వాంసుండు వాకిటికిం జనియె. అచ్చట ముఖ్యామాత్యుం డగుబుద్ధిసాగరుండు పండితునిం జీరి రాజు నీకేమిచ్చె నని యడిగినఁ వాఁడు తన కేమియు రా జొసంగలేదని చెప్పఁగా నీవు రాజుకడం బల్కినశ్లోకంబులు వచింపు మని మంత్రి యడిగి యాపండితుండు తాఁ జెప్పినశ్లోకములు నాల్గును వచింపుడు బుద్ధిసాగరుండు సుకవే నీకుఁ గోటిద్రవ్యం బొసంగెదను. రాజు నీకిచ్చినదానిని విక్రయింపు మనఁగాఁ గవి యట్ల యొనర్చె. అంతం గోటిధనం బొసంగి యాకవి నంపి యమాత్యుండు రాజుపాలికిం జని నిలిచియుండెను. అప్పుడు రా జతనిం గాంచి బుద్ధిసాగర యీరాజ్యం బంతయును కవి కొసంగితిని. పత్నులతోడఁ దపోవనంబునకుం జనుచున్నాఁడను. తపోవనంబున నీకు నపేక్ష గలదేని నాతోడ రమ్మ అనఁగా నమాత్యవర్యుండు రాజా ఆకవి కోటిద్రవ్యమూల్యంబునకు రాజ్యంబు

---

శ్లో. * సర్వజ్ఞ ఇతి లోకోయం భవంతం భాషతే మృషా | పద మేకం నజానీషే వక్తుం నాస్తీతి యాచకే, సర్వజ్ఞుడనుటకు లే దనుపదంబును తెలిసియుండవలెను గదా. అది యెఱుంగనివానికి సర్వజ్ఞత్వ మెట్లగు నని భావము.

శ్లో. † సర్వదా సర్వదోసీతి మిథ్యా త్వం కథ్యసే బుధైః | నారయో లేభిరే పృష్ఠం నవక్షః పరయోషితః.

శ్లో. ‡ రాజన్ కనకధారాభి స్త్వయి సర్వత్ర వర్షతి | అభాగ్యచ్ఛత్రసంఛన్నే మయి నాయాంతి బిందవః.

విక్రయించె. పండితునికి కోటిద్రవ్యం బియ్యంబడియె. కాన రాజ్యంబు నీయదియ భుజింపుము అని చెప్పెను. అప్పుడు రాజు బుద్ధిసాగరుని విశేషముగ సన్మానించెను.

ఒకప్పుడు రాజు మృగయారసంబున నడవిని సంచరించుచు లలాటంతపుం డగు తపనునిచే గ్లానిం జెంది పిపాసాపర్యాకులుండై తురంగమం బెక్కికొని యుదకారై యరుగుచు సమీపతటభూములం దిరిగి యవి లభింపమి పరిశ్రాంతుండై యొకమహావృక్షమునడుగునం గూరుచుండి యయ్యెడ నొకగోపకన్యక సుకుమారమనోజ్ఞసర్వావయవములుగలది యావృశ్చికంబుగ ధారానగరమునందుఁ దక్రంబు విక్రయింపం గోరి తక్రభాండంబును మోసికొని రాఁగా దానిం గాంచి రాజు పిపాసావశంబున నీభాండంబున నుండునది గ్రోలం దగిన దయ్యేనేని గ్రోలెద నని పల్కి యోజవ్వనీ నీవు మోయున దేమనఁగా నాగోపకన్యక ముఖశ్రీఁ గని భోజుం డనియెంచి యతనికిం బిపాస కలిగియుండుటయు నెఱింగి యతని మోముం గాంచుటవలనఁ బొడమిన ఛందోరూప మగువచనంబున ని ట్లనియె.

క. * హిమకుందశంఖశశిరుచి । సమమును పక్వసుకపిత్థసమగంధంబుఁ,
రమణీకరమథితము నీ । సుమథితముం గ్రోలు రోగశోకహారంబుఁ.

అని చెప్పఁగా రాజు సంతుష్టుండై యది యిచ్చిన తక్రంబును గ్రోలి యాకాంతం జూచి యోసుభ్రు నీయభీష్టం బేమి యని యడిగిన నాపడఁతి యావిష్కృతయౌవనగాన మదనపరవశయై మోహమునఁ గన్నులు వ్యాకులపడ రాజా నన్నుం గన్యక యని యెఱుంగుము అనిచెప్పి వెండియు ని ట్లనియె.

ఉ. చందురునందుఁ గైరవిణి; చక్రతతు ల్దిననాథునందు; మా,
కందమునందుఁ దాను పికకామిని; చాతకప జ్త్తి నీరదం,
బందును; బ్రోషితప్రియునియందు గులాంగన మాడ్కిఁ; జూచి నా
నందము నొందుచుండు హృదయంబు నిరంతరమూస ని న్నొగిఁ.

అని చెప్పఁగా రాజు చమత్కారంబు నొంది సుకుమారీ నిన్ను లీలాదేవియను మతిం గొని స్వీకరింతునని చెప్పి దానిని ధారానగరంబునకుం దోడ్కొని వచ్చి యక్లేయాకన్యకం బెండ్లాడెను.

ఒకప్పుడు రాజాభిషేకసమయమందు మదనశరపీడిత యగునొకమదిరాక్షి కరంబునుండి హేమఘటంబు జాఱి సోపానంబులందుం బడి శబ్దించెను. అంత రాజు సభకుం

శ్లో. * హిమకుందశశిప్రభశంఖనిభం । పరిపక్వకపిత్థసుగంధరసం,
యువతీకరనిర్మథితం మథితం । పిబ హేనృప సర్వరుజాపహరం.

జనుదెంచి కాళిదాసునితో నోసుకవీ యీసమస్యను పూర్ణము గావింపు మని యిట్లనియె.

టంటంటటంటంటటటంటటంటం.

అది విని కాళిదాసుండు.

గీ. భూధవునిస్నానసమయానఁబోదలుమదన | మదముచే ఘూర్ణిలుచునుండు మగువచేతి| నుండి జాఱినబంగరుకుండ మెట్ల| యందు టంటంటటంటటటం మ్మనుచుమ్రోగె.
అని చెప్పఁగా రాజు తనయభిప్రాయం బెఱింగివచించినకవిని విశేషముగ సన్మానించెను.

ఒకప్పుడు భోజుఁడు మృగయాపర్యాకులుండై వనంబున సంచరించుచు విశ్రమంబుం గోరి యొకతటాకంబు నాశ్రయించియుండి శ్రమంబున నిదురఁగూరి భాస్కరుం డపరపయోనిధికుహరంబుం బ్రవేశింపఁగాఁ బ్రత్యూషసమయంబున నగరంబునకుం జనం బయనంబై రాజు చరమగిరినితంబలంబమానం బగుశశాంకబింబంబుఁ గాంచి కుతూహలంబున సభకుం జని సమీపముననుండుకవీంద్రులం జూచి యీసమస్య యొసంగెను.

చ. చరమగిరిం దనర్చు ఘనసానువిలంబము చంద్రబింబమున్,
అనఁగా భవభూతి,
అరుణసురోచిజాలముల నాకస వృక్షవిహీనమైతగెన్,
అని పల్కఁగా దండియు,
కర మిలఁ జల్ల తెమ్మెరలు కల్యమునందును వీచెమెల్లనన్,
అని వచించినయనంతరము కాళిదాసుండు,
పరలెను కామినీవితతి పల్లభముక్తనిజోష్ఠబింబమై,
చరమగిరిందనర్చుఘనసానువిలంబముచంద్రబింబమున్.

అని చెప్పఁగా భోజుం డందఱను సన్మానించి కాళిదాసుని విశేషముగ సన్మానించెను.

అంత భోజుండు నగరంబునకు వెలుపల నూతన మగుతటాకజలంబుల నాబాల్య సాధిత మగుకపాలశోధనాదులు చేసికొనఁగా నది హేతువుగ నొకమీనశాబకము రాజు కపాలంబునం జొచ్చి వికటకరోటికానికరంబునుండి వెడలి రాదయ్యె. అంత రాజు తనపురి కరిగెను. అదిసుత రాజునకుం గపాలవేదన కలిగెను. అచ్చటనుండుభిషగ్వరుల చే బాగుగఁ జికిత్సచేయంబడి యుపశమింపకయుండ నిట్లహర్నిశంబును కడు నస్వస్థ శరీరుండై రాజు నమానుషవిదిత మగుమహారోగంబుచేత బాధపడఁగా,,

శా. క్షామక్షామ మదయ్యె దేహము సుఖౌఘుం బేదుచున్; మోము నా,
హేమంతాబ్జమువోలె సైంహికముఖాహిగ్రస్తచంద్రాకృతిన్;

రామామండలి షండుచందమునఁ గార్యంబందుఁ బో దుల్ల; మి,
ల్లారామంబున శుష్కశాఖిశిఖినా హత్తె స్వైస న్వ్యాధియుణ్.

ఇట్లు సంవత్సరకాలం బతిక్రమింపఁగా నెవ్వఁడేనియు నారోగమును నివారితము సేయకుండ భోజుండు నానావిధౌషధముల సేవించియుఁ బ్రయోజనము లేక రోగదుః ఖితమానసుండై సమీపమున శోకసాగరమునందు మునింగి యేమియుం దోఁచక యుండు బుద్ధిసాగరునిం గాంచి మెల్లనిమాటల నెట్టకేలకు ని ట్లనియె. బుద్ధిసాగర యింక మాకు రోగంబుఁ బాపువైద్యుం డెవ్వండును లేఁడు. వైద్యుల నారాజ్యమువలన వెడలనడుచుము. బాహటాదు లగు వైద్యకోశంబుల నెల్ల నీటం గలిపి రమ్ము. నాకు దేవసమాగమ సమయము సంప్రాప్త మయి యున్నది. అనఁగా విని పౌరులును కవులును అవరోధ సమాజంబులును కన్నుల బాష్పంబులు గార నేడిచిరి. అప్పుడు దేవసభయందు శచీపతి నారదమునిం గాంచి భూలోకంబునందలివార్త యేమి యని యడుగఁగా నారదుండు సురనాథ యొకయాశ్చర్యంబు గలదు ధారానగరవాసి భోజభూపాలుండు రోగాక్రాంతుండై కర మస్వస్థశరీరుండుగ నున్నవాఁడు. అతనిరోగము నెవ్వాఁడును పోఁగొట్టలేదు. కాన నతఁడు తనదేశంబునుండి భిషగ్వరులను వెడలంగొట్టెను. వైద్యశాస్త్రంబుసయిత మనృత మని నిరసింపంబడియె. అని చెప్పఁగాఁబురందరుండు సమీపమున నుండునశ్వినీదేవతలంగాంచి యోస్వర్వైద్యులార ధన్వంతరీయ మగుశాస్త్రము సత్యము కాదా యేమి ? యని యడిగిన నాయశ్వినులు సురేశా యీశాస్త్ర మనృతంబు గాదు. మఱి యమరుల కెఱుకపడు రోగంబున భోజుండు బాధపడుచున్నాఁడు. అనఁగా నింద్రుఁడు నట్టియవార్యరోగం బేమి. మీకుం దెలియునా ? యని ప్రశ్న సేయ వారలు భోజుండు కపాలశోధనంబు సేయకుండఁ దన్మూలకముగఁ బాఁటినంబు ప్రవేశించి యీరోగమును గలిగించె నని చెప్పుడు నింద్రుండు నవ్వుచు నట్లయిన నిప్పుడ మీరలు చనవలయు పోకపోతిరేని యింక భూలోకంబునందు భిషక్ఛాస్త్రంబున కసిద్ధి గల్గు. ఆభోజుఁడు సరస్వతివిలాసమునకు నికేతనం బగువాఁడు. శాస్త్రంబుల నుద్ధరించినవాఁడు. అని ముదలయిడఁగా నాసుకేంద్రునాదేశంబున నాయిరువురును బ్రాహ్మణవేషంబుం దాలిచికొని ధారానగరంబున కేతెంచి ద్వారపాలకునిం గాంచి మేము వైద్యులము. భోజునికిం దెల్పుము భోజుండు వైద్యశాస్త్రంబు నంగీకరింపం డని విని యాశాస్త్రంబుఁ బ్రతిష్ఠింపను అతనికి రోగనివారణంబు సేయుటకును కాశీదేశమునుండి వచ్చినారము. అని పల్కఁగా ద్వారపాలకుండు నోవిప్రులారా యెట్టివైద్యునేనిఁ బ్రవేశపెట్టం జన దని రాజు చెప్పియున్నాఁడు అతఁడిపుడు కర మస్వస్థశరీరుండు గాన విజ్ఞాపనంబునకుసయిత మిది యవకాశంబు గాదు. అని పల్కుచుండఁగా నాక్షణంబునన కార్యవశంబుచే వెలుపలికివచ్చినబుద్ధిసాగరుండు

వారలం గాంచి మీర లెవ్వార లని యడిగెను. వారలునుతమరాకకుం గారణముఁజెప్పిరి. అంత రాజుసమీపంబునకుం దోడ్కొనిపోఁబడిన రాజు వారలంగాంచి ముఖకాంతిచే నమానుషు లని తలంచి యీరోగము వీరలు నివర్తింపం జేయఁగల రని నిశ్చయించివారల బహుమానించెను అంత వార లిట్లనిరి. రాజా భయపడకుము రోగము నివృత్తం బయ్యె. అయితే నీ వొకయేకాంతస్థలంబునకు రాఁ జనును. అనఁగా రాజునట్ల యొనర్పుడు వారు రాజును మోహమూర్ఛంబున మోహింపంజేసి శిరఃకపాలంబునెత్తితత్కరోటికాపుటంబున నుండుశఫరకులంబును గైకొని యొకపాత్రంబున నునిచిసంధానకరణిచేతఁ గపాలంబుం దొల్లింటిచందంబున నమర్చి సంజీవినిచేత నతనిం బ్రతికించి యతని కామీనంబులం గానిపించి రా జదిగాంచి విస్మయం బందుచు నిది యే మని యడుగఁగా రాజు బాల్యంబుఁ దొట్టి పరిచితం బగుకపాలశోధనంబువలన సంప్రాప్త మయినదనిచెప్పఁగా భోజుఁడు వారల నశ్వినులఁ గా నెంచి వారలం బరీక్షింపం దలంచి మాకుం బథ్య మే మని యడిగెను.

గీ. జలముల నశితముల స్నానచర్య దినము। పాలు స్నిగ్ధోష్ణభోజనప్రాశనంబు,
మానుషులు! మీకుఁ బథ్యమా మహిప వినుము.

అనఁగా నడుమ మానుషు లని సంబోధనంబుండుట విని మేము మానుషుల మయిన మీర లెవ్వార లని వారిహస్తంబుల గ్రక్కునం బట్టికొనఁగా వా రనంతరచరణంబు కాళిదాసుండు పచించు నని చెప్పుచు నంతర్హితు లైరి. అంత రాజు విస్మితుండై యందఱఁ బిలిపించి వృత్తాంతంబు దెల్పెను. విని యెల్లవారు చమత్కారంబు నొంది విస్మితు లైరి. అంతఁ గాళిదాసుండు.

పాదిలు నెలజవ్వనపుఁబూవుబోండ్లపొందు,,

అని చెప్పఁగా రాజు కాళిదాసుని కరము సన్మానించెను. అంత భోజనరపాలుండు కందళత్కాంతియై శుక్లపక్షచంద్రునిచందంబునఁ గ్రమాక్రమంబుగ వృద్ధిం గాంచె.

అంత నొకనాఁడు భోజుండు కాళిదాస, భవభూతి, దండి, భట్టబాణ, మయూర, వరరుచి, ప్రముఖకవికులతిలకంబులచే నలంకృతంబై యుండుసభయందు సింహాసనంబునం గూరుచుండియుండ ద్వారపాలకుండు సనుదెంచి. మహారాజా యొకకవి సనుదెంచి వాకిట నుండి గాథాసనాథం బగుచీటి యొకటి యిచ్చి రాజసభయం దుంచుమని చెప్పి పంపె. ఇదిగో! పత్రిక యన రా జాపత్రికం గైకొని చదువుచున్నాఁడు.

ఉ. ‡ బాల యొకర్తు కాంతునికి బానిసచేతఁ గరండ మంపుచో,
వ్యాళము భీతమున్ హరుని వాయుతనూభవుఁ జంపకంబుఁ దా,
న్నోలి లిఖించె భావ మెది యో వచియింపుడు మల్లినాథుఁ డీ,
లీలలఁ బ్రశ్న చేసెడి లలి న్సభనుండెడుపండితేంద్రులన్.

అని చదువఁగా విని విద్వత్పరిషత్తు కడు నాశ్చర్యంబుం జెందె. అంతం గాళిదాసుండు రాజా మల్లినాథకవిని గ్రక్కునఁ బిలిపింపుము. అనఁగా రాజు న ట్లొనరింప సభాప్రవేశంబు వడసినమల్లినాథుండు రాజునకు స్వస్తి యని చెప్పి తదాజ్ఞచేతం గూరుచుండుఁడు భోజుండు విద్వాంసుఁడా మల్లినాథకవీ ! నీరచించినగాథ సాధువై యొప్పెడిని. అనఁగాఁ గాళిదాసుండు సాధువనిమాత్రమేనా చెప్పవలెను. అని చెప్పి కవిం గాంచి దేశాంతరగత యగుకాంతచారిత్రవర్ణనంబున శ్లాఘనీయుండ వైతివి. అందును విశేషించి తద్భావప్రతిభటవర్ణనంబునం గొనియాడం దగినవాఁడ వనఁగా భవభూతి పంక్తికం

శ్లో. ‡ కాచి ద్బాలా రమణవసతిం ప్రేషయంతీ కరండం దాసీహస్తా త్సభయ మలిఖ ద్వ్యాళ మస్యోప రిష్ఠం । గౌరీకాంతం పవనతనయం చంపకం చాత్ర భావం పృచ్ఛ త్యార్యా న్సదసి నిపుణాన్ మల్లినాథః కవీంద్రః.

ఇచ్చట బాల యనునది సమర్తాడుపరువంబున నుండునది. ఇది తనభర్త దేశాంతరమునకుం బోయి యుండఁగాఁ దాను పుష్పవతియయ్యెను. ఈవిషయము తనభర్తకు నెఱుకపఱిచి వానిని రమ్మని చెప్పిపంపుచున్నది. ఎట్లనిన :—ఈకామిని తనదాసికిం బిలిచి దానిచేతి కొకబరణి యిచ్చి యాబరణిపయిన సర్పము మొదలగువానిని లిఖించెను. ఇవి యన్నియుఁ బైన వ్రాయంబడియుండుటచేత నాబరణిలో నొకకుసుమ ముంపంబడినట్లు వ్యక్త మగుచున్నది. ఆకుసుమము సాధారణ మయినది యేదియే నొకటి గానుండవచ్చును. ఇది తాను పుష్పవతి యయినందుకు జ్ఞాపకముగా నుంచఁబడినది. పుష్పశబ్దము రెండర్థముల బోధించును. పవనతనయాదులను వ్రాయుట లోపలఁ గుసుమ మున్నదని యెఱింగించుటకేకాని వేఱుగాదు. మొదట బరణిపై వ్యాళమును వ్రాయుట లోపలికుసుమపరిమళమును మారుతుఁ డపహరింపకుండుట కనిభావము. సర్పము గాలిని భుజించునుగానదానికి గాలి భయపడి దగ్గఱకు రాదు. గౌరీపతిని వ్రాయుట యేల యనఁగా:—మన్మథుఁడు తాను బాణమని యపహరించుకొని పోవును. వానికి విరోధిశివుఁడు. మన్మథుఁడు దగ్గరకు రాకుండునట్లు శివుఁడు వ్రాయఁబడియెను. పవనతనయుని నేల వ్రాసెనఁగా:—సూర్యుఁడు బరణిలో నుండుకుసుమంబును తనకిరణములచేత వాడిచి వేయకుండంజేయుటకు ; సూర్యుని మ్రింగఁబోయినవాఁడు హనుమంతుఁడు గాఁబట్టి వానిని చూడఁగానె సూర్యుఁ డూగకుండకపోఁడని భావము. చంపకము నేల వ్రాసెనఁగా:—తుమ్మెదలకు పుష్పమును చూచినచో దానిని మర్దనసేయుట స్వభావము. చంపకకుసుమము తుమ్మెదలకుదలదిమ్ము పుట్టించుటంబట్టి యవి దానియుండుచోటం జేరవు గానసంపగియు వ్రాయంబడియె.

తోద్యానవైరి యగువాత్మాజునివర్ణనంబునంజేసి యిది విశేషాదరణీయం బయ్యె ననఁగా రాజు కరము ప్రీతుండై మల్లినాథునికి లక్షసువర్ణంబును ఐదుగజంబులును పదితురంగంబుల నొసంగె. విద్వాంసుండు ప్రీతుండై రాజును సంస్తుతించుచున్నాఁడు.

గీ. భోజనీదానజలమహాపూరమునన | యంబునిధి గల్గె ననుచు నే నాత్మఁ దలఁతు,
కానిచో దానఁ బుట్టినమ్రాను తాయి | పశువు నిమ్మాడ్కి దానతత్పరతఁ గను నే.

అని చెప్పిన లోకోత్తర మగుశ్లోకంబు విని రాజు అతనికి మూఁడులక్షలధనం బొసంగె. అంత భాండారికుండు ధర్మపత్రంబునందు † సభయందు విరహిణీగూఢనర్మోక్తిపద్యంబును విని భోజుండు ప్రీతుండై లక్షసువర్ణంబులను పదిగుఱ్ఱంబులను ఐదునాగంబుల నొసంగెను. అంత నయ్యేడన యతఁడు వితరణగుణంబును వర్ణించుటంబట్టి ప్రీతచేతస్కుండై లక్షంబును లక్షంబును వెండియు లక్షంబును మరల నామల్లినాథకవికి నొసంగెను.

అంత నొకనాఁడు భోజరాజు కాళిదాసునితో సుకవీ నీవు మాకుఁ చరమగ్రంథంబుఁ బఠింపుము. అనఁగాఁ గవి కోపగించుకొని రాజును దూఱి క్షణంబున నాదేశంబు మానుకొని విలాసవతితోడ నేకశిలానగరంబునకుం జనియె. అంతం గాళిదాసవియోగంబుచేత శోకాకులతం జెంది యాకాళిదాసుని వెదకుటకు రాజు కాపాలికవేషంబుం దాల్చి సొరిది నేకశిలానగరంబుం జొచ్చెను. అంతం గాళిదాసుండు యోగిం గాంచి సామపూర్వకంబుగ యోగీ నీవుండుచో టెది? యని యడిగిన యోగియు మేము ధారానగంబున నుండువార మనఁగాఁ గాళిదాసుండు నందు భోజుండు కుశలియె యని యడుఁగఁగా యోగి నే నేమి చెప్పఁగల ననినఁ గవియు నం దతిశయవార్త గలదేని సత్యంబు పల్కుము అనఁగా యోగి భోజుండు దివంబుం బ్రాపించె నని చెప్పెను. అంతఁ గవి భూమిపయింబడి యోరాజా నిన్నుం బాసి మేము క్షణంబును భూమియందు నుండలేము. నేను నీసమీపమునకు వచ్చుచున్నాఁడను అని విలపించి విలపించి చరమశ్లోకంబుం జెప్పె.

శ్లో. అద్య ధారా నిరాధారా నిరాలంబా సరస్వతీ,
పండితాః ఖండితాస్సర్వే భోజరాజే దివంగతే.

---

† శ్లో. ప్రీత శ్శ్రీభోజభూపః స్సదసి విరహిణీగూఢనర్మోక్తిపద్యం | శ్రుత్వా హేమ్నాంచ లక్షం దశచ స తురగాన్ పంచనాగా నయచ్ఛత్ | పశ్చాత్తత్రైవ సోయం వితరణగుణసద్వర్ణనా త్ప్రీతచేతాః | లక్షం లక్షంచ లక్షం పునరపి చ దదౌ మల్లినాథాయ తస్మై.

అని చరమశ్లోకఁబు పఠింపఁబడుడు భోజుఁడు సంజ్ఞాశూన్యుండై భూతలంబు పయిం బడియె. అంతఁ గాళిదాసుం డవ్వినంబున నుండునాతనిం గాంచి యితఁడు భోజుండయని నిశ్చయించుకొని ఓరాజా నీవు నన్ను మోసపుచ్చితివిగా యని చెప్పి యాశ్లోకంబును ప్రకారాంతరంబుగఁ జదివెను.

శ్లో. అద్య ధారా సదాధారా సదాలంబా సరస్వతీ,
పండితా మండితాస్సర్వే భోజరాజే భువం గతే.

అని చెప్పఁగా భోజుండు లేచి కాళిదాసుని నాలింగనముచేసికొని ప్రహృష్టుండై యాతనిం దోడ్కొని ధారానగరంబునకుం జని సుఖంబుగ రాజ్యపరిపాలనము గావించు చుండెను.



ఇది శ్రీమదాంధ్ర భోజచరిత్రంబున భోజరాజకవిరాజ చరితంబునందు
ద్వితీయాశ్వాసము సర్వంబును
సంపూర్ణము.

